# హైదరాబాదాంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

[సంవత్సరమునకు నాల్గు సంచికలు]

సం ౧ | హైదరాబాద్ - దక్కన్ | ఏప్రిల్ 1945 | సంఖ్య ౧

## విషయసూచిక

నమోనిర్వికల్పా! నిరాకారరూపా!
నమో విశ్వవిన్యాసలీలాకలాపా!
మనస్సున్ వచస్సున్ నమస్సున్ తపస్సున్
విధేయంబుగా నుంచి ధ్యానింతు మీశా!
అసహ్యాహిరాజన్య మందారవాటిన్
కొనల్ సాగనీ నిత్యకళ్యాణశాఖల్
దనన్ రాజ్యలక్ష్మీ లలాటంబునందున్
లిఖించెన్ ప్రజాసౌఖ్య సంపన్నరేఖల్
నదుల్ కట్టి నిల్పెన్ మహాసాగరంబుల్
మరుక్షేత్రముల్ కూడ ముక్కారు పండన్
అవిజ్ఞాన గాఢాంధకారంబు దూలన్
వెలింగించె విద్యాకళాదీపమాలల్
అహోరాత్రముల్ దేశదేశీయసౌఖ్యం
బుపాసించు ఉస్మానలీఖాను పాద్షా
ప్రజాపాలనా నీతిచాతుర్య ధుర్యున్
కళాకావ్య మాధుర్యకేళీ సపర్యున్
కటాక్షింపుమీశా! కృపాపాంగరక్తిన్
చిరారోగ్య సౌభాగ్యముల్ చెంగేలింపన్
ప్రజాపాళిపోలెన్ మనంబున్ బ్రోచు పాద్షా
యశోగీతముల్ భక్తి పాడింపు దేవా!

# స్వవిషయము

హైదరాబాదునందలి సాహిత్యోపాసకులు కొందఱుచేరి పాండిత్యపరిశోధనలు ముఖ్యముగా ఇక్కడ సాహిత్యాభివృద్ధికొఱకు యథాశక్తిగా పనిచేయగల సంస్థయొకటి యుండిన అవసరమును పర్యాలోచించి "హైదరాబాదాంధ్ర సాహిత్య పరిషత్తు" అను పేర స్థాపించిరి. ఇది 1940 సంవత్సరము అక్టోబరునెలలో జరిగెను. ఈ క్రిందివారు స్థాపక నిర్వాహకులుగా కార్యక్రమ మారంభింపబడెను.

ఆచార్య రాయప్రోలు సుబ్బారావు, అధ్యక్షుడు
కురుగంటి సీతారామయ్య
శ్రీ తూములూరు శివరామకృష్ణశాస్త్రి
శ్రీ మొహమ్మద్ ఖాసింఖాన్, కార్యదర్శి

పరిషదుద్దేశ్యములలో క్రిందివి ప్రధానములుగా నిర్ణయింపబడినవి:

(1) హిందూ ముస్లిములు పరస్పరము ఒకరిసంస్కృతిని ఒకరు అర్థముచేసుకొనుట కుపకరించు గ్రంథములను ప్రచురించుట.

(2) ఆంధ్రమునందు ఉత్తమరచనలను ప్రచురించుట.

(3) నిజాంరాజ్యమున లభించు ప్రాచీన తాళపత్ర గ్రంథములను సేకరించుట, భద్రపరచుట, అపూర్వములు ప్రకటించుట.

(4) ఆంధ్రసంస్కృతి, ఆంధ్రభాష, ఆంధ్రవాఙ్మయము, వీనియందు పరిశోధనలు, వ్యాఖ్యానములు, విమర్శలు సలుపుట.

(5) ఒకటి ఆంగ్లమునను, ఒకట ఆంధ్రమునను రెండు త్రైమాసిక పత్రికలను ప్రచురించుట. పరిషత్సభ్యులయొక్కయు, ఇతర

పండితులయొక్కయు పరిశోధన వ్యాసములకు ఇందు తావిచ్చి తోడుపడుట.

తెలుగు భాషను గురించియు, సాహిత్యమును గురించియు, ఇతరులకు తెలియజేయుటకును, ఆంధ్రప్రతిభను ఆంధ్రేతరులకు తెలియజేయుటకును వ్యాసములు ఆంగ్లపత్రికయందుండును. ఆంధ్రభాషా వాఙ్మయ జాతి చరిత్రములకు సంబంధించిన విషయములును, ఆంధ్రేతర సాహిత్యములలో గొప్ప కావ్యములనుండి యనువాదములును, ఆంధ్రేతర భాషా వాఙ్మయ చరిత్రములు, మున్నగు విషయములును తెలుగు పత్రికయందుండును.

(౯) అప్పుడప్పుడు ఉత్సవములను జరుపుచు ఆంధ్రసంస్కృతికి సంబంధించిన విషయములపై ప్రఖ్యాత పరిశోధకుల ఉపన్యాసములను, చర్చలను, చిత్రకళాప్రదర్శనములను ఏర్పాటుచేసి, ఆంధ్రసంస్కృతి విస్తృతికి తోడ్పడుట. సుప్రసిద్ధులైన ఆంధ్రభాషా సాహిత్య చారిత్రకపరిశోధకులను, ఇతరాంధ్రప్రముఖులను గౌరవ సభ్యులుగా నుంచుట కాహ్వానింపవలయుననికూడ తీర్మానింపబడెను.

పైవిషయములవల్ల ఈపరిషత్తునకు కేవలసారస్వత చారిత్రక భాషా వాఙ్మయసేవయే ఆవశ్యమనియు, తన్నిర్వాహమున స్థానికదృష్టి ముఖ్యవిషయమనియు విశదముకాగలదు. పై యుద్దేశ్యములతో జరిగినకృషికి తొలిపంటయే ఈపరిషత్తు ప్రథమవత్సరమున కావించిన క్రింది ప్రచురణములు.

(1) అనర్ఘప్రభువు (ము.ను. ప. సప్తమ అసఫ్జాప్రభువువారి ప్రథమ పంచవింశతివర్ష రాజ్యచరిత్రము) 370 పుటలు.

(2) ఖుర్-ఆన్-షరీఫ్. (ప్రథమభాగము) 145 పుటలు.

(3) నవ్యాంధ్రసాహిత్య వీధులు; 1827–1942 వరకు
ఆంధ్రసాహిత్య చరిత్రము. 620 పుటలు
(4) ఖుర్-ఆన్-షరీఫ్. (రెండవభాగము) 200 పుటలు.
(5) కొందరు తంజావూరు కవులు, పండితులు
(పరిశోధకవ్యాసములు) 185 పుటలు.
(6) ఆంధ్రవాఙ్మయ చరిత్ర. (ఆంగ్లము) 150 పుటలు.

ఈ గ్రంధములు ప్రచురించినతరువాత ప్రథమోత్సవముచేయ సంకల్పము కలిగెను. తదనుసారముగా 1943 సంవత్సరము డిసెంబరు 14, 15, 16, 17 తేదీలలో కాశీ హిందూ విశ్వవిద్యాలయోపాధ్యక్షులును సుప్రసిద్ధాంధ్రులు నగు డాక్టరు సర్. సర్వేపల్లి రాధాకృష్ణ ప్రముఖుని అధ్యక్షులుగను, మ. ఘ. వ. నిజాంప్రభుత్వ విద్యాశాఖామాత్రులగు నవాబ్ సర్. మెహిది యార్జంగు బహాదూర్ వారు ప్రారంభకులుగను ప్రథమసమావేశము, హైదరాబాదు ప్రభుత్వ పురమందిరమున మిక్కిలి జయప్రదముగా జరిగెను. అందు కొన్ని ఆంగ్లమునను, కొన్ని ఆంధ్రమునను వ్యాసములు చదువబడెను. ఉత్సవసమావేశ వృత్తాంతము వేరుగా సిందు ప్రకటింపబడినది. స్థలాంతరమున కానవగును.

త్రైమాసిక పత్రికను ప్రచురించుటకు మ. ఘ. వ. నిజాంప్రభుత్వమున కనుమతికొఱకు వేడియుంటిమి. దయతో శ్రీ ప్రభుత్వమువారు అనుమతినొసంగిరి. ప్రథమసమావేశమునందు చదువబడిన ఆంగ్లవ్యాసములను ఆంగ్లపత్రికయందును, ఆంధ్రవ్యాసములను తెనుగుపత్రికయందును ప్రచురింప నెంచితిమి. ఇంతలో యుద్ధమువలన ముద్రణసౌకర్యములు కొఱవడుట తటస్థించెను. అందుచే ఆలస్యమనివార్యమైనది. ఆంగ్లపత్రిక ప్రథమసంచికయు ముద్రణయందున్నది.

ఈ పత్రికాముఖమున పరిషదాదర్శమునుసూచించు మ. ఘ. వ. సప్తమ ఆసఫ్జాప్రభువు చత్రచ్ఛాయక్రింద భాషాసంస్కృతి మూలక మగు హిందూముసల్మాను సమ్మేళనావిష్కారమునకు ఈ రేఖాచిత్రము ఉపలక్షకము. ఈ పవిత్రాశయ సిద్ధికై మా పరిషత్తుచేయు విధేయ వ్యవసాయము ఎంత సహకారమొనర్చిన నంత ధన్యమగును.

పరిషత్తు తీర్మానానుసారముగ నీక్రింది యాంధ్రమహామహులు పరిషత్తుయొక్క గౌరవసభ్యులుగా నెన్నుకొనబడిరి. వారును దయతో సభ్యత్వమున కంగీకరించిరి. వారికందరకును మా వందనములు.

డాక్టర్ సర్. రాధాకృష్ణన్ కె. టి., డి. లిట్.
శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు ఓ. బి. ఇ.
శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు
" మల్లంపల్లి సోమశేఖరశర్మగారు
" పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు
" భావరాజు వెంకటకృష్ణారావు ఎం. ఏ., బి. ఎల్.
" మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు
" పెంచ్యాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు
" డాక్టరు పి. శ్రీనివాసాచారిగారు ఎం. ఏ., పి. హెచ్. డి.
" " మారేమండ రామారావుగారు ఎం. ఏ., పి. హెచ్. డి.

శ్రీ శ్రీ శ్రీ సాహిత్యసామ్రాట్, మహారాజా విక్రమదేవ వర్మగారును, శ్రీ శ్రీ శ్రీ రాజా రామచంద్రారెడ్డిగారును మాపరిషత్తునకు పోషకులుగా ఉండుటకు దయతో అంగీకరించిరి.

ప్రథమసమావేశసందర్భమున ఒసగబడిన కొన్ని వ్యాసములను ద్వితీయసంచికకై నిలుపవలసి వచ్చినందులకు చింతిల్లుచున్నాము.

## స్వవిషయము

ఆంధ్రదేశమండలి విశిష్టపండితులు, భాషాసాహిత్య చారిత్రక పరిశోధకులు మాకుచేసిన సహాయమునకు మిక్కిలి కృతజ్ఞులము. ఇట్లే ముందుకూడ మమ్మాదరింపవలెనని ప్రార్థించుచున్నాము. ఈ పత్రికయందు పద్యములు, ఖండకావ్యములు, కథానికలు, నవలలు మున్నగునవి ప్రకటింపబడవు. పాండితియు, పరిశోధనమును, స్వసంస్కృతి విస్తృతి మూలమున వివిధసంస్కృతుల సమ్మేళనమును ఈ పరిషత్తుయొక్కయు, పత్రికయొక్కయు ముఖ్యోద్దేశములు.

ఏతదాశయపరిపూర్తికై మాకు తోచినట్లు యథాశక్తిగా పాటుపడుటయే మావిధి. ఈమాటలతో మా ప్రథమసంచికను ఆంధ్రలోకమునకు సమర్పించుచున్నాము.

విధేయుడు

సంపాదకుడు

# రెడ్డిరాజులు, వారి ఆంధ్ర వాఙ్మయ సేవ

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

కడపటయిన తెలుఁగునాఁటికే తెలంగాణమని పేరు. అక్కడి వారే తెలుఁగాణ్యులు. తెలుఁగాణ్యుఁడగు శ్రీ రాయప్రోలు సుబ్బారావు గారి యాజమాన్యమున తెలుఁగాణ్యులగు నిజామాంధ్రదేశమున 'ఆంధ్ర సాహిత్యసమితి' యేర్పడుట పసిగలసందర్భమే. అదిగొప్పగాఁ గార్యనిర్వాహకము కాఁగలదనుటకు మహనీయులయిన శ్రీ రాధాకృష్ణ పండితుల యధిష్ఠానమున సాగిన నేఁటి సభాముఖమింకొక తార్కాణము.

ఎక్కడో ఆంధ్రదేశపు కోణమున తిరుపతిలో జిక్కియున్న నన్ను చిరమిత్రులు శ్రీ సుబ్బారావుగారును, శ్రీ సీతారామయ్య గారును, తెక్కలిపట్టిలాగి యీ యుపన్యాసమున కుపక్రమింపఁజేసిరి. వారి సౌహార్దమునకు జోహారులు!! పలువురు భాషాభిమానులు, మిత్రులు, గల యీ మహానగరమున వ్రాసిన యుపన్యాసమునేని స్వయము వచ్చి చదువ సాధ్యపడకున్నందుకు వందుచున్నాను. ఇందుకు మిత్రులు క్షమింతురుగాక! ఇక కథావస్తువు నుపక్రమింతును.

ఆదికాలమునుండియు ఆంధ్రవాఙ్మయ భాగ్య భాండాగారమున రెడ్డిరేండ్లు గొప్ప భాగస్వాములయి ప్రఖ్యాతి గాంచుచున్నారు. వారి మహనీయతను పదింబదిగా నేను ప్రశంసించుచునే యున్నాను.

ఇప్పటికి ముప్పదియైదేండ్లకుముందు నేనిరువదియేండ్ల ప్రాయము వాఁడనయి యుండఁగా చెన్నపురికరిగితిని. నాఁడు ప్రాచ్యలిఖిత పుస్తక

శాలలో గ్రంథసామగ్రిని బరిశీలింపఁ జొచ్చినప్పు డందు 'మెకంజీ లోకల్ రికార్డ్సు' అనుపేర మన్నాటిదాఁకఁగల దేశచరిత్ర సంపుటములలో, ఎక్కడఁబట్టినను, రెడ్డిరాజుల దానధర్మములయు, శాసనములయు ప్రశంసలు పుష్కలముగాఁ గానవచ్చెను. మధ్యాంధ్రదేశము-అనగా నేఁటిగోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, కర్నూలు, కడప మండలములు-ఆనాఁడు వేదవేదాంగాది విద్యలునేర్చిన బ్రాహ్మణులతో నిండియుండుటకును, అందనేకులు అగ్రహారికులై సంపత్సమృద్ధులగుటకును, దుర్గములు, చెఱువులు, కాలువలు, ధర్మవనములు, పాడిపంటలు, గలిగి దేశము సుభిక్షమగుటకును, దేవాలయములు నిత్యోత్సవములతోఁ దేజరిల్లుటకును, వేయేల! నేఁటి తెలుఁగునాఁటివారి తెలివితేటలకు, నాగరకతకునుగూడ పదునాలుగు, పదునైదు శతాబ్దములలో, నూటయేఁబదియేండ్లే అయినను పెంపొందియున్న రెడ్డిమహారాజ్యము నొక ప్రధానకారణమన్న చరిత్రాంశ మాచరిత్ర సంపుటములలో కరతలామలకముగా గోచరించెను. నేఁడు మధ్యాంధ్రదేశమున బ్రాహ్మణులు అన్నవస్త్రములుగలిగి విద్యావిభవములుగలిగి పలువురున్నారనగా దీనికి గొప్పకారణ మానాఁడు రెడ్డిరాజులు, వీరిపూర్వుల విద్యావిశేషముల నాదరించి చేసిన యగ్రహారాది సత్కారములగుననుట యథార్థకథనము. కొండవీటి రెడ్డిరాజులయు, రాజమహేంద్రవర రెడ్డిరాజులయు, శాసనములఁ గొన్నింటినేని జూచినను నీవిషయము వెల్లడికాఁగలదు. శ్రీనాథుఁడిట్లు చెప్పినాఁడు.

సీ॥ ధరియింపనేర్చిరి దర్భపెట్టెడుఁవ్రేళ్ళ
లీల మాణిక్యాంగుళీయకములు

కల్పింపనేర్చిరి గంగమట్టియమీఁదఁ
గస్తూరికా పుండ్రకములు నొసల
సవరింపనేర్చిరి జన్నిదంబులమోలఁ
దారహారములు ముత్యాలసరులు
చెలువంగనేర్చిరి శిఖలనెన్నడుముల
గమ్మని క్రొత్త చెంగల్వవిరులు
ధామముల వెండియును జెఁడీ పడపడఁగ
బ్రాహ్మణోత్తము లగ్రహారములలోన
వేమభూపాలుఁ డనుదినమ్ము పీరభద్రు
ధాత్రియేలింప గౌతమీ తటమునందు.

భీ మ ఖం డ ము

శ్రీశైలము, అహోబిలము, పంచారామములు, మొదలగు పుణ్యస్థలముల వైభవమును రెడ్డిరాజులతో పెంపొందించిరి. మహ్యాంధ్రదేశమున వేద, శ్రౌత, స్మార్తోభయ మీమాంసా, తర్క, వ్యాకరణ, సంగీత, సాహిత్య, వైద్య, జ్యోతిషాది శాస్త్రములకు వారు చాల నభ్యుదయము గూర్చిరి. వారు షట్కాల శివపూజా ధురంధరులయి, ఆముష్మిక పరాయణులయి వెలసిరి. నేఁడును రెడ్డి కులమువారిలో పలువురు భాగ్యభరితులు, శీలశోభితులు, త్యాగులు భోగులు ప్రతిభాశాలులు, విద్వాంసులు, కవులు వెలయుచున్నారనగా దానికి ఆనాఁటి రెడ్డిరాజేంద్రుల వంశపారంపర్యపు సంస్కారమే ప్రధానకారణమనుట యసంగతముగాదు. ముప్పది యేండ్లనుండియు నాకీ రెడ్డిరాజ్య వైభవానుస్మరణమున నభిమానము నెందుం. ఇట్టి యభిమానము నానాఁడే 'శ్రీనాథచరిత్ర' రచనాసందర్భమున గొంత తీర్చుకొంటిని.

నేఁడిక్కడ రెడ్డిరాజుల విద్యావిలాసములఁగూర్చి మాత్రమే కొంత వివరింతును.

మ. "మహనీయంబుగ నంధ్రభూవలయముం బాలించుచుం, బ్రాజ్ఞులై
బహుకావ్యంబులు చెప్పుచుక్, మఱియుఁ జెప్పంజేయు, చాముష్మిక
స్పృహతో ధర్మములాచరించుచు, జగజ్జేగీయమానంబుగా
నహముల్ పుచ్చిన రెడ్డిరాజుల సముద్యత్కీర్తిఁ గీర్తించెదన్."

### గోన బుద్ధారెడ్డిగారు, తత్పుత్రులు

పాల్కురికి సోమనాథుని మూలమున తెలుఁగున ద్విపదరచనకు విలువ హెచ్చెను. ద్విపదరామాయణమునఁ దత్కర్తలు, బుద్ధయ—తత్పుత్రులు, కాచయ విఠ్ఠయలు ననియేకలదు. కాని వారికులమేదో యందుఁదెలియరాదు. వారి యింటిపేరుమాత్రము 'గోన' యని యనేక ప్రతులలోను, 'కోన' యని కొలఁదిప్రతులలోను గలదు. వారు రాజ్యమునేలిన యేలికలగుట గ్రంథమున స్పష్టముగానున్నది. పశ్చిమాంధ్రదేశమున 13, 14 శతాబ్దులలో రాచూరుదుర్గ నిర్మాతలై రాజ్యమేలినవారు 'గోన' వంశమువారు, రెడ్లు సుప్రఖ్యాతులు. వారి యింటిపేరు 'కోన' యనుట సరికాదు. ఆనాటి శాసనములందెల్ల వారి యింటిపేరు 'గోన' యనియేకలదు—ఆనాఁడు 'కోన' యింటిపేరు వారు, క్షత్రియులు, కోనసీమ (గోదావరీమండలము) పాలకులు వేఱుగానున్నారు. గోన పదసంగతి, బుద్ధ, కాట, విఠ్ఠ నామసంగతి—రాచూరుదుర్గ నిర్మాతలగు రెడ్డిరాజులకే కలదు. కావున, రంగనాథ రామాయణ ప్రసక్తులు రెడ్లేకాని క్షత్రియులుగారని నిశ్చయింపవలెను.

ఐతిహ్యమును, ఆప్తవాక్యమును ప్రమాణముగాఁ గొనకున్నచోఁ ప్రాచీనచరిత్ర నిర్మాణము సుదుష్కరమగును. రంగనాథుఁడను కవియే లేఁడని, ఆతఁడు కల్పితపురుషుఁడని నేననఁజాలను. రంగనాథరామాయణ సంస్కరణ ముద్రణములందు పెట్టిచాకిరీచేసిన దోషమున, నాపైఁ బడ్డ నిందలకు, నిందకులకు 'శుభమస్తు'. ఆగొడవనిక్కడ విడతును. బుద్ధారెడ్డిగారును తత్పుత్రులును వాల్మీకి రామాయణమును తెలుఁగున ద్విపదరచనలో వెలయించిరంటిని. గ్రంథమున గ్రంథకర్తలు బుద్ధభూవిభుఁడును తత్పుత్రులు, అనియే కలదు. కాని దానిని రంగనాథుఁడను కవి రచించినట్లు ప్రతీతి. తదనుగుణగాథలు ప్రాచీనములగు తెలుఁగోటి వారి వంశచరిత్రైకశిలానగర చరిత్రములలోఁగూడ నున్నవి. రంగనాథుఁడు కల్పితుఁడు కాకున్నను, ఆతనితోడ్పాటు గ్రంథరచనమున నున్నను, గూడ గ్రంథోత్పత్తికిఁ బయిప్రభువులు కారణమగుట స్పష్టముగదా! పూర్వోత్తర రామాయణములు వేఱురచనములు గావనియే నేను భావింతును. తెలుఁగున నీరెడ్డిరాజులు వెలయించిన ద్విపద రామాయణము ప్రౌఢకవితా రసికులకేకాక పామరజనులకుఁగూడ సాహిత్యానందము సమకూర్చుచు నత్యధికప్రచారము కలదిగానున్నది. ఆంధ్ర రామాయణములలో రసపారవశ్యమును గలిగించు రచనమిట్టిది వేఱొకటి లేదు. పశ్చిమాంధ్రదేశమున శ్రీరామాయణమునకే ప్రచారమెక్కువ. ప్రాచీన లాక్షణిక కవులందఱును నీరామాయణ ప్రయోగములను బరమప్రమాణముగాఁ బరిగ్రహించిరి. రామాయణ కథామాధురిని ఆంధ్రజన సామాన్యమున ననుభవింపఁజేసిన రామాయణమిదియే.

## ప్రోలయ వేమారెడ్డిగారు

వీరు కృష్ణ, గోదావరి, పినాకిని, అను నదీత్రియముచే రక్షితమైన మధ్యాంధ్రదేశము నేలిన రెడ్డిరాజ వంశమునకు మూలపురుషులు. కవిత్రియములోని యెఱ్ఱాప్రెగడ కవీశ్వరుని ఆస్థానకవినిగా ఆదరించి పోషించిన మహానీయులు. కవిత్రియములోనివాఁడగు మన యెఱ్ఱాప్రెగడ భారతారణ్య పర్వశేషమునఁ గొన్ని పట్టుల నన్నయరచనకు మెఱుఁగుగూర్చినాఁడు, హరివంశమునఁ గొన్నిపట్టులఁ దిక్కనరచనకుఁ జక్కనగూర్చియు నిర్వహించినాడు ఆరణ్యపర్వశేష—పూర్వభాగమున, షష్ఠాశ్వాసమున సైంధవావమాన ఘట్టమును, హరివంశమున శ్రీకృష్ణ బాల్యవిలాస ఘట్టమును శాకభిమాన గ్రంథభాగములు. అనాగరకులైన వ్రేపల్లె గొల్లవారి యిళ్లలో జగన్మోహనమూర్తి శ్రీకృష్ణమూర్తి యవతరించి బాలక్రీడలు, దివ్యానుభూతులును వెలయించుటఁ, అక్కడి పామరజనుల కందుచేఁగలిగిన యానందాశ్చర్య సంభ్రమములు, ఎఱ్ఱాప్రెగడవారు చాల చక్కనితీరున దేసి తెలుఁగు నుడుఁగులు వెలయఁగా పోతలయిళ్ళలో శ్రీకృష్ణుఁడారగించిన వెన్నా మీగడల రుచులఁ దలపించు మించు రచనతో వెలయించినారు ఆంధ్రప్రబంధ వాఙ్మయమున నిట్టి రసవద్ ఘట్టము మఱి యన్యత్రి కానరాదని నానమ్మకము. ప్రోలయ వేమారెడ్డిగారు రామాయణమును, హరివంశమును నత్యాదరము తో నాలకించు వారట!

క॥ రామాయణ హరివంశ
శ్రీమన్మధుర ప్రబంధ సేవ, చిరయశ
స్సామర్థ్య, నిత్యనిపుణ
శ్రీమల్ల వేమావరేణ్య సేవితహృదయా!

ఇందుఁ బేర్కొనఁబడిన రామాయణ హరివంశములు ఎఱ్ఱాప్రెగడగారు రచియించిన యాంధ్ర ప్రబంధములే కావచ్చును. హరివంశ రచనమునకుఁ బూర్వము ప్రోలయ వేమారెడ్డిగారికే అంకితముగా మన ప్రబంధ పరమేశ్వరుఁడు రచియించిన రామాయణ మహాప్రబంధ మీనాఁడు గానరాకుండుట చాల శోచనీయవిషయము. దానిఁగూర్చి 'భారతి' పత్రికలో నేనొకవ్యాసముఁ బ్రకటించితిని. ఆగ్రంథము నైజాం రాష్ట్రమున దొరకఁదగునేమోకదా! (ఆవ్యాసము నిందుతోఁ బంపుచున్నాను. అదనుకలదేని అందు ముఖ్యాంశములు చదువఁదగును) ప్రోలయ వేమారెడ్డిగారు సాహిత్యమునకేకాక, సంగీతమునను జాల రసికులు. హరివంశమున నిట్లున్నది.

క॥ కేళాది రాయవితరణ
కేళీనిరపాయ నృత్యగీత కథాళీ
లాలలితోత్సవ నిరతిశ
యాలంకృతభాగ్య సుస్థిరాయుర్భోగ్యా!

వారి యాస్థానమున లొల్ల మహాదేవకవియని యొక విద్వాంసుఁడుండెను. ఆయననుగూర్చి యావంశమున నేడవతరమువాఁడు లొల్ల లక్ష్మీధరుఁడిట్లు చెప్పెను.

యః కర్ణాట వసుంధరాధిప మహాస్థానే సువర్ణా యుతో
యోవిద్వన్నికషాయితో నృపగృహే వేమాఖ్య పృథ్వీశితుః;
శ్రీ మల్లొల్లట భట్ట శిష్యఇతి యో లొల్లాఖ్యయా శ్రూయతే
శ్రీ శేషాన్వయ శేఖర స్సహిమహాదేవో విపశ్చిన్మహాన్॥

ఈ మహాదేవకవికి లొల్లవారని యింటిపేరు. భరతమహాముని రచించిన నాట్యశాస్త్రమునకు వ్యాఖ్యానము రచియించిన లొల్లట భట్టునకు శిష్యుఁడగుటచే వచ్చినదట. ఇది నిజమేని, నాట్యశాస్త్ర వ్యాఖ్యాత లొల్లటభట్టు ఆంధ్రుఁడగును. అతఁడుగూడ రెడ్డిగారి ప్రాపు గలవాఁడగుట అనుమానింపఁ దగినదగును. ఈ లొల్ల మహాదేవకవి వంశమున తర్వాతివారెల్లరుగూడ మహా విద్వాంసులు. వీరు క్రమముగా రెడ్డిరాజుల యాస్థానమున విద్వాంసులుగానుండి, వారి తర్వాత వచ్చిన గజపతుల యాస్థానమునను, వారి తర్వాతవచ్చిన కృష్ణదేవ రాయలవారి యాస్థానమునను, గూడ విద్వాంసులుగానుండిరి. ఈ గజపతులయు, కృష్ణదేవరాయలయు, నాస్థానమునన్న లొల్ల లక్ష్మీధర పండితునకును, మహాదేవకవికిని నడుమనున్న విద్వాంసులు. మహాదేవాచార్యుఁడు, లక్ష్మీధరాచార్యుఁడు, విరించిమిశ్రుఁడు, పురుషోత్తమ మహోపాధ్యాయుఁడు, లక్ష్మణార్యుఁడు, విశ్వనాథభట్టు అనువారు రెడ్డిరాజుల యాస్థానముననే ఉన్నవారగుదురు. వారు సంగీతసాహిత్య పూర్వోత్తర మీమాంసాది శాస్త్రములందు గొప్ప గ్రంథములు రచించిరి. వానిపేర్లివి; భట్టలొల్లటగ్రంథవివరణము, సాహిత్యపారిజాతము, స్మృతికల్పతరువు, భరతార్ణవపోతము, సాహిత్యమీమాంస, మీమాంసాజవాతువు, ప్రభాకరామృతవాహిని, ప్రభావళీఖండనము, నయవివేకదీపిక,—అనునవి. ఈ వంశమువా రిప్పటికిని సంపన్నహితులై కృష్ణాతీరమున కొల్లూర వెలయుచున్నారు. హరివంశమున నీప్రోలయ వేమారెడ్డిగారిని ఎఱ్ఱాప్రెగడ యిట్లు ప్రస్తుతించినాఁడు:

సీ॥ అగ్రహారములు విద్యాతపోవృద్ధ వి
ప్రులకిచ్చి యజ్ఞకర్తలుగ మనిచెఁ
గ్రామరారఁ జెఱువులు గుళ్ళు ప్రతిష్ఠించి
లోకసంభావ్యంబులుగ నొనర్చి
నిధులునల్లిండ్లును నిలిపెఁ దోఁటలు స
త్రములు చలివందిరుల్ వెలయఁబెట్టె
హేమాద్రి పరికీర్తి కామితవ్రతదాన
నివహంబులన్నియు నిర్వహించెఁ
గీ॥ చేసెఁ జేయుచున్నాఁడు సేయనున్న
వాఁడు పునరుక్తకృతి శుభావలులనెల్ల
ననఁగ శ్రీవేమవిభున కయ్యలఘుపేర్మి
వశమె వర్ణింపఁదద్భాగ్య వైభవంబు.
సీ॥ కేయూరకంకణాకృతిఁ బరాక్రమ విత
రణములు బాహుభూషణతనొంద
ననుకూలగృహిణి చాడ్పున నృపశ్రీయొద్దఁ
గదలక సకలసౌఖ్యముల నొసగ
సమృతసేవనము చందమునను సద్ధర్మ
తాత్పర్య మధికమోదంబుఁ బెనుపఁ
గరతలామలక విఖ్యాతి నాతతనీతి
గరిమంబు నిజవివేకమున వెలయ
గీ॥ జాహ్నవీ ప్రవాహముభంగిఁ జరితమఖిల
భువనపావనపరిపూర్తిఁ బొలుపుమిగుల

బరగు వేమక్షమానాథు పాటిపృథులు
గలరె యెవ్వాక ధారుణీతలమునందు."

ఎఱ్ఱాప్రెగడగారిదట యీ క్రిందిపద్యము చాటువుకాబోలును.

వీపున మోసెఁ గచ్ఛపము, వెండిభుజంగమురాజు మస్తక
స్థాపితఁజేసె, నీవువసుధారమణిఁ బెదకోమటీంద్ర! బా
హాపరిరంభ గుంభనముదంచితఁ జేసితి, వింతయొప్పవే
మోపరులేనెఱుంగుదురు ముగ్ధలతోడి విహారసౌఖ్యముల్.

ఈయన కాలమున 'మోటుపల్లి' యను ప్రాక్సముద్రతీరగ్రామము రేవుపట్టణముగా నుండెడిది. అక్కడికి సముద్రపుటవలియొడ్డుననుండి, తవాయి (నేఁడును తవాయియే) తరుణాసిరి (నేఁడు తెన్నాసిరమ్) మొదలగు ద్వీపాంతర ప్రదేశములనుండి యోడవ్యాపారములు చాల జరుగుచుండెడిది. ఎఱ్ఱాప్రెగ్గడ యిట్లుచెప్పినాఁడు:

"బాహాదర్పమునన్ బ్రతిపధరణీపాలావలిం దోలి యు
త్సాహోదగ్రుఁడు మోటుపల్లిఁగొని సప్తద్వీపసద్వస్తు సం
దోహంబుల్ దనకిచ్చునెచ్చెలి సముద్రం బ్రీతిఁగావించుచున్
మాహాత్మ్యంబు వహించె మల్లరథినీనాథుండు గాఢోద్ధతిన్"

ఈ ప్రోలయ వేమారెడ్డిగారు బంధుసముద్రులు. ఎనుబదినాలుగు స్థలములలో దుర్గములనునిర్మించి తనబంధువుల నాయా దుర్గములందు నెలకొల్పిరి. ముప్పదియారగ్రహారదానముల దానముచేసిరి. శ్రీశైలమునకు నహోబలమునకు మెట్లు కట్టించిరి.

## అన్నపోతారెడ్డిగారు

ఈయన తన తండ్రికాలమున రాజధానిగానున్న యద్దంకినివిడిచి కొండవీటిని రాజధానిగాఁజేసికొని దానిఁజాల బెంపొందించినాఁడు.

'కొండవీడుం రాజధానీం సవిచిత్రామకల్పయత్
దృష్ట్వా త్వష్టాపి వైచిత్ర్యమభూద్యస్యా స్సవిస్మయః
* * *
సోఽన్నపోతనృప స్స్వేన నిర్మితాయాం పురిస్థితః
కుర్వన్ హేమాద్రి దానాని చిరంభువమపాలయత్.'

ఎఱ్ఱాప్రెగడ హరివంశమును రచించుకాలమున ననపోతారెడ్డిగారు యువరాజుగానుండిరి. ఈయన రాజ్యమునకు వచ్చునాటి కెఱ్ఱాప్రెగడ పుణ్యలోకముల కరిగియుండును. బాలసరస్వతియను కవీశ్వరుఁడీయన యాస్థానమున విద్యాధికారిగానుండెను. 'అన్నపోతనరేంద్రస్య విద్వాన్ బాలసరస్వతిః' అని యాతఁడు శాసనకృతులందుఁ జెప్పికొనెను. వెన్నెలకంటి యింటిపేరుగల కవీశ్వరులీ యన్నపోత భూపతి పేరనేవో గ్రంథములు రచించిరట! అవియేవో దొరకలేదు. "వేమయ యన్నపోత భూజానికి సత్ ప్రబంధములొసంగిన వెన్నెలగంటివారి లోన్" అని విష్ణుపురాణకర్త వెన్నెలకంటి సూర్యకవియు, "వెన్నెల కంటిసూర్యుఁడు వివేకగుణాఢ్యుఁడు వేదశాస్త్రసంపన్నుఁడు కీర్తివేమ నరపాలకుచేత మహాగ్రహారముల్ గొన్న కవీంద్రకుంజరుఁడు" అని జక్కనయు నీవిషయమును బ్రశంసించిరి. ఈ మహారాజు రెడ్డిరాజ్యమునుజాలఁ బెంపొందించినాఁడు; చాల యుద్ధములుజరపి జయము లందినవాఁడు.

## అనవేమారెడ్డిగారు

అనపోతారెడ్డిగారి యనంతరమీయన రాజ్యమునకు వచ్చెను. ఈయన చాల ధర్మాత్ముఁడు. ఈశ్వరభక్తుఁడు. నట్కాల శివపూజా ధురంధరుఁడు.

"అరుణోదయ తపనోదయ
సంగవమధ్యాహ్న సాయమర్ధనిశాః
శివపూజా సమయాష్టట్
ప్రతిదినమనవేమ పార్థివేంద్రస్య-"

అని వర్ణనకలదు. ఈయన యాస్థానమునఁ గొన్నాళ్ళు శాల సరస్వతికవియే విద్యాధికారిగా నుండెను. పిదప త్రిలోచనార్యుఁడను నుద్దండకవి విద్యాధికారిగానుండెను.

"మహో నటజటాచ్ఛటానటదఖందమందాకినీ
కలక్వణిత కంకణప్రజవిజృంభి వాగ్గుంభనః
కవిః కవికులోద్భవో భువనభవ్యదివ్యోదయ
శ్శైవాగమ విశారదో జయతి శారదావల్లభాః"

ఈ త్రిలోచనార్యుఁడు గొప్పకవి యగుటేకాక శైవాగమ విశారదుఁడునట! 'ప్రకాశభారతియోగి' యనిపేరుగలవాఁడు ఆంధ్రకవీశ్వరుఁ డింకొక్కఁడుగూడ నీయన యాస్థానమున నుండెను. ద్రాక్షారామ భీమేశ్వరాలయమున ననవేమ భూపాలుఁడు కట్టించిన గొప్ప కట్టడములఁగూర్చి యీ ప్రకాశ భారతయోగి మంచి సీసపద్యములతో శాసనకావ్యము రచించినాఁడు. ఈయన కైలాసవాసికాగా నొక విద్వాంసుఁడిట్లు విలపించినాఁడు:

"భువి సత్యనవేమ భూపతీంద్రే విదుషాంజీవనమేవ జీవనమ్
దివిసత్యన వేమభూపతీంద్రే విదుషాం జీవనమేవజీవనమ్"

### కొమరగిరి రెడ్డిగారు

అనవేమారెడ్డిగారికి పిదప నాయన యన్నకుమారుఁడు కొమరగిరి రెడ్డిరాజయ్యెను. ఈయనచాల అదృష్టవంతుఁడు. ఏలనఁగా ఈయనకు మనుతుల్యుఁడని పొగడ్తగాంచిన ప్రాజ్ఞుఁడు కాటయ వేమారెడ్డి మంత్రిగా నుండెను.

'ఆసీదమాత్యరత్నం కాటయవేమప్రభుస్తస్య,
అతిసుగురుః భార్గవమతి రతిభార్గవ విజయవిజయ విఖ్యాతః'
'సింహాసనేనిధా యా సౌకుమారగిరిభూవరమ్
అతేజయన్మహాతేజా శ్రీకృష్ణ ఇవధర్మజమ్"

—తొత్తరమూడి శాసనము.

శ్రీకృష్ణదేవుఁడు ధర్మరాజునుబోలె కాటయ వేమారెడ్డిగారి కొమరగిరిరెడ్డిని సింహాసనమున గూర్చుండఁబెట్టి సర్వాభ్యుదయములను సమకూర్చు చుండువాఁడు. రాజ్యపరిపాలనతంత్రమెల్ల కాటయవేమారెడ్డిగారు నిర్వర్తించుచుండఁగా, భోగభాగ్యపరాయణులై కొమరగిరి రెడ్డిగారు వసంతోత్సవములతోను, వారాంగనాభినయములతోను కాల ముగడపుచుండువారు. వీరికాలమునఁ గొండవీటిరెడ్డిరాజ్యము గొప్ప దశలో నుండెను.

"భాగ్యం నామసమగ్రమీదృశమతి స్నేహైకపాత్రం యశో
వీరం కాటయ వేమముద్ధతరిపుధ్వంసేని యుజ్యస్వయమ్

నిత్యంనందతి నర్తనైరభినవైః కాంతైర్వసంతోత్సవైః
సంతానాభ్యుదయైః కుమారగిరిభూపాలో నృపాలోత్తమః"

ఇచట 'సంతానాభ్యుదయైః' అనుటకు 'సప్తసంతానముల యభ్యుదయములని' అర్థము చెప్పుకొనవలెను.

కొమారగిరి రెడ్డిగారికి ధర్మపత్నీ నిర్విశేషురాలు 'లకుమాదేవి' యను ప్రియురాలుండెడిది. ఆమె కొమరగిరిరెడ్డిగారి కొల్వున వేల తెఱఁగుల నవనవాభినయములు వెలయించుచుండెడిది. అర్థివ్రజమును వేలకొలదిగా ధనమొసఁగి యాదరించుచుండెడిది. ఈ లకుమాదేవి వేశ్యకాబోలును.

"జయతి మహిమాలోకాతీతః కుమారగిరిప్రభో
స్సదసి లకుమాదేవీ యస్యప్రియా సదృశీప్రియా;
నవమభినయం నాట్యార్థానాం తనోతి సహస్రధా
వితరతి బహూనర్థానర్థి వ్రజాయ సహస్రశః"

కొమరగిరిరెడ్డిగారి కాలముననే కొండవీట 'గృహరాజసౌధ' మను గొప్ప ప్రాసాదము నిర్మింపఁబడెను. ఇంతదాఁక నీసౌధము, పెదకోమటి వేమారెడ్డికాలమున వెలయింపఁబడినట్లు తలపఁబడుచుండెను. ఈనడుమ క్రొత్తగా దొరకిన తామ్రశాసనములు (ఇవి యీ నడుమ శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగారిచే 'ఆంధ్ర హిస్టారికల్ రీసర్చి సొసైటీ జర్నల్' లో ప్రకటింపబడినవి.) ఈ సౌధమును కుమారగిరి రెడ్డిగారే కట్టించిరని తెలుపుచున్నవి. మఱియుఁ గుమారగిరి రెడ్డిగారు 'వసంతరాజీయ' మనుపేర నాట్యశాస్త్రగ్రంథము నొకదానిని రచించిరట! అది యిప్పుడు కానరాదు.

"మునీనాంభరతాదీనాం భోజాదీనాంచ భూభుజామ్
శాస్త్రాణి సమ్యగాలోచ్య నాట్యవేదార్థవేదినామ్
ప్రోక్తం వసంతరాజేన కుమారగిరిభూభుజా
నామ్నా వసంతరాజీయం నాట్యశాస్త్రం యదుత్తమమ్"

శ్రీనాథుని హరవిలాసమును కృతినందిన యవచితిప్పయసెట్టి తనచిన్ననాఁట నీకుమారగిరి రెడ్డిగారి ప్రతివర్ష వసంతోత్సవములకు తరుణాసీరి, తవాయి, గోవ, రమణ, పంజార, జలనోగి, హురుమంజి, యాంప యిత్యాది ద్వీపాంతరములనుండి తెప్పించిన సుగంధద్రవ్యములను కొంపసేటికిఁ గొనివచ్చి సుగంధద్రవ్య భాండారము నెలకొల్పి యమ్మి పోవుచుండెడివాఁడు.

కాటయ వేమారెడ్డి గారు (2) రాజు

ఈయన కుమారగిరిరెడ్డిగారి సోదరికి భర్త. కాళిదాసీయము యిన నాటకత్రయమునకు కుమారగిరీయములు అనువ్యాఖ్యానములు రచియించినవాఁడు. ఈ వ్యాఖ్యానములు చాలఁ బ్రసిద్ధములయినవి. కుమారగిరి రెడ్డిగారీయనకు విక్రమతోషితులై, రాజమహేంద్రవరము రాజధానిగా, తూర్పుదేశమును బరిపాలింప నొసఁగిరని తొత్తరమూడి శాసనము చెప్పుచున్నది.

"కుమారగిరిభూనాథో యస్మైవిక్రమతోషితః
ప్రాదాత్ప్రాచీం భువం రాజమహేంద్రి నగరీముఖామ్"

రాజమహేంద్రవర రాజ్యమును కాటయ వేమారెడ్డియు, కుమారగిరిరెడ్డి కుమారుఁడు అనపోతారెడ్డియు, కాటయ వేమారెడ్డి

యల్లుఁడు వీరభద్రారెడ్డియు, నాయన యన్నదమ్ములగు వేమారెడ్డి దొడ్డారెడ్డి, అన్నారెడ్డి అనువారును గలసి చీకటి, చిల్కసముద్రము దాఁక వ్యాపింపఁజేసి పాలించిరి. కొమరగిరిరెడ్డిగారి తుదికాలముననే కొండవీటి రెడ్డిరాజ్యము, రాజమహేంద్రవర రెడ్డిరాజ్యము వేఱుపడెను. కొండవీటి రెడ్డిరాజ్యమునకు పెదకోమటి వేమారెడ్డి రాజయ్యెను.

## పెదకోమటి వేమారెడ్డిగారు

ఈ రెడ్డిరాజ్యమునకుఁ దొలిపురుషుఁడగు కాటయ వేమారెడ్డిగారెట్టి జగద్గేయకీర్తులో ఇంచుమించుగా కొండవీటి రెడ్డిరాజ్యమునకుఁ దుదివాఁడనఁదగిన యీ పెదకోమటి వేమారెడ్డిగారుకూడ నట్టివారు. ఇంచుమించుగా క్రీ. 1404 నుండి 1420 దాక నీ మహనీయుఁడు కొండవీటి రెడ్డిరాజ్యమునేలెను. ఈయనకు రాజమహేంద్రవర రెడ్డిరాజ్యము ప్రబల విరోధిగానుండెను. కాటయ వేమారెడ్డిగారివలె నీయనస్వయము గొప్ప విద్వాంసుఁడు. కవిసార్వభౌముఁడయిన శ్రీనాథుని నాస్థానమున విద్యాధికారినిగాఁ జేసికొని పోషించిన మహాభాగ్యశాలి. ప్రబంధ పరమేశ్వరుని, కవిసార్వభౌముని నాస్థానకవులఁగా నాదరించి పోషించు మహాభాగ్యము ప్రోలయ వేమారెడ్డిగారికిని, నీ పెదకోమటి వేమారెడ్డిగారికిని చిరకాలము లభించినది. ఈ వేమారెడ్డిగారికి 'సర్వజ్ఞచక్రవర్తి' యని బిరుదు.

"చూడామణిర్నృపాణాం మూర్ధసు పరిపంథి శిఖరిదంభోళిః
సర్వజ్ఞచక్రవర్తీ పెదకోమటి వేమభూపతిర్జయతి"

ఈ శ్లోకము శ్రీనాథుని శాసనకృతులందేకాక వామనభట్టబాణుని వేమభూపాల చరితమునఁగూడఁ గలదు.

రాచకొండ, దేవరకొండలు రాజధానులుగా పశ్చిమాంధ్ర దేశములనేలిన రేచర్ల వెలమరాజులకును, కొండవీడు, రాజమహేంద్రవరము రాజధానులుగా రాజ్యమేలిన పంటదేసటి రెడ్డిరాజులకును బ్రబలవిరోధము. వారు ఒండొరులమీఁది కీర్తిప్రతాపయశస్సులనార్జింపయత్నించిరి. రేచెర్ల సింగభూపాలుఁడు సర్వజ్ఞబిరుదముఁదఁగా, కొండవీటి రెడ్డిరాజు, మన పెదకోమటి వేమారెడ్డి సర్వజ్ఞచక్రవర్తి బిరుదమందెను. అక్కడనొక సింగభూపాలుఁడు సంగీతరత్నాకర వ్యాఖ్యానమును, రసార్ణవ సుధాకరమును, రత్నపాంచాలికను ఇంకను గొన్ని గ్రంథములను రచింపఁగా మనరెడ్డిగారు సంగీతచింతామణిని, సాహిత్యచింతామణిని, అమరువ్యాఖ్యను, సప్తశతీసారవ్యాఖ్యను, నింకఁగొన్ని నాటకకృతులను రచియించిరి. విశ్వేశ్వరకవిచంద్రాదులు వెలమరాజుల యాస్థానమునఁ గవులుగానుండఁగా వామనభట్టబాణాదులిక్కడనుండిరి. మహాశయుఁడు బమ్మెర పోతనవారి యాస్థానమున నుండెనుగాని యానిస్పృహుఁడు-నరస్తుతి విముఖుఁడై వారి గౌరవాదరముల నపేక్షింపఁడయ్యెను. మనరెడ్డిగారి యాస్థానమున పోతరాజుగారికిఁ దీసిపోని విఖ్యాతకవీశ్వరుఁడు శ్రీనాథుఁడు విద్యాధికారిపదమున వెలుఁగొందెను.

వెలుగోటివారివంశమున సింగభూపాలురు పలువురున్నారు. అందు కవితాప్రసక్తులు పదునాల్గవశతాబ్ది తుదను, పదునైదవశతాబ్ది మొదటను వర్ధిల్లినవారిరువురు సింగభూపాలురు. అందు తొలిసింగభూపాలుఁడు రసార్ణవసుధాకరము, రత్నపాంచాలిక మొదలగు గ్రంథ

ములకుఁగర్త. చమత్కార చంద్రికాకారుఁడగు విశ్వేశ్వరకవిచంద్రు నాస్థానకవిగా నాదరించినవాఁడు.

ఈతనిమనుమఁడు వేరొక సింగభూపాలుఁడున్నాఁడు. ఈతనికే సర్వజ్ఞుఁడని బిరుదు. శ్రీనాథకవి సార్వభౌముఁడు, బమ్మెరపోతరాజు, సర్వజ్ఞ సింగభూపాలునితో సంబంధముగలవారు. ఈతనితల్లిదండ్రులు పోచమాంబాపోతభూపాలకులు. వసంతావనీనాథుఁ డీతనితమ్ముఁడు. బమ్మెరపోతరాజు భోగినీదండకము నీతనిపేరనే రచించెను. శ్రీనాథుఁ డీతని నే దర్శించెను. ఈతఁడు పదునైదవశతాబ్ది మొదటికాలమువాఁడు.

రసార్ణవ సుధాకరాది గ్రంథకర్త యీతనితాతకు, శ్రీనాథపోతనలతో సంబంధముగలదనుట యప్రామాణికము. ఆతఁడన్నమాంబాపోతభూపతులకొడుకు. ఆతనిసోదరులపేళ్ళు వేఱు. ఇంతవిస్పష్టచరిత్ర విషయమునే వేవో ప్రయోజనములనర్థించి కొందఱిప్పుడు తార్మాఱు చేయుచున్నారు!

పెదకోమటి వేమారెడ్డిగారి మంత్రియు, శ్రీనాథుని శృంగార నైషధ కృతిపతియునగు మామిడి సింగనమంత్రి సోమసిద్ధాంతమను జ్యోతిషగ్రంథమునకు వ్యాఖ్యరచించెను. పెదకోమటి వేమారెడ్డిగారు అనేకులకు, జ్యోతిషవిద్వాంసులకు, యజ్ఞములుచేసిన శ్రోత్రియులకు, శైవాచార్యులకు, అనేకాగ్రహారములు దానముచేసిరి. ఆదానముల కన్నింటికిని, శ్రీనాథకవీశ్వరుఁడు శాసనకావ్యకర్త. వారివైదుష్యములను శ్రీనాథుఁడే పరీక్షించువాఁడు.

సీ॥ వినిపించినాఁడవు వేమభూపాలున
కఖిలపురాణ విద్యాగమములు

3. సాహిత్యచింతామణి:- ఇది యలంకార శాస్త్రగ్రంథము లలోఁ జేర్పఁ నడఁగిన యుత్కృష్టగ్రంథము. కావ్యప్రకాశమువంటిది. ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాత కుమారస్వామి సోమపీథి దీనినుదాహరించి నాఁడు. మహిమభట్టు వ్యక్తివివేకమునిది ఖండించును. ధ్వనికారుని మతమును బరిపోషించును. ఇందనేక ప్రాచీనగ్రంథములలోని శ్లోకము లుదాహరింపఁబడినవి.

'యథామమైవభాసే' అనియు, 'యదామమైవకావ్యే వీరనారాయణపరితే'- అనియుఁ జెక్కు శ్లోకము లుదాహరింపఁబడినవి. కోమటి వేమారెడ్డిగారి కృతులగు నాగ్రంథములిప్పుడు తెలియరావు.

4. సంగీతచింతామణి:- ఈగ్రంథము తిరువనంతపుర గ్రంథాలయమున నున్నది. అముద్రితము.

కవీశ్వరులీ సర్వజ్ఞచక్రవర్తి నిట్లు పొగడిరి—

"జ్ఞాతాయదిచహి దాతా, దాతాచేత్ఽపి భువిచజ్ఞాతా
జ్ఞాతాదాతాచాభూః, పెదకోమటి వేమభూపతేచిత్రమ్"

"అర్థిజనచింతితార్థా, దధికంచేతస్తతోఽపితేవాణీ
అస్యా అపి దశతీకరః, పెదకోమటి వేమభూపతేచిత్రమ్"

"శ్రితపోషణ రిపుశోషణ, బుధతోషణసత్యభాషణాదిగుణాన్
ధత్తే దశరథరామః, ప్రాగద్యకలౌతు కోమటివిభు వేమః"

* * * * * * * *

వామనభట్ట బాణుఁడను కవీశ్వరుఁడు పెదకోమటి వేమారెడ్డి గారి చరిత్రమునే "వేమభూపాలచరిత్ర" మనుపేర సంస్కృతమున గద్యకావ్యముగా రచించెను. శ్రీనాథుండే కాబోలును పెదకోమటి

వేమారెడ్డిగారిమీద రచించిన చాటుధారలుకొన్ని చాటుపద్య మణి మంజరీ ద్వితీయభాగమునఁ బ్రకటించితిని. ఇటీవలనింకను గొన్ని పద్యములు దొరకినవి. వానినిజేర్చి ద్వితీయభాగమును మరలఁ బ్రకటించు చున్నాను.

ఈ వేమారెడ్డిగారి కాలముననే కందుకూరు రాజధానిగా రాజ్యమేలుచున్న పిన్నకోమటిరెడ్డిగారి కుమారుఁడు శివలింగభూపతి హరవత్త్సాచార్యుఁడు "చతుర్వేద తాత్పర్యసంగ్రహ" మనుపేర రచించిన సంస్కృత గ్రంథమునకు వ్యాఖ్యరచియించెను. ఆయన యాస్థానమున నీశ్వరభట్టు అను గొప్పవిద్వాంసుఁడుండెను. ఆయన తోడ్పాటుతో రెడ్డిగారాగ్రంథమును రచించిరి.

పెదకోమటి వేమారెడ్డిగారితర్వాత తత్పుత్త్రుఁడు రాచవేమన మూఁడేండ్లుమాత్రమే రాజ్యమేలెను. అంతటితో కొండవీటి రెడ్డిరాజ్యమంతమందెను. కాని, పెదకోమటి వేమారెడ్డిగారు తాము జీవించి యుండఁగానే తనతమ్ముఁడగు మాచారెడ్డిగారికి కొండపల్లెదుర్గము రాజధానిగాఁ దత్ప్రాంతదేశమును గొంతరాజ్య మేలుకొనఁ బంచి యిచ్చి పంపిరి.

"పెదకోమటిమాచేంద్రో వేధసానిర్మితోనృపః
ఇతరేతు నృపాస్సర్వే విశ్వామిత్రేణ నిర్మితాః"

అని యాయన పొగడ్తఁగనెను. ఈరెడ్డిగారు క్రీ 1414 సంవత్సరమునను, తత్పుత్త్రుఁడు తిప్పయరెడ్డిగారు క్రీ 1415 సంవత్సరమునను చేసిన యగ్రహారదాన శాసనములున్నవి.

పెదకోమటి మాచారెడ్డిగారు కొండపల్లిలో రాజ్యమేలయము

"అకలంకసకలభాషా కవితా మూర్ధాభిషిక్తాయ

విద్వన్నిరూఢ రాజాస్థానసుధాంభోధి పూర్ణచంద్రమసే"

"గద్యశ్రీబాణకవేః పద్యేపి తద్దైవకాళిదాసకవేః,

* * *

ఉజ్వలితరాష్ట్రభాషా కవితాస్సామ్రాజ్య పట్టబంధస్య

పుత్రాయాన్వయసుకవేః శ్రీ భారద్వాజగోత్రాయ"

"అనుజేనపాణి బదరీకృతపాణి నిఘణితఫణితిమార్గేణ

త్రిపురారిసుకవిమణినా సంస్మరయిత్రే సలక్షణంరామమ్"

పాల్గుమిశ్రీకంఠగురోః పంచాక్షరమంత్ర పానరుకస్య

శిష్యాయ.............................."

బక్కేపల్లి గ్రామమును వ్రాసిచారముగా నొసంగెను. తర్వాతివత్సరమున, మాచారెడ్డిగారి కుమారుడు తిప్పయరెడ్డిగారు గుడివాడ తాలూకాలో పామర్రు దగ్గఱగల యేకమూర్తు గ్రామమును ప్రకాశపర్రుదేవుని భాండాగారాధిపుడగు మల్లనకు మన్మడగు బాకమల్లయ యను బ్రాహ్మణునికి దానముచేసెను. తండ్రికొడుకు లిద్దఱిద్దఱును సరహారియాను విద్వాంసు స్థానకవిగా నుండెను.

కొండవీటి రెడ్డిరాజ్యముతోపాటే కొండపల్లి రాజ్యవిభాగమును జెడిపోయినది. తెలుగోటి వెలమరాజులు కొంతభాగమును, విజయనగరరాజ్యము కొంతభాగమును వేమపీరభద్రారెడ్లు కొంతభాగమును గొనియుండురు.




వే మ. వీ ర. భ ద్రా

క్రీ. 1425 సం. ప్రాంతములఁ గొండవీటి కూలి పోఁగా శ్రీనాథుఁడటుపయి సమధికాభ్యుదయముతో నున్న రాజమహేంద్రవర రెడ్డిరాజ్యమునకుఁ జేరినాఁడు. అంతదాఁక శ్రీనాథున కాశ్రయమైన పెదకోమటి వేమారెడ్డిగారికి ప్రబలశత్రువులై రాజమహేంద్రవర రాజ్యమును బెంపొందించినవారు- కుమారగిరి రెడ్డిగారి కుమారుఁడగు అనపోతారెడ్డి, వేమవీరభద్రారెడ్లతండ్రి అల్లాడరెడ్డి, కాటయవేమారెడ్డి, తత్పుత్రుఁడు కుమారగిరిరెడ్డి-వీరెల్లరు రాజమహేంద్రవరమున క్రీ 1390-1420 సం.ల నడిమికాలమునఁ జనిపోయిరి.

రాజమహేంద్రవర రాజ్యము కాటయ వేమారెడ్డిగారి కుమార్తెయగు ననితల్లి మూలమున తద్భర్తయగు వీరభద్రారెడ్డిగారికి సంక్రమించెను. వీరభద్రారెడ్డి మంత్రియగు బెండపూడి యన్నమంత్రి శ్రీనాథునకు బంధువు. తొల్త శ్రీనాథుఁడాతని ప్రాపుఁబడసెను. అతని కంకితముగా క్రీ. 1430 కిఁదరువాత భీమఖండము రచించెను. ఆ కృతి యవతరణికలో వేమవీరభద్రారెడ్లను వర్ణించెను. క్రమముగా 1430 తరువాత శ్రీనాథుఁడు "రాజమహేంద్రవరపు" "వీరభద్రారెడ్డి విద్వాంసుఁడై" య్యెను.

ఈకాలమున శ్రీనాథునితో పాటు రాజమహేంద్రవరమున శివలెంక నిశ్శంకయ్యగారికుమారుడు కొమ్మనామాత్యుఁడని మఱొక యాంధ్రకవియుండెను అతఁడు వీరభద్రారెడ్డి తమ్ముఁడగు దొడ్డారెడ్డి కంకితముగా శివలీలావిలాసమను ప్రౌఢప్రబంధము రచించెను.

వీరభద్రారెడ్డిగారి కంకితముగా శ్రీనాథుడు కాశీఖండము రచించెను. శ్రీనాథుడు ఆంధ్రకవీశ్వరులలో వింతతీరువాడు. అతడు తెనుగు వ్యాఖ్యాకవులు చేయు పురాణాంధ్రీకరణ పద్ధతికి చాలమార్పు కల్గించినాడు. కాశీఖండ భీమఖండ పురాణములను తెనిగించినను వాని స్వతంత్ర ప్రబంధములవలె తెనిగించినాడు. భీమఖండము గోదావరీతీరదేశ దివ్యవైభవ వర్ణనమునకు దగినది. కాశీఖండము గొప్ప పురాణగ్రంథమయినను శ్రీనాథుడు తన యిచ్చవచ్చినతీరున కొన్నికొన్ని విషయములను చేర్చి కొన్ని మార్చి మూలముతో నంతగా సంబంధము లేనితీరున అతిప్రౌఢమయిన ప్రబంధశయ్యతో స్వతంత్రకృతియన్నట్లు రచించినాడు. తెలుగు కాశీఖండము నెవరుగాని కాశీమాహాత్మ్యాది పురాణ కథాపరిజ్ఞానమునకయి చదువరు. అది ప్రౌఢాంధ్ర కవితా పరిజ్ఞానమునకయి చదువదగిన ప్రబంధమే. పురాణాంధ్రీకరణమని పేరేకాని శ్రీనాథుని తెనిగింపులు ఆయన యిష్టప్రకారము సాగినవే. శ్రీనాథునకు ప్రౌఢకవితా పాకముమీద ప్రీతి తగనుగ ముగా నాతడు గ్రంథగ్రంథిమయమయిన శృంగారనైషధమును రచించినాడు. ఆయన కండమువచ్చిన కవితాసంగర్వ మిట్టిది:

"హరచూడా హరిణాంకవక్రతయు గాలాంతస్ఫురచ్చంద్రకా
పరుషోద్గాఢ పయోధరస్ఫుటతటీ పర్యంత కాఠిన్యమున్
సరసత్వంబును సంభవించెనొకొ గా సత్కావ్యముల్ దక్కెనన్
జరకాలంబు నటించుచుండ గవిరాజ గహారంగింబులన్"

ఈయన గ్రంథములలోకెల్ల కాశీఖండము పండితుల కవితా రచనాఛాతుర్యము గలది. ఇట్టి కవితావైభవమునకు కారణములను శ్రీనాథుడిట్లు చెప్పుకొన్నాడు.

"ఆంధ్రక్షమామండ లాఖండలుండైన
వేమభూపతి కృపావీక్షణంబు
ఘోడరాయాంక సద్గురురాజభీమేశ్వ
రస్వామి పదసమారాధనంబు
కమలాద్రినిలయ మార్కండేయ శివమౌళి
చంద్రాంశనవసుధా సారధార
వేదాద్రినరసింహ విపులవక్షస్థలీ
కల్హారమాలికా గంధలహరి
కారణంబులు నద్భుతకములుగాఁగ
సంభవించిన సాహిత్యసౌష్ఠవమున
వీరభద్రేశ్వరుఁ బ్రబంధవిభుని జేసి
కాశికాఖండమను కావ్యగానొనర్తు"

ఈ సాహిత్యసౌష్ఠవ కారణమువల్ల శ్రీనాథునకు రాజమహేంద్రవరమున సమకూడినవే.

ఇట్టి కవితావైభవముల వెలయఁజేయుచు, సర్వసౌఖ్యముల ననుభవించుచు నిరుచుచుండఁగా క్రీ. 1450 సం॥ దాఁక శ్రీనాథుఁడు రాజమహేంద్రవరమున వర్ధిల్లినాఁడు. అంతలో రాజమహేంద్రవరమున వేమవీరభద్రారెడ్డి రాజ్యము నంతరించినది

రఘువంశమున దశరథుఁడు రాజ్యపట్టభిషిక్తుఁడగునాఁటనుండి మహామంత్రిగానుండి దశరథమహారాజు మరణము మొదలుగాఁ దద్వంశక్లేశములనెల్ల ననుభవించుచు సుమంత్రుఁడు చిరకాలము జీవించినట్లు,

మన శ్రీనాథుఁడును పెదకోమటి వేమారెడ్డిగారి రాజ్యలాభము నాఁటి నుండి తదాస్థానమున విద్యాధికార్యున్నతోద్యోగమువహించి, కొండవీటి రాజమహేంద్రవర రెడ్డిరాజ్యవైభవములు సమసిపోయినపిదపఁ గూడ జీవించి దీర్ఘజీవితమను బరువును మోసినట్లు మోవవలసినవాఁడయ్యె దానినిఁక స్మరింపను.

మహావైభవ మనుభవించిన రెడ్డిరాజ్య మిట్లంతరించినను చాఁప చిఱిఁగి చదరలయినట్లు తద్రాజ్యము చెదరులుగా గొన్నిచోట్ల నేఁటికిని వర్ధిల్లుచున్నది. గుంటూరు మండలమున రాపూరురాజధానిగా విజయనగర రాజులక్రింద రాజ్యమేలినవాఁడు బసవయ రఘువరెడ్డి వెన్నెలకంటి సూరనార్యునిచే పదునారవశతాబ్ది యారంభమున విష్ణుపురాణమును ఆంధ్రీకరింపించెను. ఈ విష్ణుపురాణము శ్రీనాథుని పురాణాంధ్రీకరణ పద్ధతిని దలఁపించుచు మూలానుసారముగాఁ జాల హృద్యముగా నున్నది.

గోదావరీతీరమున బిక్కవోలు రాజధానిగా రాజ్యమేలిన కామినేనివారు కృతికర్తలై, కృతిపతులై యాంధ్రభాషకుఁ జాల నభ్యుదయము గూర్చిరి. పట్టమెట్ట సోమనాథకవి కామినేని కామిరెడ్డిగారి కవీశ్వరుఁడై సూతసంహితాది గ్రంథముల రచించినాఁడు. ఈ మహాకవి రచనము చాలమేలయినది. కామినేని మల్లారెడ్డిగారు షట్చక్రవర్తి చరిత్రమను ప్రశస్తప్రబంధము రచించిరి. వీరియాస్థానిలోఁ బెక్కుగ్రంథములు వెలసినవి.

పదునేనవ శతాబ్దిలో అద్దంకిసీమలోని మూగచింతపల్లెలోఁబుట్టి సర్వాంధ్ర ద్రవిడదేశసంచారియై వేల్కొలఁది యాఁటవెలఁదులను విజ్ఞుల

జిహ్వారంగములపై నాట్యమాడించిన దొడ్డకవి వేమన పద్యకర్త వేమారెడ్డిగారు రెడ్డిజాతి జగజ్జ్యోతి. సహజకవితాధారల యాఱుగడ్డ.

గద్వాల, వనపర్తి, ఆత్మకూరు, దోమకొండ, మునగాల, సంస్థానములవి పేర్వెలసిన కాలమునుండియు నంధ్రవాఙ్మయాభ్యుదయమున కెంతేని తోడ్పడుచున్నవి. గద్వాలలో ముష్టిపల్లి సోమభూపాలుని కాలమున కాణాద పెద్దనసోమయాజి మహాకవియై యధ్యాత్మ రామాయణ ముకుందవిలాసాది గ్రంథములఁ బెక్కింటిని రచియించినాఁడు. సోమభూపాలుఁడును సంగీతసాహిత్య చతురుఁడై స్వయముకవియై జయదేవగీతగోవిందము పద్యగేయాత్మకముగాఁ జాలఁ జక్కఁగాఁ దెలిఁగించినాఁడు. గద్వాల సంస్థానమువలెనే ఆత్మకూరు, వనపర్తి, దోమకొండ సంస్థానములును కవిపోషణమున వాఙ్మయరక్షణమున నాటికి నేఁటికి బేర్వెలయుచున్నవి.

నేఁడును నైజాము రాష్ట్రమున రాయలసీమలో, మధ్యాంధ్రదేశమున, సుగుణగణ్యులగు రెడ్డిగృహస్థు లెందఱో గలరు. అందు కవులెందఱో కలరు. ఆంధ్రాభ్యుదయమునకు నాఁడు నేఁడునుగూడ రెడ్డిసంఘము గొప్పయాలంబమై వెలసినది. వెలయుచున్నది. నేఁటికని ఆంధ్రసారస్వతభాగ్య భాండాగారములో రెడ్డికులమువారొక గొప్ప భాగస్వాములనియు, రేపటి యాంధ్రాభ్యుదయమున వారొక ముఖ్య నిర్వాహకులై నిలువగలరనియు వారు ధర్మపరాయణులనియు వారియెడ నాకుఁగల పరితోషమును మరలఁ బ్రశంసించుచు నీయుపన్యాసము ముగించుచున్నాను.

# మాతృక

శ్రీ తూములూరి శివరామకృష్ణశాస్త్రి

శబ్దబ్రహ్మేయదేకం యచ్చైతన్యంచ సర్వభూతానాం।
యత్పరిణామస్త్రిభువన మఖిలమిదం జయతిసావాణీ॥

"సర్వభూత చైతన్యరూపమును త్రిభువన పరిణామ కారణమును అద్వితీయమునగు మాతృక (శబ్దబ్రహ్మము) సర్వోత్కృష్టముగ ప్రకాశించుచున్నది" అను శ్రుతిప్రామాణ్యమున శబ్దమునకు లోకవ్యవహారమేకాక ఇతరప్రయోజనము లున్నవని ఆర్యులు నమ్ముచున్నారు. పాశ్చాత్యులదృష్టిలో శబ్దముయొక్క ప్రయోజనము మనోగతభావములను స్ఫుటముగా ప్రకటింపగలుగుటయే. ఈ ప్రయోజనము ప్రస్ఫుట శబ్దమగు వైఖరిచేతనే కలుగుచున్నదనియు, శబ్దమునకు గుప్తముగ మరిమూడు రూపములున్నవనియు వానిని గుర్తించిననేగాని శబ్దముయొక్క సమగ్రస్వరూపము గోచరింపదనియు ఋషులఆశయము. (పాశ్చాత్యుల శబ్దోత్పత్తి వర్ణనము కేవలము వైఖరీమాత్రవిషయము). శబ్దోత్పత్తి, వర్ణసమామ్నాయము, తత్ప్రయోజనములవిషయమున ఋషుల ఆశయముల పరిశీలింతము.

అథర్వవేదమున "ధీతీవాయేఅనయన్" అను ఋక్కు శబ్దసృష్టిని విశదీకరించుచున్నది. (అనుబంధమును చూడుడు) వివక్షువునుండి శబ్దమిట్లభివ్యక్తమగుచున్నది. ఒకఅర్థమును చెప్పతలచినంతనే వివక్షువునకు తద్వాచకశబ్దమును ప్రయోగింప కోరికపొడముచు. ఆ కోరికవలన

మూలాధారమున ప్రాణవాయు పరిస్పందము కలుగును. ఆ పరిస్పందము వలన మూలాధారమున సకలశబ్దములకును మూలకారణమును నిష్పందమును మిక్కిలిసూక్ష్మము నగు పరావాక్కు ఆవిర్భవించును. ఆవాక్కు మూలాధారమునుండి ఊర్ధ్వగతమైనాభిదేశమునుపొంది సామాన్య జ్ఞాన రూపమున వివక్షిత పదార్థమును కనుగొనును. ఇట్టియవస్థయందీవాక్కు "పశ్యంత" అనబడును. ఇంకను ఊర్ధ్వగతమై హృదయదేశమును పొందును. అర్థవిశేషనిశ్చయ బుద్ధియుక్తమై శరీర మధ్యదేశమును పొంది "మధ్యమ" అను నామమును పొందును. అదియే కంఠతాల్వాది స్థానములయందు కకారాది వర్ణరూపమున నభివ్యక్తమై పరావబోధన సమర్థమై "వైఖరి" అని వ్యవహరింపబడుచుండును. పరాపశ్యంత మధ్యమావస్థలను పొందినశబ్దము దేహాంతర్గతమైనందున అస్ఫుటమై ఇతరులకు గోచరింపదు. వైఖర్యాత్మకమగు శబ్దముమాత్రమే అర్థమును బోధింపగలదు. సముద్రమునుండి సూర్యరశ్మిచే నాకర్షింపబడిన జలము అస్ఫుటమగురూపములను పిమ్మట ఈషత్స్ఫుటమగు మేఘరూపమునొంది తుదకు వర్షరూపమున నభివ్యక్తమయిన విధమున మూలాధారమునుండి వివక్షచే నుద్బుద్ధమగుచున్న పరమాత్మగతమగు శబ్దరూపశక్తి పరాదులయం దస్ఫుటరూపమును మధ్యమయందీ షత్స్ఫుటరూపమునొంది తుదకు వైఖరియందు స్ఫుటరూపమున నర్థమును బోధించుచున్నదని సారాంశము తేలుచున్నది.

ఈ శబ్దసృష్టి స్వరూపము బహిర్ముఖములగు ఇంద్రియాదులకు గోచరింపకయు యోగిదృష్టికిమాత్రమే గోచరించుననియు నచటనే

ఇట్లు తెల్పబడినది. "వేదము" మొదలగు సమస్తవాఙ్మయములను నిదానభూతమగు తత్త్వము నన్వేషింపగోరి మహర్షులు సమగ్రముగ నింద్రియపాటవము నార్జించి బహిర్ముఖమగు దృష్టితో నన్వేషించిరి. ఇట్టి స్థితియందు వీరి చైతన్యము జాగ్రదవస్థయం దభిమానముకలదై 'విశ్వ' సంజ్ఞకమై యుండెను. కాని అట్టి చైతన్యమునకు వాంఛనీయమగు తత్త్వము గోచరింపలేదు. ఇంకను సూక్ష్మదృష్టితో పరిశీలింపగోరి ప్రత్యాహారబలమున బాహ్యేంద్రియములను మనస్సునందు లయమొనరించి అన్వేషించిరి. మనోమాత్ర వ్యాపారవంతమగు నీ స్వప్నావస్థయందు వీరిచైతన్యము 'తైజస' వ్యపదేశమునొందును. అప్పటికిని వారికి సమగ్రతత్త్వము గోచరింపలేదు. మనస్సును ప్రత్యాహరించి నిద్రావస్థయందు ప్రజ్ఞానఘనమగు ప్రాజ్ఞరూపమున నింద్రియవైరపేక్ష్యముగ నన్వేషించిరి. కాని నిస్సమస్తోపశమగు తత్త్వమునకట్టికిని గోచరించలేదు. తుదకు కారణశరీరాభిమాన విరహితము నమూర్ధ్యవస్థాపన్నమగు సర్వసాక్షి చైతన్యయోగమున నట్టితత్త్వమును తెలిసికొనిరట. స్వప్నసుషుప్తి తురీయావస్థయందు సయితము ... మున చైతన్యమును స్వాధీనమునం దుంచుకొనగలిగిన మహాత్ములకే ఇట్టి అన్వేషణాధికారము కలదు. సామాన్యనరులకు స్వప్నాదులయం దన్వేషణశక్తి యుండదుగదా!

పై వర్ణనమువలన విచిత్రములగు కొన్ని సిద్ధాంతములు లూహింపతగియున్నవి. ఇంద్రియములు విజాతీయ పదార్థములను గ్రహింపలేనివిధమున చైతన్యము విజాతీయావస్థయందున్న పదార్థమును గ్రహింపజా

లదు. పార్థివమగు ఘ్రాణేంద్రియము అపార్థివమగు శబ్దమును గ్రహింపనివిధమున జాగ్రదవస్థాపన్నమగు చైతన్యము తురీయావస్థాపన్నమగు పరావాక్కును గ్రహింపలేదు. జాగ్రదవస్థయందలి యంత్రపరిశోధన లకు శబ్దబ్రహ్మయొక్క పరాద్యవస్థాత్రయము విషయము.

జాగ్రదవస్థయందు కలుగుజ్ఞానము సమగ్రము ఉత్తమము అనుకొనబడుచున్నది. ఈజ్ఞాన మింద్రియజన్యమగుటచేత నది సంకుచితమనియు నంతకంటె ఉత్తమనుగు మనస్సువలన కలుగు స్వప్నావస్థయందలి జ్ఞానము, ప్రజ్ఞానఘనమగు సుషుప్తియందలి జ్ఞానము, కారణశరీరాభిమాన విరహితమగు సమాధిజ్ఞానము, ఉత్తరోత్తరాభ్యర్హితములని ఋషుల ఆశయము. ఈ సిద్ధాంతము మానవునకు విపరీతముగ గోచరింమను కాని జాగ్రదవస్థయందైనను సామాన్యమానవు డేవస్తువునైనను సమగ్రముగా చూడజాలడుగదా? కరతలామలకమునందును రెండవభాగము గోచరింపదు. ఇట్టియెడ స్వప్నాద్యవస్థలయందును ఋతంభరమగు ప్రజ్ఞను స్వాధీనమునందుంచుకొనిన ఋషులయాప్తవాక్యములను సామాన్యప్రజ్ఞతో తృణీకరించుట సాహసమని తలచియే ఋషుల అనుభవముల ప్రకటించు వేదముల ప్రామాణ్యమును యుక్తివాదులగు తార్కికులుసయితమంగీకరించి యున్నారు.

పరతత్త్వమునుండి ప్రవృత్తిముఖమున నుత్పన్నమయి పరాద్యవస్థలనొందిన శబ్దమును నివృత్తిముఖమున వైఖరినుండి సూక్ష్మసూక్ష్మతర సూక్ష్మతమరూపమున విమర్శించుచో పరతత్త్వమును చేరవచ్చుననియు ఇందువలన తెలియుచున్నది. సర్వశాస్త్రములు సర్వదర్శన

ములు సర్వయోగములు నీప్రయోజనము నుద్దేశించియే ప్రవర్తిల్లినవి. సర్వశాస్త్రములకు పరబ్రహ్మమున తాత్పర్యమను వాక్యము లుపపన్న మగుచున్నవి. భర్తృహరియు

ఇదమాద్యం పదస్థానం సిద్ధిసోపానపర్వణాం
ఇయంసా మోక్షమాణానామజిహ్వారాజపద్ధతిః
అత్రాతీత విపర్యాసః కేవలామనుపశ్యతి॥

అని శబ్దశాస్త్రమును స్తుతించుటయు సంభవించినది. లేకున్న శబ్దశాస్త్రము మోక్షప్రదమెట్లగును?

మాతృక:- ఇట్టుల నాలుగవస్థలను పొందినశబ్దము న 'మాతృక' అందురు. అకారము మొదలు క్షకారము వరకునుకల వర్ణసముదాయ మునకు 'మాతృక' అను వ్యవహారము లోకమున కన్పించుచున్నది. ఇది వైఖరీమాత్ర విషయమయినచో గౌణము. మాతృకాశబ్దమునకు (మాతి, తరతి త్రాశయతీతి మాతృకా) సృష్టి సంహారస్థితి కారణమని యౌగికార్థము. మాతవలె నిష్టార్థములనిచ్చి పోషించునది కాన మాతృక యనియు వేరొకయర్థము. దీనినే అక్షర సమామ్నాయ మందురనియు, భుజించికాని రాత్రియందుకాని ఆమ్నాయమగుటచే (వేదము) దీనిని పఠింపరాదనియు అట్లొనర్చిన నది యభీష్టముల నీయ కుండుటయేకాక యజమానిని హింసించుననియు, మాతృకామహిమ ఋషులచే పలువిధముల వర్ణింపబడినది. ఈవర్ణనము లందలిసత్యమును తెలిసికొనుటకు అర్థస్పష్టక్రమము శబ్దార్థసంబంధము మొదలయినవి పరిశీలింపతగినవి.

సాధకుడు పద్మాసనస్థుడై మూలబంధాదులతో ప్రాణవాయు నిరోధము నభ్యసించవలెను. వాయుప్రేరితమై మూలాధారాగ్ని ప్రజ్వలించును. వాయ్వగ్ని సమాఘాతవశమున కుండలిని ఉన్నిద్రితయై షట్చక్రములను గ్రంథిత్రయమును ఛేదించుకొనిపోయి సహస్రారమున శివునితో మోదించునని ప్రాణనిరోధకులు నుడువుచున్నారు.

''మూలాధార ధ్వనిం శ్రుత్వా ప్రబుద్ధ శక్తి కుండలీ
జ్వలత్పావకసంకాశా సూక్ష్మతేజస్స్వరూపిణీ
మూలాధారాచ్చిరఃపద్మం స్పృశంతీ విద్యుదాకృతిః
తమూస్పృష్టశిరః పద్మాత్ అమృతౌఘప్రవర్షిణీ
నిర్గతామాతృకావర్ణా సుషుమ్నావర్త్మనాఖిలాం
వ్యాపయిత్వస్థితా—'

'మాతృకోపాసనమూలమున మూలాధారధ్వని వినబడినంతనే సూక్ష్మతేజః స్వరూపిణియగు కుండలిని షట్చక్రభేదనపూర్వకముగా సహస్రారమంటి అమృతరసస్నిక్తమై తిరిగి మాతృకావర్ణరూపమున శరీరమంతయు వ్యాపించును' అని శబ్దబ్రహ్మోపాసకు లనుచున్నారు.

"ఆత్మాబుద్ధ్యా సమేత్యార్థాన్ మనో యుంక్తే వివక్షయా
మనఃకాయాగ్ని మాహంతి సప్రేరయతి మారుతం
మారుతస్తూరసిచరన్ మంద్రంజనయతిస్వరం
సోదీర్ణో మూర్ధ్న్యభిహతః వక్త్రమాపద్య మారుతః
వర్ణాన్ జనయతే—"

అను శిక్షావాక్యమునయిత మిట్టియాశయమునే ప్రకటించుచున్నది. పై ప్రమాణములనుబట్టి విమర్శించినచో ప్రాణాయామాది యోగముల

వలన కలుగుపరిణామము శబ్దోచ్చారణమువలనను కలుగుచున్నదనియు, శబ్దము కేవల వ్యవహారప్రయోజకమే కాక సద్వినియుక్తమైనచో మానవునకు నదియొక దైవదత్తమగు యోగసాధనమనియు తెలియు చున్నది. అందువలననే స్వాధ్యాయమొక తపముగా భావింపబడుచు న్నది. "ఏకశ్శబ్దః సమ్యక్ జ్ఞాతః సుష్ఠుప్రయుక్తః సకృదుచ్చరితః స్వర్గే లోకే కామదుక్ భవతి" ఒకశబ్దమును చక్కగా తెలిసికొని చక్కగా ప్రయోగించి ఒక్కసారి ఉచ్చరించినంతనే స్వర్గలోకమున కామధేనువు వలె కామములనిచ్చునని మహర్షి నుడివినాడు.

మాతృక - కామధేనువు:- కామముల నిచ్చుటచే మాతృకను కామధేనువందురు. యోగులు నిర్దిష్టస్థానములయందు ధారణచేసి ఇష్ట సిద్ధులనొందుట ప్రసిద్ధము. శరీరమునందలి చక్రవిశేషములయందు అక్షరములు తత్తద్వర్ణములతోడను తత్తదధిదైవతములతోడను ఎట్లభి వ్యక్తములగుచున్నదియు వాగుపాసకులు వర్ణించియున్నారు. తదను గుణముగా తత్తత్స్థానములయందు మనస్సును ధారణచేసి ఆయాతత్వ ముల సమ్మేళమున ఇష్టసిద్ధులనొందుటయు అనుపపన్నముకాదు. కాని సంకల్పబల మావశ్యకము. సంకల్పబలానుగుణముగా శీఘ్రసిద్ధి కలుగు చున్నది. ఒకే ధనువునుండి వేయబడిన బాణము ధానుష్కునిబాహుమును కౌశలమునుబట్టి కార్యమును సాధించుటయు సాధింపకుండుటయు సంభ వించుచున్నది. ఈసూత్రము నాధారముగా చేసికొనియే మంత్రశాస్త్ర ము వెలువడినది. చక్రములందలి దళచాలనానుపూర్వ్యానుగుణముగా మంత్రవర్ణములు కూర్చబడినందున మంత్రములందలి వర్ణవ్యత్యయము

కాని వినియమము కాని సిద్ధిప్రతిబంధకము స్వరము కాలప్రమాణము మొదలగునవియు వాయుధారణ సహకారకములగుటందున తద్విపర్యాసము సిద్ధిప్రతిబంధకము. ఇట్టి అదృష్టప్రయోజనము కలదగుటచేతనే

"మంత్రోహీనః స్వరతో వర్ణతో వా మిథ్యాప్రయుక్తో నతమర్థమాహ
సవాగ్వజ్రో యజమానం హినస్తి యథేంద్రశత్రుః స్వరతోఽపరాధాత్"

అను కారికచే వినియమము ప్రతిబంధకమే కాక అనిష్టప్రదమనియు శాసింపబడినది. ఇట్లు శాస్త్రసిద్ధమగు వర్ణానుపూర్వీయుక్తమగుటయే వేదముల గొప్పతనము.

అధ్యయననియమములు:- శబ్దముయొక్క అపూర్వశక్తిని గుర్తించిన మహర్షులధ్యయనము నొక తపముగను యోగముగను గణించి యోగమునకువలెనే అధ్యయనమునకును కొన్ని నియమములను విధించిరి. ఉషఃకాలమున మేల్కొని కాల్యములనిర్వర్తించి స్నాతుడై పవిత్రపాణియై బ్రహ్మచారియై వనమునకేగి ప్రసన్నమనస్కుడై వర్ణాదుల స్థానప్రయత్నవివేకము నవగతించి అర్థమునందు మనస్సును ధారణచేసి మధురముగను వ్యక్తాక్షరముగను పదచ్ఛేదసహితముగను సుస్వరయుతముగను ధైర్యయుతముగను లయానుగుణముగ పఠించిన అదృష్టప్రయోజనము సిద్ధించును.

"అవ్యక్షరం హ్యనయుమ్యం విస్వరం వ్యాధిపీడితం
అశుతాశస్త్రరూపేణ వజ్రేశిరసి ధార్యతే"

అని అపశబ్దనిషేధము ఘోషింపబడినది.

మాతృక - తదర్థము:- మాతృకావర్ణములు తత్త్వప్రతిపాదకములగుటచే ఆయా వర్ణములచే ప్రతిపాద్యములగు తత్త్వములు, వాని అను

పూర్వోయుందలి ప్రయోజనము వానివలన తెలిసికొనదగిన అధ్యాత్మవిద్య మొదలగునవి కొన్నితంత్రములయందు వర్ణింపబడినవి. నాట్యావసానమున పదునాలుగుమారులు డక్కావాద్యమున సనకాదిసిద్ధుల ఉపదేశమునకై పరమేశ్వరుడు పదునాలుగుసూత్రముల ప్రకటించుటయు, ఆమాహేశ్వ రసూత్రములకు వారివారి అభీష్ట శాస్త్రానుగుణముగ వ్యాఖ్యచేయుటయు, పాణిన్యాచార్యులవారు తదాధారముగ శబ్దశాస్త్రమును రచించుటయు లోకప్రసిద్ధము. ఆసూత్రములపై నందికేశకాశికలయందును మాతృకాద్యర్థములు వర్ణింపబడినవి. మాతృకోపాసనవిధాన ముపనిషత్తులయందు వర్ణింపబడినది. వివిధశాస్త్రప్రణేతలు శబ్దము నెట్లుపాసించినదియు నిరూపించుటకిట తావులేదు. లోకవ్యవహారమునకంటె అధికఫలము నిరూపింపబడినందుననే సంస్కృతము దేవభాష యని ప్రతీతి. నేటికాలమున కనుగుణముగ ఆగమానుసారముగ వర్ణసమామ్నాయమహిమ వర్ణింపబడినది. తంత్రవిశేషవిరోధములున్నచో ఆగమమే పరిష్కరింపగలదు.



అనుబంధము—1

ధీతీవాహా అనయన్ వాచో అగ్రింమనసావా యేవదన్న్రుతాని
తృతీయేనబ్రహ్మణావావృధా నాస్తురీయేణామన్వతినామధేనోః॥

అథర్వవేద-సప్తమకాండే। అనువాకే-సూక్తే-ఋక్-

విద్యారణ్యభాష్యే:- ధీతీ వేతిద్వాభ్యాంచేన ఇంద్రాగ్నియజనసర్వకామః।
ప్రజాపతింవా॥

ఈదృశీభిః వివక్షూణాం శబ్దాభివ్యక్తిః। ప్రథమమభిలషిత మర్థంవివక్షోః పురుషస్య తద్వాచకశబ్దప్రయోగార్థం తదిచ్ఛావశేన జాతాత్ ప్రయత్నాత్ మూలాధారే ప్రాణవాయోః పరిస్పందో జాయతే। తేనపరిస్పందేన మూలాధారే సకలశబ్దమూలకారణభూతా నిష్పందా సూక్ష్మాపరావాక్ ఆవిర్భవతి। సైవ మూలాధారాత్ ఊర్ధ్వం నాభిదేశం ప్రాప్తా సమాన్యజ్ఞానరూపా వివక్షితపదార్థదర్శనాత్, పశ్యంతీత్యుచ్యతే। సైవహృదయదేశంప్రాప్తా అర్థవిశేషనిశ్చయ బుద్ధియుక్తా మధ్యదేశావస్థానాత్ మధ్యమేతిగీయతే। సైవకంఠతాల్వాదిస్థానేషు వర్ణరూపేణ వ్యజ్యమానావిశేషేణ పరావబోధప్రచండావైఖరీతిభణ్యతే। అత్రపరాద్యవస్థాత్మకాస్త్రయశ్శబ్దా దేహాంతర్గతత్వాత్ అస్ఫుటత్వేన వివక్షితమర్థం పరేభ్యోనప్రతిపాదయంతి। వైఖర్యాత్మకః శబ్దఏవ అర్థప్రత్యాయనక్షమః। "గుహాత్రీణి నిహితానేంగయంతి తురీయంవాచో మనుష్యావదంతి" ఇతిహినిగమః। "గుహాయాం త్రీనిపదాని నిహితాని నార్థంవేదయంతే" ఇతిహియాస్కేనవ్యాఖ్యాతం॥ ఉక్తమపి—

స్వరూపంజ్యోతిరేవాంతః పరావాగనపాయినీ
యస్యాందృష్టస్వరూపాయాం అధికారోనివర్తతే
అవిభాగేనవరానాది సర్వతఃసంవృతక్రమా
ప్రాణాశ్రయాత్తు పశ్యంతీమయూరాండరసోపమా
మధ్యమాబుద్ధ్యుపాదానా కృతవర్ణపరిగ్రహా
అంతస్సంకల్పరూపాతు నశ్రోత్రముపసర్పతి
తాల్వోష్ఠాద్యభిఘృతివ్యంగ్యా పరబోధప్రకాశినీ

మనుష్యమాత్రసులభా బాహ్యావాక్ వైఖరీమతా॥ఇతి॥

తథాఅస్యాఋచఃఅయమర్థః—ధీత్యా ధ్యానాత్మకేన వివక్షాజన్యప్రయత్నజాతప్రాణవాయుపరిస్పందావిర్భూతేన పరావస్థాపన్నేన ప్రథమేన శబ్దబ్రహ్మణా ఇతియావత్ -వాచోఽగ్రం= "సర్వేవేదాయత్పదమామనంతి" ఇతిశ్రుతేః సకలవాక్యప్రతిపాద్యత్వేన ముఖ్యం నిఖిలవాగ్వ్యవహారస్యవా ఆదిభూతం ప్రజాపతిరూపమర్థం అనయన్ ధ్యానవిషయత్వం ప్రతిపాదితవంతః యేఽపివివక్షవః మనసా సామాన్యధర్మగ్రాహకేణ పశ్యంత్యాత్మకేన ద్వితీయేన శబ్దబ్రహ్మణేత్యర్థః. ఋతాని సత్యభూతాని అఖండపరావస్థాపేక్షయా ఉపదుద్గతాని వా వాక్యాని దేవతావాచకశబ్దవిచారవిషయాణి అవదన్ తే వివక్షవః తృతీయేన ధ్యానమనోవచ్ఛిన్న పరపశ్యంత్యపేక్షయాతృతీయత్వం త్రిత్వసంఖ్యాపూరకేణ బ్రహ్మణా। అంతర్విభక్తవర్ణాత్మకేన అర్థవిశేషాధ్యవసాయ బుద్ధియుక్తేన మధ్యమాఖ్యేనేత్యర్థః। వావృధానాః-వర్ధయంతః అశబ్దవిషయమర్థం శబ్దవాచ్యత్వేన పోషయంతః, తురీయేణ-చతుర్థేన చతుస్సంఖ్యాపూరకేణ వైఖర్యాత్మకేన వర్ణపదవాక్యరూపేణ బ్రహ్మణాధేనోః। వాఙ్నామైతత్। వాచ్యవాచకయోరభేదాత్ వాచ్యేవాచకశబ్దః। మంత్రప్రతిపాద్యస్య। యద్వాధేనువద్ధేనుః అభిమతఫలప్రదానేన ప్రీణనకారిణః ప్రజాపతేర్నామ, అమన్వత-ఉచ్చారితవంతఇత్యర్థః—

అథవావాచో అగ్రమితపదేన వేదాత్మికాయా వాచః నిదానం పర్యవసానభూమిర్వా పరమాత్మతత్త్వంవివక్ష్యతే। తాదృశం సకల

వాఙ్న దానభూశంతత్వం యేజిజ్ఞాసవో మహర్షయః దేవావా। ధీతి కర్మనా మైతత్ =ధీత్యా బాహ్యావిష.య వ్యాపృతయా అక్షవృత్త్యా। అసయణా=జ్ఞాతుంప్రియత్నంకృతవంతః। అనేనజాగ్రిదవస్థాభిమాని విశ్వసంజ్ఞాత్మనాతత్వంగ్రహేతుం ఉద్యుంజత ఇత్యుక్తంభవతి। యేవా తతోపి సూక్ష్మదర్శినః మనసా కేవలేన అంతఃకరణేన బుశాని సత్యబ్రిహ్మవిషయాణి వాక్యానిఅవదణ। అనేన స్వప్నావస్థాయాం కేవల మనోవ్యాపారాత్ తదభిమాని తైజసాత్మకబ్రిహ్మణా తత్వజ్ఞానాయ ప్రియతంత ఇత్యుక్తంభవతి। యేవా తతోపి ఆంతరంవస్తుజిజ్ఞాసమానాః వావృధానాః పరిచ్ఛేదాపనయనరూప వర్ధనాద్ధేతోః తృతీయేన త్రిత్వ సంఖ్యాపూరణేన బ్రిహ్మణాచైతన్యాత్మనా। అతిసుషుప్తౌ కారణ శరీరాభిమానీ ప్రిజ్ఞానఘనః ప్రాజ్ఞోవివక్షితః తేనజాగరస్వప్నావస్థావత్ సుషుప్తౌ బాహ్యాంతఃకరణేంద్రియజనిత విక్షేపాభావాత్ అపరిచ్ఛిన్న బ్రహ్మభావేన వర్తంత ఇతి శేషః। ఏవమవస్థాత్రియాభిమాని విశ్వాదితాదాత్మ్యేన తత్వంబుభుత్సవః సర్వేఃతత్రి నిరస్తసమస్తభేదం తత్వమలభమానాఃసన్తః ధేనోఃవాచోఽగ్రిం ఇతినిర్దిష్టస్య ఫలప్రిదస్యవా ప్రరమాత్మనః నామ=నామకంయత్స్వరూపంప్రితి సర్వేప్రిణతాః తత్ నిరస్తసమస్తోపాధికం సత్యజ్ఞానాదిలక్షణం తత్వం తురీయేణ తుర్యావస్థాపన్నేన కారణశరీరాభిమానరహితేన సర్వసాక్షిణా చైతన్యేనాత్మనా అమన్వతజానంతిస్మ। “గూఢం సూర్యం తపసావప్రితేన తురీయేణ బ్రిహ్మణా అవిందదత్రి” ఇతి నిగమః—

శిక్షయు శబ్దసృష్టినిగూర్చి ఇట్టివర్ణన నిచ్చుచున్నది. చూడుడు.

ఆత్మాబుద్ధ్యాసమేత్యార్థా న్మనోయుంక్తే వివక్షయా
మనఃకాయాగ్నిమాహంతి సప్రేరయతిమారుతం
మారుతస్తూరసిచరన్ మంద్రంజనయతిస్వరం
సోదీర్ణోమూర్ధ్న్యభిహతః వక్త్రమాపద్యమారుతః
వరాన్ జనయతేతేషాం విభాగః పంచధాస్మృతః

ఆత్మా అంతఃకరణం సంస్కారరూపేణ స్వగతానర్థాన్ బుద్ధ్యాస్వవృత్త్యా సమేత్య ఏకబుద్ధివిషయాన్కృత్వా తద్బోధనేచ్ఛయామనోయుక్తం కరోతి తదిచ్ఛావన్మనః కాయాగ్నిం జాఠరమగ్ని మభిహంతి సకాయాగ్నిఃసోదీర్ణఃసమారుతఉదీర్ణః ఊర్ధ్వప్రేరిత ఇత్యాది వ్యాఖ్యా—



# ఆంధ్రసాహిత్యము, అలంకారశాస్త్రము

వేదాల తిరువేంగళాచార్యులు

1. ఆంధ్రులు - వారిప్రాచీనత, వారిభాషాప్రాచీనత.
2. కవిత్వము- దానినిగురించి పాశ్చాత్త్యులతలంపులు దానివిమర్శ-
3. ప్రాచ్యులతలంపులు - దానివిమర్శ-
4. అలంకారశాస్త్రము- దానిస్వరూపము- దానిశాస్త్రితయెట్టిది?
5. అది నిర్బంధములపోగా? సలహాలా? ప్రాదేశికమా? పరిపూర్ణమా?
6. ఆంధ్రసాహిత్యము యొక్క ప్రారంభదశ - అప్పటివారితలంపులు.
7. అలంకారశాస్త్రమునగల సిద్ధాంతములనది యెంతవరకు గ్రహించెను.
8. ఆంధ్రసాహిత్యముయొక్క స్వతంత్రస్థితి - దానివైలక్షణ్యము.

ఆంధ్రులు ఋగ్వేదమునాటివారు. ఐతరేయారణ్యకము ననుసరించి యాంధ్రులతోబుట్టువును వైశ్వామిత్రులైన మధుచ్ఛందుడు "అగ్నిమీళే పురోహితంయజ్ఞస్యదేవమృత్విజం హోతారం రత్నధాతమం" అని యుపక్రమించి ఋగ్వేద ప్రథమమండలమును దర్శించెను. ఇంకను 3 మండలములో విశ్వామిత్రుని తండ్రి తాతలు, విశ్వామిత్రుని పుత్రపౌత్రులుగూడ ద్రష్టలగనున్నారు. వీరందరుగూడ విశ్వామిత్రుని పుత్రులగు మనకు సమానవంశజులు. మఱియు దీర్ఘతమునికథ

ననుసరించి మనకు సోదరుడగు కక్షీవంతుడు దర్శితగానున్న సూక్తములు ఋగ్వేదముననున్నవి. ఈ యన్ని కారణములవలన మనము ఋగ్వేదము నాడే యుంటిమి. ఇందులో మనచేయిగూడ నున్నదికనుక ఋగ్వేదము గూడ మనసాహిత్యమే యనవచ్చును. మఱియు అచటనే కీకటదేశ ప్రశంసగలదు. "కీకటా మాగధామతాః" అను త్రికాండశేషమును బట్టి మగధము కీకటమనబడుచున్నది. మనకు చీకటి, మగఁడు మగ వాఁడు ఇత్యాదిపదములున్నవి. మఱియు "చాణూరాంధ్రనిషూదనః" అను చోట చాణూరపదమునకుప్రక్క ఆంధ్రపదము కల్పియే ప్రయో గించుటనుబట్టి చూడగా నాంధ్రులకు తమపేరులకు ప్రక్కన ఆంధ్ర పదము జాతివాచకముగా తప్పక కూర్పబడియుండెడిదేమోయని తోచును. నాగన్నగౌడు, వెంకన్నగౌడు, జార్‌సాహెబు, సుబ్బయ్యార్, శివస్వామయ్యార్ ఇత్యాదిపదములందును, సుబ్బారాయుడు, రామా నాయుడు మొదలగువారి యందును జాతివాచకముగా నామధేయముల నంటి కన్పడుటలేదా? కనుక మగ+ఆంధ్రు అనునది క్రమముగా, మగడు అని యైయుండునని తోచును. తెనుగునకు సజాతీయమగు సజాతీయమగు అరవములో అది యనునర్థమున "అమదు" యనునది కన్పట్టును. "కరియమదు" ఆంధ్ర అనునది యుచ్చారణ వైకల్యమువ లన అమదు అని యైనదేమో! సంద్రము-సముద్రమైనదేమో! కాగా తెలుగులో ఆంధ్రశబ్దపు అవశేషమే అదు, అదిగా మిగిలిపోయి యుండ వచ్చును. ఇందుకు డుఙ్ అని విధించి దానికి బిందువునుకట్టిపెట్టు వ్యాక రణము పోద్బలకము. అనగా రామ+ఉ+డు. ఇచట రాముండు అగు ననునిర్ణయము మన ఆ+దు అనియూహింపనగును. అగుతే ఆంధ్ర

యని అకారాంతమైయుండగా అన్దు యని ఉకారాంతత యెట్లాప్స
నందురా? వినుడు ఐతరేయబ్రాహ్మణములో "తానను వ్యాజహార
అంతాన్వః ప్రజాభక్షీష్టేతి" త ఏతేఽన్ధ్రాః పులిందాః పుండ్రాః శబరాః
మూతిబాః బహవవ తే ఉదన్త్యాభవంతి." యనుటవలన ఉదంతత వీరికం
దరకు ప్రాచీనమేయని స్పష్టపడును. ఇందుకుతగినట్లుగా తత్సమ మహ
ద్వాచకము తెనుగులో మొదట కృతోత్కములగుటతప్పనిసరి. రామ-
రాము-డు=రాముడు అచ్చతెలుగువాటికి ము + డు అనియే. దీనిస్వ
రూపము గమనింపగా హనుమంతు, రాము, గోపాలు ఇత్యాద్యుదంత
ములగు సంస్కృతసమములు తెనుగున కిస్పట్టుటను గూడ పరిశోధింపగా
నాంధ్రుంకుదంతత సహజమనియు, నట్లే జాతవాచకపదఘటనము
సహజమనియు అందువలన తెనుగుపదములందు మగ+అంధ్రు=మగం
డు. తత్సమములందు రామ యనునదిమొదల రాము యనునదియై
పిమ్మట రాము+అంధ్ర చేరి రాముండు, రాముడు ఇత్యాదిగానైనదని
తోచును. కాగా మనము మొదట మాగధులమనిస్పష్టపడును. ఇందుకు
విశ్వామిత్రుని యాశ్రమము అయోధ్యనుండి మిథిలకుపోవు మార్గములో
నుండుటయు సాధకము. తర్వాత దీర్ఘతముని వృత్తాంతము ననుసరించి
యేదో నదీతీరముననుసరించి ఆంధ్రాదిదేశములకు చేరుటయుసపన్న
మగును. ఇట్లు వేదకాలపు సాహిత్యమును గమనించితిమి.

సూత్రకాలమున ఆపస్తంబుడు ఆంధ్రదేశీయుడని సుప్రసిద్ధము. కావున నతనిసూత్రముల ద్వారమునను అతనిశిష్యుడో గురువో యగు బోధాయనుని ద్వారమునను గూడ సంస్కృతసాహిత్యమున మనకు పాలున్నదని స్పష్టము. బోధ యనుని బ్రహ్మసూత్రవృత్తి గూడ యిట స్మర్తవ్యము.

ఇక కావ్యములకాలమున కాళిదాసు, భారవిదండి కవులమూల మున నీసాహిత్యమున గొప్పపేరు సంపాదించితిమి. కాళిదాసు అను పదము లోని "కాలి" యనుపదమే యతడు తెలుగువాడని తెలుపును. దండ్యాచార్యుడు ఆంధ్రజయసింహుని, అతనినగరమును, కొల్లేరు, కాంచీనగరము (నాసిక్యమధ్యానగరీ) వ్వరించినాడు. ఆంధ్రుడుగా సుప్రసిద్ధుడగు దండ్యాచార్యుడు భారవికి మనుమడని ప్రసిద్ధిగలదు. కావున నీముగ్గురి సాహిత్యము ఆంధ్రసాహిత్యమే. ఇక ప్రాకృత ములో హాలుని "గాథాసప్తశతి" యుత్తమోత్తమసానము నలంకరించినదనుట జగద్విదితమేగదా! హాలునిగ్రంథమందు మన తెనుగుపద ములు కుప్పతెప్పలుగా నున్నవి. (౧-౧) గోసలద్దం. (౧-౭) అప్ప (తండ్రి) (౧-౮) అత్తా (౧౯) సెన (సెనగ) (౧-౧౩) మసి (౧-౧౬) జే (సంబోధన) మామి=అత్త (౩-౬౪) బుడ్డ (బుడక) (౧-౩౦) రంప=పొట్టు. జరము (అమజరము) (౧-౫౦). గోదావరి, వింధ్యము స్తుతింపబడెను. "పాడీ" (మహిషపోతము). ౧-౬౫, ౧-౬౬. ఫణము. ఇత్యాదిగా తెనుగుపదములు చాలాయున్నవి. మృచ్ఛకటికములోని ప్రాకృతములో "కూర" యను వర్థమున నాపదమే "కూల" యని వాడబడి సంస్కృతములో "కూర" యనబడినది. మరియు నాగార్జునాచార్యుని మాధ్యమిక కారికరసతంత్రము మొదలగుగ్రంథములు ఆంధ్రులవేగదా! ఇక్లె కొండయ్య యనునాంధ్రుడు స్వర్ణమొనర్చుటనుగురించి యొకగ్రంథమును వ్రాసెననియు దానిని టిబెట్టుభాషలోనికి పరివర్తన మొనర్చిరనియు చాలకాలముక్రిందట యాంధ్రపత్రికలో జదివితిని. ఏతావతా వేదాదుల నైర్వాణిలోను తత్కాలమునగల ప్రాకృతజన వ్యావహారికభాషయగు

సాధు ప్రాకృతము. (ఇచట శాతవాహనం, పిక, నత, కోయ్యప్రాకృతపదములు చరిత్ర స్మరింపుము) తర్వాతసంస్కృతము, తర్వాత ప్రాకృతము వగైరాలలోను చాలవరకు మన యాంధ్రులసాహిత్య నిర్మాణవైదగ్ధ్యమున్నది. అంతేకాదు. అసలు అలంకారశాస్త్రమునకు ఇప్పటికే దొరకినవానిలో (భరతనాట్యసూత్రము మినహా) మనయాంధ్రుడను దండ్యాచార్యుని కావ్యాదర్శమే ప్రాథమికము. తరువాతిది భామహునిగ్రంథము. ఈ విషయము ఇతరులచే సప్రమాణముగ రుజువొనర్పబడినది. మరియు నీశాస్త్రములో నిప్పటికి ప్రమాణతమములుగా నెన్నబడువానిలో మొదటిది మన గ్రంథమగుటయేగాక చివరదికూడ మనయింద్రుడు ఉపద్రష్ట జగన్నాథపండితరాజు రచించిన రసగంగాధరమే. తెలుగులో నీశాస్త్రము రచించినవారిలోగూడ నైజామురాష్ట్రమునకే శ్రీ సుబ్బారావుగారిద్వారా ఈకీర్తి దక్కినది. వీరురచించిన రమ్యాలోకములో వారియుపజ్ఞను, కవితావిషయమున వారికిగల సపరిశీలనమగు దృష్టిని భావనాబలమును సవ్యతానిరూపణమును కవితాపరిణామ రహస్యప్రదర్శనమును మనము గమనింపవచ్చును. అదియట్లుండనిండు. ఏవో చిల్లర పుస్తకము లెల్లి యున్నను పండితలోకమున ప్రసిద్ధినిగణించి క్షోదక్షమముగా తత్వమును వెలువరించినది రసగంగాధరమేకాని తరువాత అట్టిగ్రంథము మరియిప్పటికి పుట్టలేదు. అథవా అలంకారశాస్త్రములో సర్వోపజీవ్యములగు గ్రంథములువ్రాసిన వశిశిస్తి ఆంధ్రికాశ్మీరకులదేకాని ఇతరులదికాదు. ఇందుకొకటి కారణమై యుండవచ్చును. మనము మాగధులమై తమపరి వర్తిస్థానమున దక్షిణాపథమునకు వచ్చుటకు ముందరనో తరువాతనోగాని కాశ్మీరకులమై యుంటిమి. ఈ

విషయము కల్హణుని రాజతరంగిణి 3 వ తరంగములో (124 129) వరకు కన్పడుచున్నది. కథాసరిత్సాగరము చివరనున్న శ్లోకమునుబట్టి యీకాశ్మీరరాజువంశము శాలివాహనుని వంశముగా కన్పట్టుచున్నది. కాగా కాశ్మీరదేశపు పరిస్థితులే అచటగల ప్రకృతిశోభావైచిత్ర్యమే సహజముగు నా రామణీయకదృష్టిని భావకసహృదయులకు సమకూర్చును. ప్రకృతిపరిస్థితులుకూడ సహజముగా నాయాశాస్త్రములకు ప్రోత్సాహకములగుట తత్వజ్ఞులకు క్రొత్త విషయముకాదు. ఇట్లు మనముగూడ కాశ్మీరదేశ నివాసమువలన కాశ్మీర దేశస్థులకుగల సాకర్యమేపొంది అలంకార శాస్త్రరచనకు ఉన్ముఖులుగా జేయబడియుందుమని తోచుచున్నది. తర్వాత క్రమముగా నన్నయభట్టారకుని కాలమునకు ఆంధ్రమహాభారతమును, ఆంధ్రభాషా సాహిత్యములకు నవీన ప్రసానముగాను శుభోదయముగాను స్వీకరించునట్టి యదృష్టమేర్పడినది. అది మొదలుకొని ఈనాటివరకు గన్పట్టు ఆంధ్రసాహిత్యమంతయు ఇంచుమించుగా నిచటలక్ష్యము. పై నిరూపణమువలన నాంధ్రభాషా సాహిత్యముల ప్రాచీనత మీకందరికిని విశదమైనది. ఇది ఎట్టిఅభిప్రాయములతో నేర్పడెనో గమనింతము.

### కవిత్వము - పాశ్చాత్యుల తలంపులు

ఆంధ్రమహాభారతము ఈనాటి ఆంధ్రభాషలో మొదటిగ్రంథమని గ్రహించితిమి. అది సంస్కృతభారతమునకు వట్టి భాషాంతరీకరణముకాదు. అయితే అదియెట్టిదనగా సంస్కృతములోని కథాభాగమునమాత్రముగైకొని నన్నయభట్టారకుడు తనకవితా వైభవమును ఆంధ్రులకు శ్రవోహృదయముల రసాయనముగూర్పించెను. ఈ

నిరూపణకుముందు అసలుకవిత్వమనగా నేమియో మనము విచారింప వలసియున్నది. శంఖములో బోసినగాని తీర్థముగాదను సామెతననుసరించి మొదట పాశ్చాత్యులతలంపుల ననుసరించి కవిత్వమేమియో కనుగొందము. "We mean the art of employing words in such a manner as to produce an illusion on the imagination, the art of doing by means of words what the painter does by means of colours.

"చిత్రకారుడు రంగులతో చిత్రములు దీర్చునట్లు పదములతో భావనాశక్తిని దిద్దితీర్చుట కవిత్వము" అని మెకాలేతలంపు. అనగా పదములు అనుమాటకు భాష యని యర్థముగ్రహింపవలెను. కాగా కవియొక్క భావనాశక్తిని మనకు వ్యక్తీకరించు భాష కవిత్వమని తేలుచున్నది. ఈలక్షణము కవిత్వమునకేగాక శాస్త్రభాషనుగూడ ఆక్రమించుచున్నది. సైన్సులో నేదైననొకడు క్రొత్తగా నొకవిషయమును బాగుగా భావించెననుకొనుడు. దానిని వ్యక్తీకరించునతడు వ్రాసిన భాషగూడ కవిత్వమే కావలసివచ్చును. అట్లుగాక వస్తుయథాస్థితికి సంబంధించినది గాక ఏదైననొక వైచిత్ర్యమునకుసంబంధించిన భావనయే యందు వివక్షితమగునో "వాతెర తొంటకైవడి మాటలాడడు" అను నిత్యాదికమగు స్వభావోక్తిగలది కవితకాకపోవును. ఇంకొకరిని చూతము. "It is the rhythmic-creation of beauty-Edgar Allen Poe." లయతో మేళవించిన సంగీతమువినునప్పుడు గల్గు నానందమువంటి ఆనందము నుచితశబ్దములతో సౌందర్యచిత్రణము కవిత్వమని Edgar Allen Poe అను అమెరికాదేశీయుని తాత్పర్యము. ఇట్టికవిత్వము "ఎటజనికాంచె" "లలనాజనాపాంగ

"మానినీమన్మథు మాధవుగానకే" ఇత్యాదులందున్నది. అంతేకాక సరళశైలిగల గద్యము తెనుగుకవితలో నెక్కువగానున్నది. ఉదాహరణమునకు :

"రాజా! జనులకెడ బాటగువిధమున నడచుచు లోకనింద్యముల నుడుగుచు పరులకలిమికులుకక, యందరతోషము పొందిపొసగి మనుట తగును.

కౌరవేశ్వరా! కోపమును, తుళ్ళిపాటును, గర్వమును, నోర్వలేమియు, దురభిమానమును, నిర్వ్యాపారత్వమును, కాపురుషుల గుణములు." (రాయబారము- మొహమ్మద్ ఖాసింఖాన్.)

మరియు పద్యములందైనను "వెన్నెలలు నిద్రబోవుచు వేళలయ్యె, ఉదయసామ్రాజ్యవిభవముల్ వదలలేక, మించులగుడారముల తోడమలగిపోవు, తారకాసంతతులు కాలధర్మనియతి" (తెనుగుతోట. రా. సు.) "చదలం పయోదమాలికల శ్యామలమయ్యె తమాలపంక్తులన్ గొదమవసంబు జీకటులకున్ నెలవయ్యె గుమారభీరుడే యదుసుతు డిల్లుజేర్పుమని యాడెడు నందనిదేశమాలకించి దెసలుచూచుచున్ జనియె స్నేహతపస్విని రాధయొంటిమై" (ప్రవాసరాధిక రా. సు.) ఇట్టిరకము కవిత్వము ఆంధ్రభాషలో నపారముగలదు. ఇదియంతయు పైలక్షణముచే సంగృహీతము కాదుగదా. "భావనాశక్తిచే సహేతుకమొనర్చి సత్యమును ఆనందదాయకముగా చెప్పుటయే కవిత్వము. నూతనసృష్టియే దానిప్రయోజనము" (జాన్సన్) "కాంచనరత్నసంఘటిత (2 పు. 2 పే.) కాని తేటనవ్వులు మించుమల్లియలుబూయ కట్టుపుట్టంబు మడతలు గాలికడలి పాయిమెరుగు వాకతెరగల హాయులు

గులుక, నతివమోహినిబోలె నయ్యాలలూగు. (విలాసిని. స. సూ. శాస్త్రి). "వలచెటువంటివో మనకీవాడనచ్చునే యడ్డిరయ్య పల్కులజవరాలు తా చదువులోన జపంబులోన బాయదగ్గమగ నెల్లపొద్దున మొగంబున గట్టినయట్లు యుండు నాసలుపకు నంచు గ మకలు నవ్వు విధాతకు భంబునీవ్రతన్" "అడవినెదె శ్రోత్రియుండొక్కడతివ పైనసలిగి జందాలు త్రెంచె సన్న్యాసమనుచు, త్రెంచివైచినదానిన తిరిగి దాని పూసలకొసంగజేయింప బోద్దువో యె. (పార్వతీపరిణయము) ఈతీరు కవిత నెట్లు సంగ్రహింపగలము?

"The language of imagination and passions"-Hazlit.

రసము భావనాశక్తియు ప్రకటితములగు శబ్దములు కవితయని Hazlit మతము. ఇందు రసము బ్రకటింపవలయునపుడు భావనాశక్తి తప్పనిదే. ఇదిలేనిచో నే శబ్దమును రసమును బ్రకటింపజాలదనుట సర్వసమ్మతమే. కావున భావన కందు జెప్పనక్కరలేదు. కాగా రసైకప్రవాహము కవిత్వమనునట్లయినది. కాగా "అరిజూచున్ హరిజూచు కము లందందమందారకీకము" "జలజల గమ్మతేనియలు జాఱు" ఇత్యాదులు వైలక్షణము కనకూటముగా గుప్పతెప్పలుగా నున్నవి. అంతేకాక 'మాటుగా వైచిన మాంజిష్ఠతెరయెత్తి పంజు మంచముడిగ్గ మంజుఘోష, మొకరిమ్మైలమోత మద్దుచూపగ రంభ కనకంపుగడుగు బాగాలదోడిగె, నొకటివేనలి ముడ్చి యొక్కకేల ఘృతాచి గాజురెక్కలతల్పు గడియపుచ్చె, నలసభావముతోడ నలవోక ప్రమ్లోచ నిల్వుటద్దంబులో నీడజూచె, హారిణిగిలించె నొండుపట్టాంశుకంబు, మేనకధరించె పాలిండ్లమీద రవికె, అప్సరఃస్త్రీనికేతనాభ్యంతరముల, గొక్కొరోకో యటంచును కోళ్ళుగూసె"—(హరవిలాసము.)

అప్సరస్త్రీలు నిద్రపోవుటెట్లు? అటు కోళ్ళు కూయుటెట్లు? ఇటు తెల్లవారుటయను వస్తువే ప్రధానముగాని రసభావాదులకు ప్రసక్తి లేదు. మరియు "వెఱ్ఱివెట్టిరే బాడబులు పరాశరుపట్టి దాశకన్యాకేళి తప్పఁజేసి, కులములో వన్నెతక్కువయయ్యెనే గాధిపట్టికి మేనకచుట్టరికము, ననువుగా డైవేల్పు నాగవాసముగూడి మహిమఁగోల్పడియెనే మాండకర్ణి, స్వారాజ్యమేలంగ సీరైరె సురకుహల్యా జారుడైనజంభాసురారి, వారికన్నను నీమహత్త్వంబు ఘనమె, పవనపర్ణాంబు భక్షులైన వసిరియుచపకచ్ఛశాల్ గట్టికొను మునిమ్రుచ్చులెల్ల, తామరసనేత్రలిండ్ల బందాలుగారె"—(మనుచరిత్ర.) ఇప్పట తామరసనేత్రల కటాక్షము నెప్పుడు తమమీఁద ప్రసరించునోగదా కృతార్థులమగుదుమని యీ తపములను దొంగవేషములతో నున్నారీ మునులందరు. అంతటి సకల తపోధన చిరాకాంక్షమాణమగు పరమార్థమునుమీ అప్సరోవనితా సమావేశము అనువస్తువే యిటప్రధానము. ఇది పైలక్షణమునకందదు. ఇట్లే "గీ॥ దైవగతియెవ్వరికి దాటఁదరము గాదు, చింతచేయంగవలవదాకంతయైన, బలికికష్టంబుగట్టుట గొలుచుటయును, న్యాయమటువలె గావింపు మమరనాథ" —(దశావతారచరిత్రము-కూర్మావతారము.) ఇచట బలవంతునకు కష్టముగట్టి అతని సేవించుట యుచితము అను నర్థాంతరన్యాసముప్రధానము. ఇదియు పైలక్షణమునకందదు. మరియు సత్యమునందును సౌందర్యమునందును ప్రతిభయందునుగల యుత్సాహము కవిత్వమునకు వస్తువు. భావములను భావనాశక్తిచే వ్యక్తపరచుటకు ప్రయత్నించుట కవితామార్గము.

భావసమన్వయమునకు అనువైన శైలీసమన్వయము కవితాభాష.

(లేహంటు)సత్యము నందుగల సౌందర్యమును, ప్రతిభోత్సాహముచేత భావించుటవలన కవితపేర్పడునను కవిత్వపూర్వరంగము నిరూపింపబడినది. కవిత్వమున్నవాడు మొదట వస్తుయథార్థస్వరూపమునందుగల సౌందర్యమును భావింపవలెను. ఆభావన ప్రతివానికిని కలుగదు. ఎవడు ప్రతిభావంతుడో వానికే దాని ఉత్సాహమువలన భావన యేర్పడును. అట్లు భావింపగా (Inagination) నేర్పడిన భావమును వ్యక్తపరచుటకై కవిత ప్రవర్తిల్లును. అనగా తానుకనిపెట్టిన సౌందర్యమును వ్యక్తపరచుటకై కవి ప్రయత్నించవలెననుట కాని అది భావనాశక్తిచేసగుపనియా? యని మా సంశయము. సౌందర్యమును భావించుటయే భావనగాని, దానిని వ్యక్తీకరించుట కవి భావనవలన కానిపనియని మా విశ్వాసము. అభిధవలన-అనగా ఉచితశబ్దార విన్యాసముచేనగును. కవితవలన భావమును గ్రహించుటకు సహృదయునకు భావన కావలయునుగాని, అది కవిభావన గాదు. అదియటుండనిండు. ఇక మూడవ వాక్యము విషయములో నెవ్వోకని విప్రతిపత్తిలేదు. అదియే గుణాలంకార ఇతివృత్త శయ్యాపాకాది విధముల సూక్ష్మసూక్ష్మతరముగా నిరూపింపబడినది.

సీ॥ "విషయాంధకారము గ్రిల్లిపోయనివారికి సినపకిచ్ఛుడమున కిటెదవ్వు,
తెగగొనికసలు గదుగనివారికి, త్రిభువనంబునకు నెన్నిచాళ్ళుపెట్టు
చింతలన్నియు మోడు సేయనివారికి బోడియాతలకు నేడకీడు
ఏనుతత్త్వంబుల నెఱుగనివారికి నెరుకకు సేయూరికేది తెరవు,
తమమొగంబుజూడు తముజూడు పేనుగు మీదనున్నవాని మేరమీరి
సున్నమడుగజూచు చున్నారు హాంభక్తి గమ్యధామకాంక్ష గమ్మ
పరులు" —(పాం. మ.)

మరియు "నీపట్టెతిరుమణి నీతిరుచూర్ణంబు గణికకు వెండిబంగారులౌను, నీపుట్టుగోచియు నీకాలివేష్టు వల్యారకాంతకు పట్టుచీరలౌను, నీముష్టిగూడయు నీతులసిసరులు వేశ్యకు బందుగు లెట్టులౌను, నీవేద శాస్త్రముల్ నీసంధ్యజపములు లంజపనికి బుంజులగములౌను, పెట్ట నోపితివా చెప్పటట్టెయుందు, పెట్టలేకున్న విచ్చేయు పెండలకడ, మొదలకోయింతులకు ఒకముసుపెకాక నీసదాచారమేలయ్యా దాసరయ్యా"
—(విప్రనారాయణచరిత్రము).

యిట్టిదంతయు పైదానికిలక్ష్యముగా చాలయున్నదిగాని "వలపు పచ్చనిదని రక్తిమొలవ బాడికిరహమరుణఃపసియొద కపింప విసివి చెలిమి నల్లనిదని నిరసింతువిపుడు ప్రేమధవళంబనుచు నింకవిమతువెపుడు" (పిలుపు). "పెదవికదలించిపలికిన పాదలచెంత తెంచిపోసినముత్యాల తీరువోచె, కదలుచున్నవి నవ్వులింకమిశుభాంగి సూత్రమెచ్చట వైచితో చూపవమ్మ" (ఒక్క మాట) ఇంకను "చిత్తజువల్లితూవుమొన జేసిన జేయగనిమ్ము పైధ్వజంబెత్తిన నెత్తనిమ్ము" ఇత్యాది కవిత్వములో వారు చెప్పినవస్తువు సత్యమునగల సౌందర్యములేదు. కనుక వెనుకటిలక్షణము ఇచట వ్యాపింపదు. కనుకనే "సత్యము శాస్త్రములకు లక్ష్యము గాని కవిత్వమునకు లక్ష్యముగాదు. దీనిలక్ష్యము ఆనందము. అనగా కవిత్వప్రయోజనము హృదయానందమని 'కొలిరిజ్' చెప్పుచున్నాడు. ఇదిమన జగన్నాథపండితరాజు నిర్ణయించిన "రమణీయార్థ ప్రతిపాదకశ్శబ్దః కావ్యమ్" అనుదానితో నించుమించుగా సరిపోవును. అదియుగాక సహృదయ చక్రవర్తియగు ఆనందవర్ధనుడు "కావ్యవిషయే చవ్యంగ్య ప్రతీతీనాం సత్యాసత్యనిరూపణస్య అప్రయోజకత్వమేవేతి తత్ప్ర

మాణాంతర పరీక్షా కేవలముపకారాయైవ సంపద్యతే" అని స్పష్టపరచెను. ఇక మన ప్రాచీనులయభిప్రాయము లెట్టివో పరిశీలింతము.

### ప్రాచ్యుల తలంపులు - వానివిమర్శ

ప్రాచీనతముడనదగిన దండ్యాచార్యుడు "శరీరం తావదిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ" అనెను. అదికాదని భామహుడు.

అదోషములు సగుణములు సాలంకారములునగు శబ్దార్థములు కావ్యమనెను. కావ్యప్రకాశకారుడును శబ్దార్థములే కావ్యమనెనుగాని భామహుడు దెలుపని కావ్యాత్మను వ్యంగ్యార్థము నితడానందవర్ధనాచార్యులనుండి గైకొనెను. ఈమధ్యలో వామనాచార్యులు "రీతిరాత్మా కావ్యస్య" అని అదివరలో కావ్యమున కాత్మనిరూపణ మెవ్వరు నెత్తుకొననిదాని నుపక్రమించెను. ఇతడును "కావ్యశబ్దోయం గుణాలంకార సంస్కృతయో శ్శబ్దార్థయోర్వర్తతే" అని భామహుమతమునే యొప్పుకొనెను. ఇట్లు "శబ్దార్థములు కావ్యములు" అనుమార్గము ఆనందవర్ధనుని పర్యంతము కాశ్మీరకులు నడపిరి. దండియిది యుచితముకాదని శబ్దమే కావ్యమనినను తమవాడగు భామహుడు చెప్పినదికనుక అపరిశీలకులగు కాశ్మీరకులు అందరును దండిని గ్రహింపక భామహునిమతమే గ్రహించిరి. కాని వారికావ్యస్వరూపము అపరిశీలితమని స్పష్టసూచనతో ఆనందవర్ధనాచార్యులు "కావ్యతత్త్వార్థదర్శిభిః వాచ్యవాచకసంమిశ్రః శబ్దాత్మా కావ్యం ఇతివ్యపదేశాన్ వ్యంజకత్వసామ్యాత్ ధ్వనిరిత్యుక్తః" అనిచెప్పెను. అభినవగుప్తపాదులును లోచనములో మొదట శబ్దార్థశరీరము కావ్యమను నితరులమతము ననువదించి ఇట్లుఖండించెను.

"శబ్దార్థశరీరం కావ్యమితి యదుక్తం తత్రశరీరగ్రహణాదేవ కేన చిదాత్మనా తదనుప్రాణకేన భావ్యమేవ తత్ర శబ్దస్తావచ్ఛరీరభాగ ఏవసన్నివిశతే-సర్వజనసంవేద్య ధర్మత్వాత్. స్థూలకృశాదివత్ అర్థఃపునఃసకలజనసంవేద్యోనభవతి. నచఅర్థమాత్రేణ కావ్యవ్యపదేశః లౌకిక వైదిక వాక్యేషు తద్భావాత్, తదాహ అర్థః సహృదయశ్లాఘ్యఇతి" ఆనందవర్ధనాచార్యుల మతమునగూడ విశిష్టవ్యంగ్యార్థ ప్రతిపాదకమగు శబ్దము శరీరమై కావ్యవ్యవహారమును సమకూర్చునని స్పష్టపరచెను. ఇందు మూలమున ఇదివరలోని శబ్దార్థయుగళము కావ్యము. అది నిరాత్మకమను మతము అపరిశుద్ధమనియు పరిశీలనాదరిద్రమనియు వ్యక్తపరచెను. అంతేకాక ఆనందవర్ధనాచార్యులు నిష్పక్షపాతమును, విమర్శకమునునగు హృదయముతో బాగుగాపరిశీలించి పరిశోధించి యీ కావ్యస్వరూపవిషయముననేగాక గుణాదివిషయముల సర్వత్ర దండ్యాచార్యులమతమునే స్వీకరించెను. పిమ్మట మమ్మటుడు సదోషమని తెలిసినను అదోషౌ ఇత్యాది భామహలక్షణమునే స్వీకరించెను. కాని లోచనాకారుడు చెప్పినదోషము లక్షణమునకు తప్పలేదు. అయితే "అద్రావత్ర ప్రజ్వలత్యగ్నిరుచ్చై" రను చోట వెనుకటి భామహలక్షణమున కతివ్యాప్తి రాకుండ వ్యంగ్యముతో బైకవితాలక్షణమును సాత్మకమొనర్చెను. ఈతనివద్దనుండియే అలంకారశాస్త్రములో కేటలాగు పుస్తకములు పుట్టినవి. అంతకుపూర్వమున్న గ్రంథములలో కవితా విమర్శయే వివిధముఖముల నొనర్పబడినది. భట్టోద్భటుని కావ్యాలంకార రసంగ్రహకూడ అలంకారతత్త్వ విమర్శనయనే వ్యాఖ్యద్వారా ప్రధానమొనర్చినది. మమ్మటుడే కేటలాగుపద్ధతిని ప్రారంభించెను. ఇతనినిబట్టి

తర్వాతవారు జయదేవుడు చంద్రాలోకమును, విశ్వనాథకవిరాజు సాహిత్యదర్పణమును, ధర్మసూరి సాహిత్యరత్నాకరము వగైరాలను నిర్మించిరి. మమ్మటుని గ్రంథములలో క్రొత్తవిషయము లేశమును లేదు. కాని అలంకారశాస్త్రములో నితడొనరించినంతకల్లోలము నెవ్వరు నొనర్పలేదు. వమననును దోషముని తడు కల్పించినదే. ఈదోషమెంత మాత్రమును కుదరదు. లక్షణవిరుద్ధము. నిరుపత్తికము స్వవ్యాహతము. (చూ. 3 ఉద్యో) ఇటువంటికల్లోలము తక్క నితడేమియు నలంకారశాస్త్రమునకు, అనగా కవితావిచారమునను కల్పించిన అనగా స్వబుద్ధిబలముతో కావ్యప్రపంచమున గనిపెట్టినిరూపించిన క్రొత్తవిషయ మొక్కటియులేదు. ఇంతకుముందున్న వక్రోక్తిజీవన కారుడు కుంతకుడు హృదయదర్పణమను ధ్వనిధ్వంసగ్రంథమును వ్రాసిన భట్టనాయకుడు వ్యక్తివివేకమను ధ్వనిని రాణగ్రంథమును వ్రాసిన మహిమభట్టు అభిధావృత్తిమాతృక వ్రాసిన ముకుళభట్టు, అలంకార సర్వస్వము వ్రాసిన రుయ్యకుడు వీరందరును కవితామార్గమును చాలవిధముల విమర్శించిరి. ఇతని కాపద్ధతియే చేతకాలేదు. కాగా ఇతనినాటికి భోజదేవుని శృంగారప్రకాశము భోజుని సరస్వతీకంఠాభరణము శారదాతనయుని భావప్రకాశము వగైరాగ్రంథములన్నింటను తగు కవితామార్గము ధ్వనిప్రధానముగానుండుటలో శృంగారప్రకాశమునుబట్టి శృంగారైకప్రధానముగా ఏర్పడవలసివచ్చినది. అయితే రసాంతరప్రధానమగునది కవితయే కాకపోవలసివచ్చినది. చూడుడు! "కురువృద్ధుల్ గురువృద్ధబాంధవులనేకుల్ ధారుణీరాజ్యసంపద మదంబునగోమతి" అందువలన "వాక్యం రసాత్మకం కావ్యం" అని సాహిత్యదర్పణకర్త

వ్రాసెను. అందువలన సకలరసములను కవిత్వము సంగ్రహింపబడినది గాని యింతకుముందు చెప్పిన వస్తుఅలంకార ప్రధానములగు కావ్యకవితలకు సంగ్రహము కాలేదు. అందువలన నన్నివిధములగు కవితలను సంగ్రహించుట ఆవశ్యకమైనది. అనగా మహాకవులుకూడ నీటిప్రవాహముక్రిందికి పైకెగురుటను "జంబూఫలాని పక్వాని పతంతి విమలే జలే, కపికంపితశాఖాభ్యో గుళుగుగ్గుళుగుగ్గుళు" అని కపిచేష్టలను, "రాజాభిషేకే మదవిహ్వలాయాః" అని ఘటోల్లుంఠనము మొదలగు వానినిగూర్చి కవిత్వమును వ్రాసిరి. దానినంతను సంగ్రహించెడు సరియగులక్షణము వీరెవ్వరును రచింపలేరు. అయితే దండ్యాచార్యుడు రచించిన ఇష్టార్థవ్యవచ్ఛిన్నాపదావళి అనునది జాగరూకమైయున్నది. కాని అసూయగ్రస్తులగు తర్వాతవారు దానిని పరిగ్రహింపక పోవుటచేతను, వారికి సమగ్రలక్ష్య సంగ్రాహకమగు లక్షణరచన చేతకాక పోవుటచేతను, వారిలక్షణములన్నియు నవ్యాప్తిగ్రస్తములైనవి. అప్పుడు పండితరాజ జగన్నాథుడు "రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్యం" అని లక్షణమొనర్చెను. ఇది దండ్యాచార్యుని లక్షణమునకు సమగ్రభావ్యమే. ఈ లక్షణమువలన నిదివరలో నిరూపించినట్లు పాశ్చాత్యుల లక్షణమువలన సంగ్రహింపబడనివియు ప్రాచ్యులలక్షణములవలన సంగ్రహింపబడనివియునగు సర్వకవిత్వములును సంగ్రహింపబడినవి. ఇట్లు చతురశ్రమగు లక్షణనిర్మాణకీర్తి మొదటినుండి చివరవరకు దండి జగన్నాథులనుబట్టి మనయాంధ్రులదే! ఇంతేకాదు. సామాన్యముగా సర్వ సమంజసముగా ఆద్యంతములను సరిగాసమన్వయించి నిరూపించగల

ప్రజ్ఞ ఆంధ్రులలోనే గన్పట్టుచున్నది చూడుడు. అలంకారశాస్త్రములో ప్రకృతమున గన్పట్టుచున్నదికదా! ఇక కవితానిర్మాణములో సకలకవికులగురువని పేరుబడిన కాళిదాసు మనయాంధ్రుడని యింతకుముందే నిరూపించితిమికదా! అంతేకాక భారతదేశములోని నిఖిల భాగములుగల నాగరికతాది నానావిధ విజ్ఞానములను దర్పణమువలె ప్రకటించు దశకుమారచరితమును రచించినది మనయాంధ్రుడు దండ్యాచార్యుడే. విశిష్టాద్వైతమతమును ఉపనిషత్తులలోని భేదాభేదవాక్యములనన్నిటిని నిర్విరోధముగా మీమాంసాన్యాయ సామంజస్యముతో సమన్వయించి సహస్రముఖముల యుక్తప్రపంచములో శ్రీ విశిష్టాద్వైతమును స్థాపించి దేశమంతట వ్యాపింపజేసిన శ్రీ భగవద్రామానుజులు ఆంధ్రులే! ఇంతేగాక భగవద్విషయము గొప్పగ్రంథమును సమగ్ర విజ్ఞానామృతరాశిని నిర్మించినవారు పెరియవాచ్చాన్ పిళ్ళైయను సరవ పేరుతో నున్న నంబూరు వరదాచార్యులును నాంధ్రులే. అది యటుంచుడు.

### అలంకారశాస్త్రము - దానిస్వరూపము

అసలు కవితాసామగ్రియేది? కవితా పూర్వరంగోత్తరంగములేవి? దానిప్రయోజన పరమార్థములేవి? అదియెట్లు ప్రవర్తించి స్వకావ్యనిర్వాహమొనర్చినది? దానిస్థైర్య మెట్లుసంభవించును? ఈవిషయములిపుడు సమాలోచింపవలెను. ఈ విచారణమే అలంకారశాస్త్రము. అదెట్లు మనలో ప్రవర్తిల్లినదో తెలిసికొందము. అసలు కవిత యెందుకుత్పన్నమగును? ఎట్లుత్పన్నమగును? అనువిషయము ముపనిషత్తులలో జెప్పబడినవి.

"(శో)భ్యాంతు విశ్వేయ పేశా అమూరార పంశవమోయ ఇన్వ
ఘాః యత్సుక్తితంవ్యచన్తి యే సదాయ ఆపింపతీరసం అయంకలిరక
మిషుః అమృతంనిధా యా! ఎందుకు? అమూ: కవిః సునంసత్ శిఽనః")

ఎట్లుబోధించిన కవియుప దేశము హృదయములకెక్కునా? "అభో
ధిమాత్రైః (గంభీరః) "కవితమఃనమస్తే అస్తు". కవి పేశలముగను, గంభీర
ముగను బోధించినపుడే శ్రోతలహృదయము లందాతనియుపదేశామృ
తము ఆకర్షించి ప్రవహించి స్థిరతరమై ప్రయోజనసిద్ధి కల్గించును.
అంతేకాని పేలవముగానుండినగాదు. ఇదియే దండి గ్రామ్యతయని నిర
సించెను. "కన్యేకారా యమానం మాంసత్వం కామయసేకథం కామం
కందర్పచండాలో మయి వామాక్షి నిర్దయః"

అందువలననే యితడు "కామం సర్వోప్యలంకారో రసమర్థే
నిషించతుత థాన్య గ్రామ్యతైవైనం భారంవహతిభూయసా" అనియా
చిత్యమునరియే సకలసత్కవికావ్యముల పరిగ్రాహ్యతకును చిహ్నమ
నెను. దీనిని ఆనందవర్ధనాచార్యులు "అనౌచిత్యాదృతేనాన్య దరిస
భంగస్యకారణం। ప్రసిద్ధౌచిత్య బంధస్తు రసస్యోపనిషత్పరా॥" అని
దానినిస్వీకరించి, విస్తరించి నిరూపించెను. ఇందువలననే "పేశులసుధా
మయోక్తుల బెద్దనార్యు" అను చోట పేశలపద మునయోగింపబడినది.
మఱియు గంభీరతయనగా సుదాత్తార్థగర్భిత పర్యవసానమీ పురు
షార్థ పర్యవసాయియగు రసమును వ్యక్తీకరింపకల్గుట. రసవ్యంజన
ప్రావీణ్యములేనిచో నా పేశలతకర్థములేదు. కనుకనే అధునాతనులగు
కొందరికావ్యములందు పేశలతయున్నను రసవ్యంజనప్రావీణ్యము లేకుం
డుటచే తాత్కాలమాత్రి గ్రాహ్యములైనను పర్యంతనీరసములై చిర

స్థాయిత నొందకున్నవి. అదియట్లుండనిండు. దండ్యాచార్యుడు గంభీరతయనగా పురుషార్థ పర్యవసాయిరస వ్యంజకతయందే, సకలాలంకార వర్గమును కావ్యమున రసవ్యంజన పర్యస్తతచేతనే కృతార్థతచెందునని "కావ్యం సర్వోప్యలంకారో రసమర్థేనిషించతు" అనుమాటలో స్పష్టపరచెను. దానినే సహృదయ చక్రవర్తియగు నానందవర్ధనాచార్యులు ధ్వన్యాలోకములో "సమీక్ష్య వినివేశితః; రూపకాదిరలంకార వర్గఏతియదార్థతాం, సంధిసంధ్యంగఘటనం రసాభివ్యక్త్యపేక్షయా, నతుకేవలయా శాస్త్రస్థితి సంపాదనేచ్ఛయా" ఇత్యాదికములచే కావ్యోపయోగులగు నన్నివిషయములయందును విస్తరించిరి. సవ్యంజనైక ప్రాముఖ్యమునే నిరూపించెను. కనుకనే పెద్దనార్యుడు "సుధామయోక్తులు" అనునది చాల సాభిప్రాయమై చరితార్థమగును.

కావున ఆంధ్రమహాభారతాది గ్రంథములందలిభాష యిప్పటి వ్యావహారికకు స్పష్టసిద్ధము. అదియట్లుండనిండు. అయితే యిప్పుడు మహాభారతము నాంధ్రీకరించుటలో విశ్వశ్రేయఃకావ్యం అను నుద్దేశమే. "రసవృత్తిః వాక్యార్థతి రసోయథాతథా కవిభిః" అనుప్రియత్నమే అప్పటి తెనుగువిశ్వమునకు రసబంధురమగు నాంధ్రమహాభారత రూపమున ప్రాప్తమైనది. అప్పటివారు మనవలె స్వధర్మముల నిరసింపక "స్వస్థాన వేషభాషాభి మతాస్సంతః" అనియుండిరి. అందువలన వెనుకనిరూపించిన మన సాహిత్యము అలంకారశాస్త్రమున కనవగనే ప్రవర్తిల్లినది. సంస్కృతములోని మన అలంకారశాస్త్రము మాదే కదా. ఇతరులదికాదు. మఱియు నది నియమముల ప్రోగుగాదు. ఇట్టి భావముతోనే చాలమందియజ్ఞలు దానిని నిరసించుచు సాహిత్యవిదాన్యులతో

హాలుమాత్రమే. దానిశాస్త్రీయతయు నెన్నో యితరాంశములలో నిరూపించిరి. ఆ విజ్ఞానమును మన తెల్గువారు ఎట్లుపయోగించుకొనిరో పరిశీలింతము.)

కనుకనే నవీన కవివరుడును "కలవు రసరామణీయకములు కృతులను, మానుషీశారభములు సాధువునబలె, రసము లంతఃకరణయోగ రంజనములు, రామణీయక మాకర్షక రమ్యరచన" యనెను అయితే ఈకవి దేనినిభావించును ఎట్లు భావించును. ఎందుకు భావించును. అట్లు చేయుటలోగల పరమప్రయోజనమేమి? ఈ ప్రశ్నలకు ఉపనిషత్తులేమి చెప్పుచున్నవో కనుగొందము "సపర్యగాచ్ఛుక్రమ కాయమవ్రణ మస్నావిరంశుద్ధమపాపవిద్ధం కవిర్మనీషీ పరిభూస్స్వయంభూః యాథాతథ్యతో అర్థాన్ విదధాచ్ఛాశ్వతీభ్యః స్సమాభ్యః" అని ఈశావాస్యము నుడువుచున్నది. దీనిభావమిది. వ్రణాదిభరితమై స్నాయువమూహ బీభత్సమైన శరీరమువలె నవశిశుభ్రమును అశుచియు పాపావహమునగు నీప్రకృతిని తద్వ్యతిరిక్తముగా నవగా అవ్రణముగను, అస్నావిరముగను, శుద్ధముగను, అపాపవిద్ధముగను, శుక్రముగను అసలు శరీరమేకానట్లుగా నన గా నేవిధమగు నేహత్యయులేకుండ భావింపగలిగి యుండగల్గవలెను. అందుకు తనమనసు తనస్వాధీనములో నుండవలెను. ఇట్లు భావించినదానిని స్వసామర్థ్యమువలన (స్వయంభూః స్వయంభవతీతి) సంఘమున ఎవరికివారికి తగినట్లుగా (యాథాతథ్యతః) యోగక్షేమ విధాయకములగు పురుషార్థములను (అర్థాన్) చిరకాలము (శాశ్వతీభ్యస్సమాభ్యః) సమకూడజాలునట్లు (వ్యదధాత్) నిరూపింపగలుగవలెను. వాడేకవి. పురుషార్థసాధనముగా నిరూపించుటకై ఈ

ప్రకృతిని భావించుటయే కవియొక్క కృత్యమని తేలినది. మఱియు "యాస్తే విషశస్త్రంబభూవుః తాస్త్వావిశంతు మనసా శివేన" అనుట వలన నెంత మలీమసమైనను నెంతఘోరమైనను నెంతటిజాలు గొల్పు నదైనను సుపరిశుద్ధముగను, సుస్నిగ్ధముగను, శాంతస్థిరముగను భావింప వలయును. అనగా వానియందుగల సౌందర్యమును భావింపవలయున నియే పరమార్థము. కనుకనే అధునాతనుఁడగు మహాకవి యిట్లనుచు న్నాడు. "పరపచైతన్య రంజిత జగతియందు, కవిగ్రహింపగరాని వస్తు వులుగలవె, రాళ్ళనేడ్పించు పచ్చివిరహాలభాతి, ఎళ్ళచే జోలపాడించు తల్లులట్లు" కనుకనె "మట్టిలోబడ్డబీజము మంజుకుసుమ, బందమై చెలు వార సంబంధమరసి అతిమలీమస గర్భసంపతిత బిందువద్భుతాకృతి గొను రహస్యములుపోల్చె" మఱియు "కమిలి క్రుళ్ళిన వస్తుచయము గ్రసించి, సుభగభూతిగామార్చు నీ శుద్ధమూర్తి, వక్షమునదాల్చి కొండల బరువుమోయు, కడుపుగోయునా పగలను గారవించు" ఇట్లే "పాదద్వంద్వము నేలమోపి పవనుంబంధించి పంచేంద్రియోన్మాదం బుఁ బరిమార్చి బుద్ధిలతకుఁ మారామహత్తించి నిష్ఖేదబ్రహ్మపదా వలంబన రతిన్ గ్రీడించు యోగీంద్రుమర్యాదన్ నక్రము విక్రమించ గరి పాదాక్రాంత నిర్వక్రమై" ఇట్లు సుందరముగా భావించి పురుషార్థ సాధనముగా లోకుల కుపదేశించుటయే అతనిభావనకు ప్రయోజనము. ఇట్లుపదేశించుట స్వతంత్రముగా నొనర్పరాదా ప్రకృతిభావన యేల నన్నచో "సఖాచన్నాణాం వాచస్పతే పృథివీనస్యోనః" అని యుపనిష ద్వాక్యమువలన నీప్రకృతియే చేతనులకు సమస్తవిధములను ధారక పోషక భోగ్యభూతముగనుక దీనినే సరిగా వారికి పురుషార్థసాధన

ముగా నిరూపింపవలయునని తెలుసు. సభా యను దానిని విమర్శించి కాంతా సమతత్త్వము నిరూపింపవలెననగా నీతడు సూచునదొక వ్యాజముగానుంచుకొని ధ్వన్యైకప్రవణముగా నిరూపింపవలెనని "యత్సమశీతం సదాయ ఆసించతీరసం" అను వాక్యమున స్పష్టము. ఈ నిరూపణమున కంతకును పరమప్రయోజన మేమనగా "అమూః కవిః సుసంసత్ శివోనః పృథివీం యాహి రాజా ఇవ ఉదేహి రాష్ట్రం" అనినుడువబడినది. అనగా నందువలన వైయుక్త్యముగా కావ్యాస్వాదముకలిగిన ప్రతివ్యక్తియు "కావ్యంయశసేర్థకృతే వ్యవహారవిదేశివేతరక్షతయే" యనినట్లుగా నీ ప్రయోజనములనొంది వ్యవహారజ్ఞాన సంపన్నుడై సభ్యుడు కాగలుగును. సామిష్టికముగా నీ శివసుందర కవితాస్వాదము వలన రాష్ట్రమంతయు సభ్యజాతిగా యేర్పడగలదనుట. కనుకనే "ప్రాణులకు సరసాన్నముల్ వ్యాధులకు మహౌషధుల్ సుఖసాధన పోషణలకు దివ్యఫలపుష్ప ఋతుకళాదృశ్యములు సమృద్ధముగనిచ్చు తల్లి సర్పింపరాదే" అనుట యుపపన్నమగును.

రాష్ట్రమంతయు సకలవిధముల ధర్మాభివృద్ధినొంది తద్వారా పురుషార్థసంపాదకమై, సర్వవిధముల నాగరికతా సంపన్నమై, సభ్యజాతియగును. ఇట్టి యభివృద్ధి రాష్ట్రమునకు కవి కల్గించును. కనుకనే కవి రాష్ట్రములో రాజువంటివాడని చెప్పబడినది. రాష్ట్రమునకు సర్వవిధముల క్షేమంకరుడగువాడు రాష్ట్రమునందంతటను రాజువలె గౌరవింపబడుటలో నాశ్చర్యమేమున్నది? కనుకనే "సుకవితా యద్యస్తి రాజ్యేనకిం" అనునుడి యేర్పడినది. రాజునకుగల యితరభారమేమియు లేక రాష్ట్రమున గౌరవింపబడుటయే యిందుల పరమార్థము. ఈ కార

ణమును గమనించియే ప్రాచీనులగు మహారాజులు కవులను, కావ్యములను మిక్కిలి గౌరవించిరి. శ్రీ రామాయణమును గమనింపుడు. అసలు నన్నయభట్టారకుడుగాని, తిక్కనార్యుడుగాని భారతమును రచించుటలో నీయర్థమే ప్రధానమైనది. అప్పటి ప్రభువగు రాజరాజనరేంద్రుడు అంతకుపూర్వము బౌద్ధ జైనాదిమతముల హడావుడియు, రాజోపద్రవాదులు మొదలగు ననేక విప్లవములవలన రాష్ట్రములోని ప్రజలకు సరియగు ధర్మమార్గవిచక్షణ కలుగకుండుటను లక్షించి అది ధర్మశాస్త్ర ప్రవచనాదులనుగాని రూల్సు నేర్పరచుటవలనగాని ప్రజలయందంతటను నిరుపప్లవముగను, మృదుమధురముగను, హృదయంగమముగను, సుసాధ్యముగాదని గ్రహించి సకలవిధ పురుషార్థసాధనమగు భారతమును తెనుగొనర్చుటతో నీ సకలప్రయోజనమును రాష్ట్రప్రజలకు సంభవింపగలవని భావించి పై కారణమువలననే రామాయణముకన్న గూడ తదవిస్తృత స్పష్టచరిత్రలవలనను, ఆఖ్యానోపాఖ్యానముల వలనను భారతమే ప్రజలకు సుగ్రాహ్యమనుట నభ్యర్హితతరముగా నిశ్చయించి, నన్నయభట్టారకు నందుకు ప్రార్థించెను. అతడును తనకుగల యర్హతను "తన కులబ్రహ్మను" ఇత్యాదులచే పరామర్శించి చూచుకొని కృతిపతికిగల యర్హతను "రాజకులైక భూషణుడు రాజమనోహరుడు" ఇత్యాదులచే వివేచించి గ్రంథమునకుగల వివక్షిత గుణసంపత్తిని "ఆయుష్యం బితిహాస" గ్రంథరచనయందు ఇత్యాదులచే బ్రకటించి "ఆదరణీయ సార వివిధార్థ సస్ఫురణంబుగల్గి యష్టాదశపర్వసంభృతమై పెంపొందియుండు మహాభారత సంహితారచన బంధురుడు. భారతమును "సారమతిన్"...అయ్యెను. అంతేకాని యీమధ్య నెవ్వ

రోయనినట్లు పండితులకు మాత్రమే తెలియుటకు నాడు ఈ గ్రంథము రచించినది. "జగద్ధితంబుగన్" అని యచట స్పష్టముగా నుడివియేయున్నాడు. అథవా పండితులగువారికి అనువాదముతో నేమిపని. వారు సంస్కృతమునుండియే గ్రహింపగల్గుదురు. ఇప్పుడు సంస్కృత పండితులకు తెలుగువారిని చూడరాదా? స్వభాషా ద్రోహులగుట ప్రత్యక్షమేగదా? అప్పటి జనసామాన్యములోని వారికి నన్నయభట్టు భారతమును తెలిసికొనగల్గినంత తెల్గుసంస్కారమున్నది. లేనిచో నత డువ్రాసిన గ్రంథమున కేమిప్రయోజనము? సామాన్యులోకిమా యీ తని భాషను గ్రహింపలేదని మీరంటిరి. పండితలోకమునకా యిది అక్కరలేదాయెను! కనుక నిట్టి సిద్ధాంతపుపనిని చేయించుట రాజరాజ నకును చేయుట యితనికిని అనుచితమై అపుడే పండితలోకమున నీకళ్లో లము పొడసూపి యీగ్రంథము ఆదరించువారులేక నశించిపోయెడిది. ఇది యింతకాలము నిల్చుటకు ఏ యూనివర్సిటీవారు అప్పటినుండి పాఠ్యముగా నిర్ణయించిరి? కనుక వారుచెప్పినట్లు గ్రంథము పండితలోకముమాత్రమే తెలిసికొను భాషలో వ్రాయబడలేదు. అట్లే అయినచో అథర్వణ భారతమువలె నప్పుడే నశించెడిది. అథర్వణాదుల భారతము నశించుటకు కారణమేమి? అతనికవిత్వము పట్టి సంస్కృతపదములే! చివరవి భక్తులుమాత్రము తెలుగనుకొనవలెను. "నతవానావనినాథ" గ్రంథమంతయు నిట్లేయన్నందున జనసామాన్యమున కర్థముగాక యాదరము పడయరయ్యెను. అందువలన నది నశించెను. ఇట్లే కొంతకొంత యాదరపాత్రమగు నన్నెచోడుని కుమారసంభవాదికము కూడ పూర్తిగా నశింపక మాటుమణిగి యుండవలసివచ్చెను. నన్నయ భార

తమునందుకూడ సమాసములున్నను, అవియన్నియు జనసామాన్యమున వ్యవహారములోని పదములతో కూర్చినవేయగుట, లోకమునకు సుగ్రాహ్యములై యతిమాధుర్యమును సమకూర్చి, హృదయాకర్షములైనవి. చూడుడు. "కరుణించి యిందునాకుఁ, బురోహితునిగాగ మీసుపుత్రు పవిత్రున్, పరమ తపోనైష్ఠికు బా, నురియుమని యనూభిరాము సోమశ్రవసుఁ" యీ రీతులతో జనసామాన్యమునకు సుగ్రాహ్యములగు పద్ధతియే "ఇతరుల క్షరరమ్యత నాదరింప" అని సవిశేషముగా పేర్కొనెను. మరియు నిట్లున్నను, కవితాశక్తిఁగ ముండనిచో మహాకవులు నిరసింతురు. అప్పుడు గ్రంథమునకు విశిష్టగౌరవము చేకూరదు. కనుకనే "సారమతిఁ గవీంద్రులు ప్రసన్నకథా కవితార్థయుక్తిలో నారసిమేలు నాని తరులక్షర రమ్యత నాదరింప" "నానారుచిరార్థ సూక్తినిధి నన్నయభటు తెనుంగునన్ మహా, భారత సంహితారచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్" అనగా నిదివరలో నిరూపించినట్లు మహాకవిత్వ లక్షణమగు సకలరస సమర్పకత్వము "ప్రసన్నకథా కృతార్థయుక్తి" అనుటతో వ్యంగ్యమొనర్పబడినది. "సమర్పకత్వం శబ్దానాం యత్తు సర్వరసాకృతిః సప్రసాదో గుణో జ్ఞేయః సర్వసాధారణక్రియః" అనిగదా ప్రసాదస్వరూపము. అనగా ఆయా కథాసందర్భములందు ఆయా రసములుస్ఫురించునట్లు అర్థగతమగు ప్రసాదమను గుణమును,

"ఇతరు లక్షరరమ్యత నాదరింప" యనుటలో శబ్దగత ప్రసాదమును భాషామార్దవ సుగ్రాహ్యత్వములును, రీతి శయ్యాపాక విశేషములును, ఇందు కలుగునని వ్యక్తమొనర్చెను. ఇట్లు సకలజగత్తునకును హితముగా నీ భారతసంహిత రచితమైనది. అంతేకాని పండితులకొరకు

మాత్రిమిగాదు. అట్లేయగుచో "జగద్ధితంబుగని" అనుపదము నిరర్థకము గాదా? అదిపట్టి యీమాట యెందునూ కుదరదు. అపుడే వ్రాయబడి యీరాజునకే యంకితమీయబడిన పావులూరి మల్లన గణితశాస్త్రమునగూడ నిట్టిభాషయే వాడబడినది. గణితశాస్త్రము జనసామాన్యము నపేక్షించి వ్రాయబడినది. అందు పండితైక గ్రాహ్యమగు భాష వాడుదురా? అట్లువాడినచో రాష్ట్రక్షేమార్థ ముద్యోగించు ప్రభువరేణ్యుడు దానినాదరించునా? కావున నందు ప్రజాసామాన్యమునకు సుగ్రాహ్యమగు భాషయే వాడబడినదని యంగీకరింపవలెను. అట్టిభాషయేకల నన్నయభట్టారకుని గ్రంథమును తత్తుల్య యోగక్షేమమేకదా? మరియు మహాభారత సంహిత జగద్ధితమే కానిచో "తెనుగున రచియింపు యుక్తి మెయిన్" మని కృతిపతి జగద్ధితమును కల్పింపవలెనని అనగా జనసామాన్యమున కర్థముగాని యీగ్రంథమును జగద్ధితంబగుటను అంగీకరించునా? అపుడు పండితపరిషత్తు లున్నటుల నన్నయభట్టు ("సత్కావ్యభాంతర సరసీపవంబుల ముదంబలరగ గొనియాడి") పద్యములవల్ల తెలియవచ్చినదికదా! అవి దీనిని వెంటనే శాసింపవా? మరియు అన్నింటికన్న ప్రబలసాక్ష్యము ఈ గ్రంథము చిరకాలమునుండియు అనగా పదివందల సంవత్సరములనుండియు నిప్పటివరకు గూడా నిలచియుండుటయే యిది ప్రజాసామాన్యమునకు సుగ్రాహ్యము, రంజకమునని స్పష్టపరుచుచున్నది. అయితే యిప్పుడు లోకములో నందరు నాభారతము నర్థమొనరించుకొనగలరా అనినచో కొందరు లేకపోవచ్చును. కారణమేమనగా నన్నయభట్టునాటికి మనమిప్పుడున్నంత సంస్కృత భాషాదూరులమై యుండలేదు. ఇంతమేల ఏబదిసంవత్సర

ముల క్రిందటగూడ ఇప్పుడున్నంత దూరముగా మనము సంస్కృత భాష కుండలేదు. నన్నయభట్టునాడు అచ్చటచట ప్రాకృతభాషలు కొంచెము కొంచెము వాడబడుచుండెను. శాసనములేదుకు దృష్టాంతములు. సంస్కృతమునందు మిక్కిలిఆదర మప్పటికున్నది. తెలుగింత ఎక్కుడుగా ముదరలేదు. అందువలన అప్పటికి జనసామాన్యమున కర్థమగు భాషలో నన్నయభట్టారకుడు వ్రాసెననట పరమార్థము. అతర్వాత రెండువందల సంవత్సరముల నాటి కింకను తెలుగుమీరి దేశములో ప్రాకృతపువాడుక బాగా తగ్గిపోయియుండగా ప్రాకృతైక వ్యవహార్యమగు కన్నడాది మిశ్రితమగు తెనుగును శైవకవులును జానుతెనుగని స్వీకరించిరి. కాని దానిని వైదికులెవ్వరు అనగా శిష్టలోకమెక్కుడుగా నాదరింపలేదు. కాని "తెనుగు ముదిరిపోవుట" గాంచి అప్పటికి లోకసామాన్యమునకు సుగ్రాహమగు తెలుగులోనే తిక్కనార్యుడు-అనగా సంస్కృత మొకవంతుగాను తెలుగు మూడువంతులుగాను గల భాషలోనే తనభారతమును జనసామాన్యమునకు వినిపించెను. యిప్పటికి మనము స్వదేశ స్వభాషాదులందు ప్రీతిని విడనాడుటవలన మనకు భారతాది గ్రంథజాతము చదవ్వగా కష్టపడుచున్నది. కాని దత్తమండలములం దింకను నీభాషను గ్రహింపగలవారు చాలామంది యున్నారు. దానిని గ్రహింపలేకపోవుట మనలోపమేగాని, ప్రాచీనులు వారికాలమున లోకములో నలవాటులేని భాషలో వారిగ్రంథములు వ్రాయలేదు. ఇట్లు ఈ నిరూపణమువలన ఆంధ్రమహాభారతము శిష్టజనసామాన్యపు వ్యవహారమునందున్న భాషలో యిప్పటి యాంధ్రరాష్ట్ర ప్రజాక్షేమము నుద్దేశించి రచింపబడినదని స్పష్టము కాగలదు.

కాగా మరో భారతము నాంధ్రీకరించుటలో నపుడు "విశ్వ శ్రేయః కావ్యం" అను నుద్దేశమే ప్రవర్తకము. "రసవృత్తిః కాకే, నాన్యోహి రసోయథా తథంకవిభిః" అను ప్రయత్నమే అప్పటి తెనుగు విశ్వమునకు రసబంధురమగు నాంధ్రమహాభారతము రూపమున శ్రేయమైనది. అప్పటివారు మనవలెగాక "స్వస్థాన వేషభాషాభి మతా స్సంతో రసప్రలుబ్ధధియః! లోకే బహుమన్యంతే వైకృతకావ్యాని చాన్యదపహాయ" అను వాక్యానుసారముగ నుండిరి. అందువలన వెనుక నిరూపించిన మన సాహిత్యము (ఆద్యప్రాకృత, గైర్వాణీ, సంస్కృత నవ్య ప్రాకృతాంధ్ర భాషలలోనిది) అంతయు అలంకారశాస్త్రమున కనుగుణముగానే ప్రవర్తిల్లినది. ఇందువలనగూడ సంస్కృతములో నున్న యలంకారశాస్త్రము వచ్చినదిగూడా నని గ్రహింపవచ్చును. మనదే కానిచో దాని ననుసరించి వారేల గ్రంథనిర్మాణ మొనర్తురు? వారు మరియు నవి నియమములుపోగు కాదు. ఇట్టి భావములతోనే కొంతమంది దానిని సరిగా పరిశీలింపక నిరసించుచున్నారు. అది సలహాలరాశియే, దానిశాస్త్రీత యన నేమిటో యిదివరలో నిరూపించితిమి. ఆ విజ్ఞానమును మనవారెట్లుపయోగించుకొనిరో యిక పరిశీలింతము.

### అలంకారశాస్త్రమునకు విధాయకత్వములేదు

అయితే రసప్రధానముగానే బయలుదేరిన కవిత రానురాను చమత్కారమాత్ర ప్రధానమై యేర్పడినది. అందు వాస్తవిక కవితకు గూడ నవకాశమున్నది. అసలు రసము స్ఫురించుటెట్లు? మనముదాని నాస్వాదించుటెట్లు? ఈ విషయమును గట్టిగా విచారించినవారు భట్టనా

యకుడు, మహిమభట్టు, అభినవగుప్తపాదులు, జగన్నాథపండితుడు, వీరి విచారణలన్నియు నిట వివరింపబూనను. కాని చివరకు భట్టనాయకుని భావనా భోగీకృతుల స్థానమున వ్యంజనావృత్తి యాదేశింపబడినది. దీనిస్వరూపమిది. శబ్దము వాచ్యవృత్తిచే దెలుపు నర్థముకన్న సూచించునర్థము అపారముగానుండును. విదగ్ధులగువారు ముఖ్యమును చమత్కారమయము నగు నర్థమును నోటితో జెప్పనొల్లరు. అట్లూరకుండుటవలననే చమత్కారైకసారమగు నా ముఖ్యమైనయర్థము అనంతముగా విచిత్రముగా స్ఫురించును. ఇది లోకశాస్త్రానుభవ సిద్ధము. ఈ యర్థమునే పాశ్చాత్యుడగు కార్లైలు మహాశయుడును "If the speech be time the silence is eternity" అని నిరూపించెను. ఇప్పటికి వ్యంజనావృత్తివలన ననంత చమత్కారసారమగు రసాదికము స్ఫురించి యాస్వాదగోచరమగునని తేలినది. అట్టికావ్యమును రచించుటయే మహాకవికి పరమలక్ష్యము. అయితే కావ్యముయొక్క మంచి చెడ్డలను నిర్ణయించువారు సహృదయులు. ఏనితత్త్వమిది కావ్యమును వినుటవలన సహృదయునకుగల్గు ద్రుతి విస్తర వికాసాదులు కావ్యముయొక్క నుత్తమత నిర్ణయించునని యింకొకచోట విస్తరముగానిరూపించియుంటిమి. దాని పర్యవసన్నార్థమును తెల్పెదము. కావ్యము కల్గించు హృదయవికాసము సమగ్రమై హృదయమున చిరస్థాయిగా నెలకొనునో అది యుత్తమోత్తమము. చిరస్థాయి కాకున్నను హృదయమును వికాసింపజేయునది యుత్తమము. హృదయమును విస్తరింపజేయునది అనగా మడిమాత్రము విప్పునది మధ్యమము హృదయమునకు ద్రుతిమాత్ర

మును అనగా నుత్కంఠమాత్రము గల్పించునది అధమము. పైజెప్పిన ప్రకారముల నన్నింటిని నిరూపించునది అలంకారశాస్త్రము.

అయితే "రసప్రధానాశ్శబ్దార్థాః గుణాలంకారవృత్తయః, రీత యశ్చేయతీ శాస్త్రప్రమేయం కావ్యపద్ధతిః" అని విద్యానాథుడు గుణాలంకార వృత్తి రీత్యాది నిరూపణమే అలంకారశాస్త్ర ప్రమేయ మనుచున్నాడే! యనవచ్చును. వాని నిరూపణమంతయు నీశాస్త్రకృత్యమే. వాని నిరూపణమనగా నెట్లు? మమ్మట విద్యానాథులవలె కేటలాగు పద్ధతియా? కాదు. ఇక నేమి? పైజెప్పిన గుణాలంకార, వృత్తి రీతిశయ్యాపాకాదులు స్వాభావికముగా రసములకెట్లు అంగములగునో అనగా రసములకును గుణాదులకును ఎట్టి స్వాభావిక సంబంధమున్నదో అదియుండుటకు గారణమేమో? ఈసంబంధ మెప్పుడు స్వాభావికమై మరెపుడు అస్వాభావికమగునో ఈ గుణాదులవలన రసాదులు సాహజకమార్గమున (Natural path) వ్యంగ్యములగునో? రసములనగా నేమిటో? వానిస్వరూప స్వభావాదులెట్టివో? ఇవియన్నిటికి సరిగా విచారించి మనకుబోధించి యుత్తమోత్తమ కావ్యనిర్మాణమునకు వలయు సలహాల నొసంగునదే యలంకారశాస్త్రము. ఇట్టి తత్త్వనిరూపణమును బట్టియే వీనిని శాస్త్రములందురుగాని, వేదాదులకువలె విధాయకత్వమునుబట్టి గాదు. అది వానికిమాత్రమే! మిగిలినదేనికిగూడ, అనగా వ్యాకరణాదులకు వేనికిగూడ శాస్త్రత్వము విధాయకత్వరూప మగునదిలేదు. కనుక నీశాస్త్రమంతయు సలహాలరాశియేకాని నిర్బంధముల గుంపుగాదని తెలియవలెను. చూడుడు. ఆ శాస్త్రకారులే యెట్లు

చెప్పుచున్నారో! "ధ్వన్యాత్మభూతే శృంగారే సమీక్ష్య వినివేశితాః రూపకాది రలంకారవర్గ ఏతి యథార్థతాం। సంధిసంధ్యంగ ఘటనం రసాభివ్యక్త్యపేక్షయా, నతు కేవలయా శాస్త్రస్థితి సంపాదనేచ్ఛయా। రసభావాది తాత్పర్యమాశ్రిత్య వినివేశనం, అలంకృతీనాం సర్వాసామ లంకారత్వసాధనం। తమర్థమవలంబంతే యేంగినం తే గుణాస్మృతాః, అంగాశ్రితాస్త్వలంకారాః మంతవ్యాః కటకాదివత్।" ఇత్యాద్యానంద వర్ధనాచార్యుడు "ముఖమిష్టార్థ సంసిద్ధా కిం హీనస్యాత్కృతాత్మనాం" అని దండ్యాచార్యుడు. మరియు "న్యూనమ వ్యత్రి యైః కైశ్చిదంశైః కావ్యం న దుష్యతి, యద్యుపాత్తేషు సమ్పత్తి రారాధయతితద్విదః" అనియు స్పష్టముగానుడివెను.

ఇంటిలోని పూజ్యుల నెల్ల నేమరించి వెలుగుదీపిక నార్పితిమి లతాంగి ప్రణయరేఖయు నాశాకిరణమునంత కటికిచీకట్లపాలయి కానరావు.

ఈపోలికనే

మొగ్గగట్టిన తెలుకారు మోజునైచి రేకులెత్తిన మోహానుబుకువుగడిచి కుసుమపదశకయి యుత్కంఠ గొనినయోర్పు తుదిగృశించెడినిట్టూర్పు తో నెయిఃయల.

దీనిని నిరూపించి మధుకరముసకుగల్గు ప్రతిపద్మగతిని వ్యంగ్య మొనర్చుచున్నాడు.

"రాజా! జనులకెడబాటగు విధమున నడచుచు లోకనింద్యముల నుడుగుచు పరులకలిమి కులుకక, యందరితోడను బొందిపొసగి మనుట తగును. కొరవేశ్వరా! కోపమును, తుళ్ళుపాటును, గర్వమును, నోర్వ లేమియు, దురభిమానమును, నిర్వ్యాపారత్వమును, కాపురుషుల గుణ ములు" రాయబారము, మొహమ్మద ఖాసింఖాగా.

ఇంతవరకు నిరూపించిన దానినిబట్టి ఇది ప్రాదేశికశాస్త్రము కాదనియు సార్వత్రికమేననియు స్పష్టపడినది. సార్వత్రికమనగా అన్ని దేశములందును అన్ని కాలములందును అన్ని వాఙ్మయములందును కవులకౌచిత్య సంపన్నమగు రసాస్వాదమును సమకూర్చుటయే ప్రధాన కృత్యమనుటలోగాని, తదనుగుణముగానే మిగిలిన యంశముల సమకూర్చుకొనవలయు ననుటలోగాని, ప్రతిభాబలముననే యిట్టి యుత్తమ కవిత యేర్పడుననుటలోగాని, వ్యుత్పత్త్యభ్యాసములు కవికి ప్రతిభా కార్యమును సరిగా నిర్వహించుట కావశ్యకము లనుటలోగాని, యెట్టి విప్రతిపత్తియు నెవ్వరికిని కలుగజాలదుకదా!

### ఆంధ్రసాహిత్యము - దాని ప్రారంభదశ

ఆంధ్రసాహిత్యముయొక్క ప్రారంభ దశనుగురించి యిదివరలో గొంత నిరూపించితిమి. దీనికి చారిత్రికమగు ప్రారంభమిట వివక్షితము కాదు. అలంకార శాస్త్రానుగుణ్యమిట వివక్షితము. నన్నయభట్టారకునకుముందు వెన్నెలపదముల వగైరా ఏవేవో కొన్ని యున్నవన్నను అవియు సలబ్ధములుకాలేదు. శాసనపద్యములలో సాహిత్యములేదు. ఇక భట్టారకుని ఆంధ్రమహాభారతముతోనే మనము ప్రారంభింపవలెను. అప్పటికి దండిభామహుల (ప్రాచీనాలంకారికుల) అభిప్రాయమే సమాదృతమైనది.

"ఆదిరాజ యశోబింబమాదర్శం ప్రాప్యవాఙ్మయం, తేషామసన్నిధానేపి న స్వయం పశ్యనశ్యతి. ఇహశిష్టానుశిష్టానాం శిష్టానామపి సర్వవాచామేవ ప్రసాదేన లోకయాత్రాప్రసిధ్యతి. అతః ప్రజానాం వ్యుత్పత్తి మభిసంధాయ సూరయః వాచాం విచిత్రమార్గాణాం నిబ

బంధుః క్రియావిధిం। తైశ్శరీరంచ కావ్యానామలంకారాశ్చ దర్శితాః। శరీరంతావదిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ. గద్యంపద్యంచ మిశ్రంచతత్ త్రిధైవవ్యవస్థితం......గద్యపద్య మయీకాచిచ్చంపూరి త్యభిధీయతే"—దండి కావ్యాదర్శము.

ఇంచుమించుగా నిట్టి యాశయమే భట్టారకుని ప్రారంభమునను తిక్కనార్యుని విరాటపర్వాదియందును సూచితమైనది. కాగా "కావ్యము విశ్వశ్రేయస్కరమనియు నందుకై ధర్మాది పురుషార్థ సుస్థిరత సంపాద్యమనియు దద సూత్రితముగానే రసనిర్వాహణమును కవులాదరింపవలెననియు నందుకే "ప్రసన్నకథా కలితార్థయుక్తిః అక్షరరమ్యత" యావశ్యకమను గట్టియూహలు కల్గి వెనుకటి "విశ్వశ్రేయః" అను శ్లోకమును "సారమతిం" అనుపద్యము నేర్పడినవి. ఇది నన్నయ యొక్కని తలంపేగాక, "కవీంద్రులు, ఇతరులు" అనుటయు "సత్సభాంతర సరసీవనంబుల" అనుటయు వలన నాకాలపు కవిపండిత జనసామాన్యపు టూహలుగానే కన్పట్టును. అట్లు పైయందరి యాశయముల నాదరించి యేర్పడినది కనుకనే భట్టారకునికవిత "భువనోపజీవ్య" మైనది. "ఆ మూడుపర్వములలో నామాన్యుడును తెలుగులరసికొని కృతులొ దాము రచించిరి తిక్కనసద్ధీమణి మొదలైన తొంటి తెనుగు కవీంద్రుల్.—అప్పకవి.

శకుంతలోపాఖ్యానమును బరికింపుడు.

చ॥ నుతజలపూరితంబులగు నూతులు నూరిటికన్న సూనృత
వ్రత యొకబావిమేలు మరి బావులునూరిటికన్న నొక్క

సత్క్రతువది మేలు తత్క్రతుశతంబున కన్న సుతుండు మేలు
తత్సుత శతకంబుకన్న నొకసూనృత వాక్యము మేలు సూడగన్.

—సారాలంకారము.

చ॥ విమలయశోనిధీ పురుషవృత్త మెరుంగుచునుండు జూవె
వేదములును బంచభూతములు ధర్మువు సంధ్యలు నంతరాత్మయున్
యముడును జంద్రసూర్యులు నహంబును రాత్రియు నన్మహాపదా
ర్థములివి యుండఁగా నరుడు దక్కొనఁనేర్చునె తన్ను మ్రుచ్చిలన్.

—పరిపాదము.

క॥ సతియును గుణవతియు బ్రజావతియు ననువ్రతయునైన వనితనవజ్ఞా
న్వితదృష్టి జూచు నతిదుర్మతి కిహముం బరముగలదె మతిబరికింపన్.

—పరికరము

ఉ॥ కాదనకిట్టిపాటి యపకారము తక్షకుడే కవిప్రసం
బోధనజేసి చేసె నరపుంగవ! నీవు ననేక భూసురా
హూత సర్పయాగమున భస్మము సేయుము తక్షకాదికా
కోదరసంహతిన్ సంతతవహ్నోత్థ మహోగ్రశిఖాపయంబులన్.

—వ్యతిరేకము.

తిక్కనార్యుడును "కావున భారతామృతము కర్ణపుటంబుల నారగ్రోలి యాంధ్రావలి మోదముం బొరయునట్లుగ" నని నన్నయయయూహల కించుమించుగా సరిపోవునట్లు నుడికారపు సొంపుతో రచించెను. చూడుడు నన్నయయందు రసనిర్వహణ దృష్టియు కథాప్రగతియు గన్పట్టుచుండగా తిక్కనయందు మాటల అల్లికపొందికయు వర్ణనా రసికతయు నెక్కుడు కన్పట్టును.

మాటల యల్లికహొంరిక.

చ॥ పగ యడగించు టెంతయు శుభంబది లెస్సయడంగునే ఒగం
ఒగవగ గొన్నమార్గానక పల్కకయుండకవచ్చు టెట్లు దా
జగమెదలెత్తిపోవ పగడీర్పగ వచ్చిన గొర్యమొందు నే
మిగలి దలంచినన్ ఒగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా.

సమాన ప్రకరణమున నిరువురి కవితలయందుగల భేదమును గమనింతము.

సీ॥ పలుకులముద్దును గలికిశార్గిన్నుల తెలివును పలుద చన్నులబెడగు
నలఘుకాంచీపద స్థలను లరొయొన్నను లలితానసేంయ మండలమురుచియు
నళినీలకుటిల కుంతలముల కాంతియు నెలజవ్వనంబున విలసనమును
నలసభావంబున పొలుపును మెలపును గలుగు నగ్గిరి కన తలచితలచి.

—నన్నయ

సీ॥ నెత్తమ్మిరేకుల మెత్తదనముదెచ్చి యచ్చునకెట్టిన ట్లుండు మెండి
చకిరివాతంబుల చందరుబుగొనితెచ్చి కుప్పలుచేసిన ట్లొప్పుమేను
చందురుననుగాంతి కందెచ్చికూర్చి చాగునకుదెచ్చినయట్లు గొమరుమిగిలి
యళికులంబులకప్పు గలయంతయును బుచ్చి నాణోసినభంగి నవకమెక్కి
యుంఘ్రితలములు గుచములు నాననంబు గచభరంబును నిట్లున్న రుచిర

మూర్తి.—తిక్కన.

మొదటిపద్యములో స్వభావోక్తియు తదాలంబనకమగు రతియు నుండి అలంకారమయత్న సిద్ధమై భావమునలంకరించుననను నలంకార శాస్త్రిమర్యాద వ్యక్తమగును. రెండవపద్యమున వర్ణనావైదగ్ధ్యమును మాటలలో నించించుక బ్రియత్నమునసేర్పడు స్వభావోక్తియు నఖిలా

షకు తగినట్లు పెట్టిన నగలవలె నున్నవి. మొత్తముమీద నలంకారములు నన్నయ కప్రయత్నసిద్ధములై యొదుగుచుండగా తిక్కనార్యునకు ఈషత్ప్రయత్నసిద్ధములై యందగించుచున్నవి.

తిక్కన యలంకారరచన కొక్క యుదాహరణము.

రక్కసమూటలాడెదరు రాజును దమ్ములు వానిలోన నీ
వొక్కటియైన గాదనక యూకొనియుండుట యెంతకంటె మే
లక్కట యిట్లు వేడికొననైనను బోయెదవో సుయోధనుం
డెక్కడ భూమిలోన సగమిచ్చుట యెక్కడ దానవాంతకా!

— పరికరాంకురాలంకారము.

భావధ్వని తిక్కనయం దెక్కుడుగా బ్రవర్తిల్లినది. రసధ్వని భట్టారకునందు విస్తరిల్లినది. ఇట్లు వ్యంగ్యప్రధానము గానే కావ్యములు ప్రవర్తిల్లినవి. వాస్తవికత తొలగకుండ రసభావాదిసంధాన మొనర్చుటలో జక్కనిప్రయత్న మొనర్పబడినది.

సీ॥ వరుమాడ్కి ముద్దియ వదనంబుపై బాతి తిపుటమైనను గాంతి తీపుగోలు, సుందరీరత్నంబు చూపు మనోరము నడుగులయొప్పు పై సల్లనడరు, బతివిలోకనములు పడతుక నైదీవ గలయంగ బలుమరు మెలగుచుండు, వెలదికటాక్షముల్ విభునిపై గ్రమమున నెగసి మోమున జోకి మగిడివచ్చు.

తే॥ నొండురువుం లే చెమటలనూసి వేగుపడిన చాప్పున నవయౌవన భంగులందు, దగిలి మఱువున దడయు నిద్దఱ విశాలనయన దీప్తులు నెఱుకువ బయలుపడగ.

ఉత్తరాభిమన్యుల యభిలాష వ్యంగ్యము ఉత్ప్రేక్ష యంత వెగటుగల్గింపదు. స్వభావోక్తి చరణచతుష్టయమున నున్నది. తేటగీతి మూడుచరణములను అభిలాషానుభావములు హృదయభావ పొరుక వడజేయుచు నందముగానున్నవి.

రసప్రధానమగు కవిత్వము. శబ్దద్యోత్యము.

అంజూచున్ హరిజూచు జూచుకొను లందందంద మందారకేసరమాలా మకరందబిందు సలిలస్యందంబు లందంబులై దొరగంబయ్యెడ కొంగొంకింతతొలగం గోడ్త్రో శరాసారముల్ దరహాసామృతపూరమున్ గురియుచుం దన్వంగి హేలాగతిన్. —ఉత్తర హరివంశము.

అర్థద్యోత్యము.

మ॥ ఒనరన్ వేత్రలత కించుకేఁ యును లేకుండంగ గోపాలకృష్ణుని కెమ్మోవి సుధారసంబు గొనుచున్ జోద్యంబుగా మ్రోయుచున్ దనపద్యంబులు నేత్రపర్వములుగా దర్పించె బూర్వంబునన్ వనితా! యెట్టితపంబు జేసెనొకో! యీవంశంబు వంశంబులోన్. —భాగవతము.

శ్రీనాథుని కవిత్వమునందు అలంకారములు పర్యాయోక్తము ఉల్లేఖము మొదలగునవి వాస్తవికత నెక్కువ పీడకుండనే విలసిల్లును.

సీ॥ ధరియింపనేర్చిరి ధర్భపెట్టెడువ్రేళ్ళ లీలమాణిక్యాంగుళీయకములు
కల్పింపనేర్చిరి గంగమట్టియమీద గస్తూరికా పుండ్రకములునొసల
సవరింపనేర్చిరి జన్నిదంబులమ్రోల దారహారము ముత్యాలసరులు
చెర్పంగనేర్చిరి శిఖలనెన్నడుముల కమ్మని క్రొత్త చెంగల్వవిరుల
ధామముల వెండియును బైడిదడబడంగ బ్రాహ్మణోత్తము లగ్రహా
రములలోన, వేమభూపాలు డనుజన్ము వీరభద్రు, ధాత్రియేలింప
గౌతమీ ధాత్రియందు. మఱియు,

కవిరాజుకంఠంబు కౌగిలించెను గదా! పురవీధి నెదురెండ పొగడదండ ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబున దగిలియుండెను గదా! నిగళయుగము, వీరభద్రారెడ్డి విద్వాంసుముంజేత వియ్యమందెను గదా! వెదురుగొడియ, సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుకదా! నగరివాకిటనుండు నల్లగుండు, కృష్ణవేణమ్మ కొనిపోయె నింతఫలము, బిలబిలాక్షులు తినిపోయె తిలలుపెసలు, బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి, నెట్లుచెల్లింతు డంకంబుకేడునూర్లు.

వీనియందంతటను అలంకారములే స్వతంత్రములై చమత్కారము నొదవించును. కాని పోతరాజు కవిత్వమును గనుగొనుడు.

సీ॥ కోలాహలముమాని కొలువుడీ సురలార తలగిదీవింపుడీ తపసులార, ఫణులెత్తకుడు నిక్క పన్నగేంద్రములార ప్రీతులై చనుడి దిక్పాలులార, గానంబుసేయుడీ గంధర్వవరులార సందడిబడకుడి సాధ్యులార, ఆడుడీనృత్యంబు నప్సరోజనులార చేరిక మ్రొక్కుడీ సిద్ధులార,
శుద్ధ కర్పూరవాసిత సురభిమధుర భవ్యనూతనమైరే యపానజనిత,
సుఖవిలీనత నమరారి దొక్కినాడు శాంతిలేదంద్రు నిప్పలు జారులధిప.

మరియు,

సీ॥ కమనీయ భూమిభాగములు లేకున్నవే పడియుండుటకు దూది పరుపులేల?, సహజంబులౌ కరాంజలులు లేకున్నవే భోజనభాజన పుంజమేల?, వల్కలాజిన కుశావలులు లేకున్నవే కట్టుదుకూల సంఘంబులేల!, గొనకొనివసియింప గుహలులేకున్నవే ప్రాసాదసౌధాది పటలమేల?, ఫలరసాదుల గురియవే పాదపములు, స్వాదుజలములనుండ వేసకలనదులు, పొసగ బిచ్చంబువెట్టరే పుణ్యసతులు ధనమదాంధుల కొలువేల తాపసులకు.

ఈతని యలంకారములన్నియు రసప్రవాహమున లీనమగుచు. ఇదిచూడుడు.

మందారమకరంద మాధుర్యమునదేలు మధుపంబువోవునే మదన ములకు, నిర్మల మందాకినీ వీచికలదేలు రాయంచ జనునె తరంగిణులకు, పూర్ణేందు చంద్రికా స్ఫురితచకోరకం బరుగునే సాంద్రనీహారములకు, లలిత రసాలపల్లవ ఖాదియై చొక్కు- కోయిల సేరునే కుటజములకు. నంబుజోదర దివ్య పాదారవింద చింతనామృతపాన విశేషమత్త చిత్త మేరీతి నితరంబు సేరనేర్చు, వినుతగుణశీల మాటలు వేయునేల.

ఆస లలంకారములకు నిర్వ్యాజసిద్ధతయే రసమును వ్యక్తీకరించు టలో ముఖ్యప్రయోజకమని యాలంకారికుల మతము. అది నన్నయ పోతనలయందు బాగా కుదిరినది. ఇదివరలో రసభావధ్వనుల నుదా హరించి అలంకారముల సాహజకప్రతిభ వానినుపన్యసించుటను నిరూ పించితిమి. ఇక వస్త్వలంకారముల వ్యంగ్యమును కవిత్వమును బరిశీ లింతము.

మ॥ ధనదాంతః పురతారహారములు మాదః పాలబాలా ఘన, స్తన కాశ్మీరము ధర్మరాజతరుణీ సంవ్యాన కౌశేయముల్, దనుజేం ద్రారి కతావరోధ దయితాధమ్మిల్ల మాల్యంబులుల్, గినుకందెచ్చి ఘటింపజూచు జయలక్ష్మి నిత్య నైపథ్యమున్.—నాచన సోముడు.

మ॥ అతడంతంతకు వ్రాలి వాలుబలిమిన్ హాలాహలాహంక్రి యా,ద్భుతభంగిన్ వివిధాస్త్రధారలు సమిద్ధూమిన్ వెలార్చుల్ బ్రభా పతి తీవ్రద్యుతి నోదరారి రథినీపాదాతి కుంతంబులన్, బ్రతివీరప్రముదా కపోల ఫలక ప్రాంతాల కాంతంబులన్.—డిటో.

ఈ సందర్భములో నొకవిషయము చెప్పక తప్పకున్నది. పాపము చాలమంది నవీనులు శ్లేషయేదో వస్తుధ్వనియేదో గుఱుతింపజాలక ప్రాచీన మహాకవుల పద్యరత్నముల దప్పుల బట్టుచున్నారు.

మ॥ భరమై తోచు కుటుంబరక్షణకు రా బ్రాల్మాలి చింతన్నిరం
తర తాళీదళసంపుట ప్రకరకాంతారమ్మునం దర్థపుం జెరవాటున్ జెగ
గొట్టి తజ్జపరిషద్విజ్ఞాత చౌర్యక్రియా సరసుండై కొఱతంబడున్ గుకవి
పృథ్వీభృత్స మీపక్షితిన్. —అల్లసాని పెద్దన.

ఈపద్యమున కొఱుతయని యుండకున్న దోస మెుదవునని. కాని యది యవాలోచితము ప్రకృతస్థలము వ్యంగ్యస్థలము, శబ్దశ్లేష స్థలము కాదు. అట్లయిన గూడ దోషముగాకుండగా నిక వాస్తవమున కు వ్యంగ్యస్థలమగు నీచోట వారనుకొనినదోస మేమాత్రమును బొసగదు. వివరములకు నా "ఆంధ్రకావ్యాలంకార సూత్రవృత్తి" ని జూచునది.

అయితే ఆనందవర్ధనాచార్యులు వస్తుధ్వని శబ్దశక్తిమూలమున నంగీకరింపలేదుగదా యందురా? పొరబాటు. మూడవ యుద్ద్యోతములో "కుపోధవాకింనజడః కృతోహం" అనుచోట పదప్రకాశ్యమగు ధ్వనిలో "జడ" పదము కూపసామానాధికరణ్యము నొందునని వ్రాసియున్నాడుకదా! అది వస్తుధ్వనికాక మరేమి? మరి "ఆక్షిప్త ఏవాలంకారః" అనుకారికలో స్పష్టముగా కంఠోక్తిలో శబ్దశక్తి మూలకధ్వనిని వస్తువిషయమున నిషేధించియుండగా మీరు పైయుదాహరణను బట్టి "వస్తుధ్వని ఆనందవర్ధనాభిమతమే" నని యూహించుట సమంజసమా? యని యందురా? తృతీయోద్ద్యోతములో పదవదైకదేశ

వాక్యాదులచే వస్తుధ్వని స్పష్టనిరూపితమై యుండగా నతనికది యనభిమతమనుట యుక్తమా? యని మేమనుచున్నాము. అయితే "ఆక్షిప్త ఏవాలంకారః" యనుచోటి నిషేధమునకు భావమేమందురా? ఎచట వాక్యమున శ్లేష భాసించునో అట శబ్దశక్తిమూలక వస్తుధ్వనిని జెప్పజనదు. ఏమనగా నట నది వాచ్యశ్లేషకన్న వ్యతిరిక్తము. గాకుండుట వలన శ్లేషకన్న న్యూనచమత్కారమై యున్నది. ఏమనగా వస్తువుకన్న నలంకారమే యధిక చమత్కారకము కదా? ఈ విషయము రెండవ యుద్ద్యోతమననే నిరూపితమై యున్నది. "వాక్యవృత్తే స్తదాశ్రియాత్" అను స్థలమును బరికించుకొనుడు. కనుక పైజెప్పిన స్థలములందు వాచ్యశ్లేషయే కాని వస్తుధ్వనియనుట యుక్తము కాదు. ఇక పదైక నిరూపణీయ స్థలములలో ననగా నుభయార్థ ప్రతిపాదనక్షమమగు పదమాత్రమున వస్తువు వ్యంగ్యమగుట యుక్తమేనని యానందవర్ధనాచార్యుల తాత్పర్యము. ఈ విషయమును మూడవ యుద్ద్యోతములో మహాప్రఘట్టకమునందు "పదప్రకాశ శబ్దశక్తి మూలానురణన వ్యంగ్యేఽపి ధ్వనౌ విశేషణపదస్యోభయార్థ సంబంధయోగ్యస్య, యోజకం పదమంతరేణ యోజన మశాబ్దమ ప్యర్థావదవస్థితం" అను చోట మూలమును, వ్యాఖ్యలో "అభిధేయం తత్సామర్థ్యాక్షిప్తం చార్థరూపాలంకార మాత్రయోః" అనుచోట "అలంకార మాత్రయోః" అని వాచ్యమగునది గూడ అలంకారమగుననుటలోను కవి గుర్తించి తెలిసికొనవలెను. ఇట్లు శబ్దశక్తిమూలక వస్తుధ్వని ఆనందవర్ధనాచార్యుల మతమేనని సిద్ధము.

మరియు నీసాహిత్యమున సకలవిద్యలును సకలకళలును చేరగల వనియు, నవియన్నియు నీ సాహిత్యమున కంగములై దీనికి పుష్టికొందించు టేకాక, దీనిప్రయోజనమగు పురుషార్థోపదేశమునకు దోడ్పడి దీనికి చిరస్థాయిత గల్పించునని అలంకారశాస్త్రవు భాశయము. నిజమే యిది. సాహిత్యశబ్దపు వ్యుత్పత్తిని గమనించినను నిదియే తేలును. చూతుము. సంహితానాం=హితముతో గూడిన అనగా హితముపదేశించు, సంహితానాం=కూడిన అనగా నేకప్రయోజనాను సంధానముతో నీ కవితానందనమున చేరియున్నవానియొక్క, భావః=ధర్మము సాహిత్యమున వ్యుత్పత్తి ఏకపద బోధ్యములగువానికి పరస్పరాన్వయము మీమాంస నెఱింగినవారికి జెప్పనక్కరలేదు. "యజేత" యను చోట నొక యాఖ్యాతమునందే బోధింపబడు రెండు భావనలకును, "పశునా" అనుచోటగల పుంస్త్వైకత్వములకును పశువుతోను నన్వయము వారికి ప్రథమప్రత్యక్షమే. కనుక నిట్లు సకలకళలును సకలశాస్త్రములును తమతమ స్వస్థలములందు భిన్నభిన్న ప్రయోజనములకై వేరువేరు రూపములతో అనగా స్వసాధారణ రూపములతో నుండుగాక ఈ సాహిత్యమున గలియవచ్చినప్పుడు మాత్రము అవియన్నియు గలిసి యేకప్రయోజనమును,హితోపదేశరూపమును, రసాస్వాదనముద్వారా సమకూర్ప దలంపుతోనే యిటప్రవేశించును. అయితే యిటచేరునవి యిచటికనువగు వేషముతో జేరవలయునని గాని, తమతమఅసాధారణ రూపములతో గాదు. ఏదైన నొకసభలో ప్రవేశింపగోరువాడు తత్సభోచితమును, సర్వసభ్య సాధారణమునగు వేషమునే ధరింపవలయును గాని, అచటి సభ్యులందరికిని వ్యగ్రముగానుండు వేషమును, తనకసాధా

రణమైనను స్వీకరింపరాదు కదా! కనుక నట్లే యీ కవితాసభయందు జేరు ప్రతిదియు కళ కానిండు, శాస్త్రముకానిండు, మరేదైనకానిండు, ఇచటి కుచితమగువేషమునే ధరింపవలెను. ఇచటి కుచితమగు వేషమేది? ఈ కవితాప్రస్థానము-వ్యంజనా ప్రస్థానముగదా! అనగా యీ కవిత వైయంజనిక వేషమునే ధరించియుండునుగదా! కావున నిటజేరునవి యన్నియుగూడ నట్టి వైయంజనిక వేషమును తప్పక ధరింపవలెననుట. కాగా శాస్త్రములు, కళలు, లోకన్యాయములు ఇవి యవి యననేల సమస్తమును వ్యంజనా ప్రాధాన్యమను వేషమును ధరించి, సభ్యతను సంపాదించుకొనియే యిట బ్రవేశింపవలెను. ఇంకొక విషయమును గూడ విచారింపుడు. కవితయన నేమి? అదొక నందనోద్యానము వంటిది. ఇందు రసికులగువారెల్లరు విహరించి, దానివలన నానందము నొందకేని దానియుపయోగ మేమున్నది? కావున సకలశాస్త్రములును సకలకళలును ఈ నందనోద్యానమున దమ యిచ్చవచ్చినట్లు విహరించి, చూపరుల నానందింపజేసి, తమ జీవితముఁ గను, అందువలన నందనోద్యానపుశోభకును, స్థైర్యమును సంపాదించుట యవశ్య కర్తవ్యము. రసికులు పలువురు విహరించునపుడు చూపరులానందించుటయు, వారి విహరణమున నుద్యానపుశోభ యభివృద్ధి నొందుటయు. వారి విహరణ నిమిత్తమున నాయుద్యానము రోజురోజు నవనవ వైచిత్ర్యములతో చిరకాల మొసలారున ట్లుద్యాననిర్మాతలు ప్రయత్నించుటయు, నట్లు ద్యానము చిరకాల మొసలారుటయు, లోకానుభవ సిద్ధమేకదా! అట్టి తీరు నిట సమన్వయించుకొనుడు. సకలకళా శాస్త్రాదికమంతయు నిటు

విహరించుటవలన నీకవితకు శోభ యభివృద్ధి జెంది నవ నవ వైచిత్ర్యములు సమకూడుటయు, నందుకై కవి ప్రయత్నించుటయు నందువలన నీకవిత ఆచంద్ర తారార్కస్థాయియై వర్ధిల్లుటయు నిటగ్రాహ్యము.

అయితే నందనోద్యానమున విహరింప దలచువా రుద్యాన విహారమున కనువగు వేషముతోనే యటబ్రవేశింప నర్హులు కాని ఇంకొకతీరున గాదుకదా! మలీమసమగు వేసముతో నిట రసికులు ప్రవేశింపవత్తురా? వచ్చిన ప్రవేశింపనిత్తురా? అట్లు ప్రవేశించినచో రసికులు మెత్తురా? కవితోపవనమున నందరును వైయంజనిక నైపథ్యముననే బ్రవేశింతురు. ప్రవేశింపనెంతురు. అట్లయిననే యింతురు. అట్లుగానిచో నిరసింతురు. ఇట్లు సకలమునకును నిట ప్రవేశము వ్యంజనా నైపథ్యమున నభ్యర్థితమేనని సిద్ధమగు నాశయమును మన తెనుగుసాహిత్యమతిప్రీతితో సవిశేషముగా నాదరించినది.

అయితే యిట గొందఱు పండితంమన్యులకొక విప్రతిపత్తి అయినది. ఆదిభౌతిక, ఆధ్యాత్మికములు (ఫిజిక్సు, మెటఫిజిక్సు) అనురెండు రకములుగల శాస్త్రములలో గణితాదులగు మొదటివి కవితలో చేరజాలవు. ఇక రెండవవిగూడ శృంగారావలంబనా ప్రాణమేయనదగి రసికరంజనా ప్రవృత్తి చరితార్థమగు కవితయందు చేరుటకు వీలులేదు. ఏమనగా వ్యామోహ దర్శనమువలనగాని శృంగారాది సంపత్తి యేర్పడదు. ఇక నివియా యాధ్యాత్మికశాస్త్రములు వాద మోహ దర్శనమునకు ప్రత్యక్షవిరుద్ధమగు తత్త్వదర్శనము పైననే యాధారపడి విజృంభించునవి. కావున వీనికిని పైవానికిని పరస్పరము ప్రబలవిరోధము గదా! ఇవి యెట్లును కవితలో చేరజాలవు. శాంతాది సందర్భములందు

గూడ వాస్తవికత నాధారమొనర్చుకొనినచో రంజకతాప్రాణమగు కవిత యేర్పడజాలదు. వాస్తవికతను వీడుచో దదేకావలంబకమగు శాస్త్రాది సందర్భము నసిపడదు. తత్త్వవిజ్ఞానము పరిచింతనము మొదలగు వానివలనగదా శాస్త్రాదిసందర్భములు సమకూడునది? ఇందువలననే దశరూపకకారునివంటి కొందరు విద్వాంసులు అసలు శాస్త్రమే కాదనిరి. అనగా "కవితయందును దదాలంబనకమగు నాట్యమునందును శాస్త్రమునకు జోటులేదు." అని తాత్పర్యము. ఇది వారి వాద సారాంశము.

ఇదియంతయు నజ్ఞాన దుర్జ్ఞానముల విజృంభణము. ఏమనగా నిజముగా కవితామార్గమున జేరలేనియవి-కళలు, శాస్త్రములు, శిల్పములు, విద్యలు అన్నియుగూడ-స్వస్వరూపమునే గోలుపోవును. అనగా కళలు కళలుగావు, శాస్త్రములు శాస్త్రములుగావు, శిల్పముకాదు, విద్యయుకాదు ఏమి? వాని యన్నిటిప్రయోజనమేమి? సకలజన సామాన్యమునకును పురుషార్థసంధానము. శాస్తీతి-శాస్త్రం, కలయత్యనేక పురుషార్థానితికలా. శీలయత్యనేన వస్తుతత్త్వాదికమితిశిల్పం; వేత్త్యనయా పరతత్త్వమితి విద్యా అని వ్యుత్పత్తులు. మొదట శిల్పమున వస్తుతత్త్వమునెరుగును. అనగా నీమనుష్యుడిట్లుండును, ఈజంతు విట్లుండును, ఈ వస్తువిట్లుండును అని జ్ఞానముగల్గును. ఇపుడు మనము అజంతా, శార్ఙ్గి మొదలగు చోట్లగల చిత్రశిల్పమువలన మన ప్రాచీనుల స్వరూపస్వభావ వేషాలంకార ప్రవృత్తులను నగరవీధీ విపణి దశావిశేషములను గుర్తించుచుండుటలేదా? మన చిన్నపిల్లలకు బొమ్మలు మొదలగునవి యూకు

కొనుట కిచ్చుటలో నీతత్త్వమే యిమిడియున్నది. మొదట జ్ఞానమును దయించుట కాకారప్రదర్శనముకన్న మంచియుపాయము వేరులేదు. కావున శిల్పమును మనవారు అత్యావశ్యకముగా గణించిరి. ఇట్టిశిల్పము కవితామార్గమున జేరనిచో నది స్వస్వరూపమునే పోగొట్టుకొనును. ఎట్లనగా కవిత శిల్పమును చక్కగావ్యాఖ్యానించి, యందులోని పరమార్థమును సకల మానవజాతికిని విశదపరచునది. శిల్పమిందులో జేరదేని, దాని పరమార్థసాధనము భగ్నమైపోలేదా? దృష్టార్థమును గమనింపుడు. ఒకకవి శిల్పపరమార్థము నిట్లు నిరూపించుచున్నాడు. "ప్రకృతియందు రమ్యముకాని వస్తుతతిని చిత్రకళలు రమ్యముగ దీర్చెడినికాన; హ్లాద రమణీయ కల్పనా పాదనమున, అపనయింతు మలినజుగుప్సాదు లెవుడు"

అనగా వస్తుస్వరూపమాత్ర విజ్ఞానమే శిల్పచిత్రాదుల పని కాదు. ఇక నేమనిన ప్రతిసంస్కారముకూడ ఎట్లనగా వికృతమగు వస్తువుకూడ చిత్రశిల్పములందు రమ్యముగా దీర్పబడుట దాని పరమార్థము. అనగా నిందువలన ద్రష్టకు సమధికానందజనకము. తద్వారా ద్రష్ట తన రూపవేషాదులను ప్రతి సంస్కరించుకొనును. చిత్రశిల్పములందు లివి అత్యంత రమ్యములుగా దీర్పబడుట వాని పరమార్థమని కవిత వ్యాఖ్యానించుట నెరింగినతోడనే చిత్రశిల్ప ద్రష్టయగువాడు అట్టిరూప వేషాదిసాష్టవమే రమణీయమును, నాగరికమును, సభ్యతార్హమును, నని తలంచి దానిలోనిమాదిరిగా తనరూప వేషాదికమంతయు సరిచేసుకొనును. ఇది కొందరు వ్యక్తులకేకాదు. జాతియంతకును రూపవేషాదులకేకాదు; శిల్పనిరూపణీయములగు మిగిలినవిషయముల కన్నిటికికూడ

వర్తించును. కావున నిట్లు కవితాహారమున గ్రథితముగానిచో జైవ్రి యోజనము సమకూర్పజాలదు; కావున శిల్పము తనస్వరూపమునే కోల్పోవును.

ఇట్లే కళయనగా అభినయము గానము మొదలగునవి. అవి శిల్పమువలన ప్రాథమిక విజ్ఞానము (Elementary knowledge) కలిగినతరువాత నంతకన్న నెక్కుడువిజ్ఞానము నొదవించుటయేకాక, శిల్ప విజ్ఞానమునకుగూడ తోడ్పడును. ఇది పసిపిల్లల బాల్యమునందు ఎక్కుడుగా ననుభవములోనికి వచ్చును. ఈమె "యమ్మ" "తండ్రి" ఇత్యాదులను, రాకపోకలను, అన్నముతినుట మొదలగు కృత్యములను చేష్టల వలన, పసిబిడ్డలకపుడు తెలియజేయుదురు కదా! ఇట్లే పాటవలనగూడ వారి హృదయరంజన మొనర్చి, తమవివక్షితమును వారికి బోధించి వారుగ్రహించునట్లొనర్చుటయు, అనగా నన్నముదినకుండ నేడ్చెడు పనివానికి మొదట నేదో గొంత హృదయరంజకముగా పాడి, పిమ్మట "బువ్వదిను"మని చేష్టతో దెల్పి, బోధించి, అన్నము తినుపించుట అందఱియనుభవము లోనిదేకదా! దీనియందలి పరమార్థమును గవిత చక్కగా బోధించినచో నది జనసామాన్యము హృదయమునకు బాగుగా నెక్కి, విజ్ఞానాభివృద్ధికల్గించును. మరియు పాటను, అభినయమును ఎట్లు గ్రహింపవలెనో గూడ కవిత నిరూపించును.

అథవా! ఇంకొక విషయముకూడ మనము పరిగా బరిశీలింప వలసి యున్నది. ప్రతి కళయు శాస్త్రముమీదనే యాధారపడుననుట సహజముకదా! మరియు తదాధారముననే కల చిరస్థితి నొందగల్గుట

యు తత్త్వజ్ఞులకు విదితమే. శాస్త్రీము బహుకాలమునకు దరువాత తనకఠోర స్వరూపమునువీడి స్వారసికమును మృదులమునునగు స్వరూపమున మనకు బ్రత్యక్షమగును. అనగా శాస్త్రీము కళాస్వరూపములో జీర్ణమై కళయందలి మృదుస్వారసిక స్థిరరూపముతో మన కనుభవములోనికి వచ్చును. ఈ కవితయు కళయేకదా! అట్టిదగు దీనికి సకలకళా సామాన్యధర్మమగు శాస్త్రైకా లంబనముగాని తన్మూలక మగు స్థైర్యముగాని తనకళారూపములో జీర్ణించిన శాస్త్రీములరూపము తళుకులు మనకు స్ఫురింపజేయుటగాని తప్పకుండనివేకదా! మన యనుభవములోగూడ కవితాకళయం దిట్టివైచిత్ర్య స్థైర్యస్వరూపములు కన్పడుచున్నవేకదా! ఇక కవితలో శాస్త్రీములకు బ్రవేశము లేదనుట యెట్టిమాటయో గ్రహింపుడు.

దీని తరువాతశాస్త్రీము. అనగా న్యాయమీమాంసా జ్యోతిష గణిత శాస్త్రాదులు. ఇవి వస్తుతత్త్వముమీద నాధారపడి విమర్శల నొనరించి మనకు తత్త్వము నుపదేశించునవైనను అవి, వాని స్వస్వరూపముతో బోధించునపుడు మన హృదయములకు సరిగా నదుకక యుపదేశము శిథిలమై నశించిపోవును. అది కవితామార్గముల నత్యంత సరసముగా నివేదితము కాగానే మనహృదయము లామూల చూతముగా బరివ్యాప్తమై వీడక పునః పునః స్మృతి జాగరూకమై తత్త్వదృష్టిని విజృంభింపజేయును.

ఇక విద్య:- అనగా వేదాంతము. ఇదికూడ దానిస్వరూపభూమికలో మానవమాన్యము నాకర్షింపజాలక నేకొందరు ఛాందసుల

కూటముల్లోనో యజ్ఞాతవాస మొనర్చుచున్నది. ఇదియే కవితావ్యాపృత ముద్వారా ప్రతిపాదితమై సకలమానవ హృదయములందును, ఐహికాముష్మిక తత్త్వవిజ్ఞానమును అతిసులభముగా కల్పించి, వానిని ఆస్తికులనుగాను, ధర్మాత్మక పరాయణులనగాను నిర్వహించుచున్నది. ఈవిషయము మన దేశములో, జనసామాన్యములో మన పద్యములు, తత్త్వకందార్థములు మూగంటివారి పాటలు వగైరాలవలన నందరికిని అనుభవమగుచునే యున్నది. ఇట్లు కవితానుస్యూతము కానిచో బైవానికి వేనికిగూడ సకలమానవ సంతాన పరిగ్రాహ్యత కలుగక, వాని అసలు స్వరూపము వినష్టమైపోవుననుట స్పష్టమేకదా! ఇపుడాలోచింపుడు, పండితమ్మన్యుల వాదమెటువంటిదో? అయితే వీనికన్నిటికిని వైయంజనిక నైపథ్యములేనిదే కవితామార్గమున బ్రవేశము లేదనుట మరువరానిది సుమండీ! ఈ యభిప్రాయము నాంధ్రులెంతవర కామోదించి వారిసాహిత్యమున బ్రదర్శించిరో కనగొందము.

అయితే తత్త్వవ్యామోహ విజ్ఞానముల వైరుధ్యమను నాశంక యొకటి యున్నది. కవితామార్గమున వ్యామోహ ముండు ననుకొనుట తెలియమియే. వాస్తవమునం దెక్కుడుగా నాధారపడిన కవితయే యెక్కువగా లోకరంజక మగుట అనపహ్నవనీయము. దండ్యాచార్యుడు 'ఇచటనే కాన్తియేర్పడు' నని చెప్పుచున్నాడు. అసలు కవితకాలంబన మగు వస్తువు సౌందర్యము. ఇది "యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవవా, తత్తదేవావగచ్ఛత్వం మమ తేజోంశసంభవం" అను గీతోక్తి ననుసరించి యిది భగవంతుని యంశము. ఇది అతిమలీమసమైన యీ ప్రకృతియందు కవుల భావనాబలమున వారికి గోచరమ

గును. దానిఁ నాధార మొనర్చుకొని, అనగా దానినితరుల కాస్వాదమొన రించి, యాహ్లాదమును సమకూర్చుటకై వారు పరమాత్మని జగత్కళ యగు కవిత నాదరింతురు. అట్లు హ్లాదరామణీయకముల పాదెఱిగి, కవితానిర్మాణ మొనర్చినవారే మహాకవులు. మహాకవియు కాళిదాస నమస్కార వ్యాజమున నిట్లు సూచించుచున్నాడు. "సకలకళ్యాణ వసతియో ప్రకృతియందు। భావ భాషాభినయులైన ప్రజలయందు। హ్లాద రామణీయకముల పాదు లెరిగి। కావ్యరతుడైన ఘను నెంతు కాళిదాసు" ఇట్లు దీనిద్వారానే, అనగా భగవంతుని యంశమగు సౌందర్యమును కవితారూపమున నారాధింతురు; గనుకనే కవులకు ఇదియొక పరమాత్మ నర్చనము. కనుకనే యిది ప్రతీకోపాసన రూపమున సృష్టియందలి పరమాత్మ నారాధనమగును. సృష్టి భగవంతుని విభూతిరూపమగు నంశమేకదా! కనుకనే మహాకవి యిట్లు గానమొనర్చుచున్నాడు. "సృష్టియందె ఈశ్వరుని నర్చింతుకవులు, శ్రుతికి మూలంబగును మాతృ సుస్వరంబు కావ్యగీతులు ప్రియసాధకములు, ప్రాణికమవి నానంద మొకటె లక్ష్యంబయగును" వారు ప్రకృతియందు భగవదంశమగు సౌందర్యము నేకాగ్రచిత్తముతో వాగర్థరూపముల ఒక్కగా భావించుటయే తపస్సు. అదియే వాఙ్మయం తపః అనుట దానిని వాక్కులబైకి వ్యక్తపరుచుటయే వారికి నిత్యానుష్ఠేయమగుట వ్రతము. అందువలననే కవులు వాగ్వ్రతులనబడుదురు. మహాకవియు "జ్ఞానమో మోక్షమో తద్దైక్యంబో యగును నరుని సత్సాధనలకెల్ల పరమసిద్ధి వాగతీతంబనిరి దాని, వాగ్వ్రతులగు కవుల కదియెట్లు సిద్ధలక్ష్యముగనొప్పు" అని కవులను వాగ్వ్రతులని అందువలననే ప్రకృతివివిక్తమగు మోక్షము జగ

త్కారయగు వాక్కున కతీతమగునది వీరికి సిద్ధలక్ష్యము కాజాలదు. ఇకనేమి ప్రకృతి నాధారమొనర్చుకొని, తత్సౌందర్యోపాసనమే ప్రకృతీశోపాసనారూపమై పరమాత్మారాధన మగును. కనుకనే మొదట శ్రుతి రూపమున బ్రవర్తించిన వాక్కంతయు ప్రకృతిగత సౌందర్యోపాసనారూపము. అదియట్లు పరమాత్మోపాసనా రూపము గనుకనే మన ప్రాచీనతములగు మహర్షులు దానినాదరించిరి. మఱియు నసలుశబ్దము శ్రుతికి=వినపడుటకు లేదా చెవి వినెడుశక్తిని స్వీకరించునట్లొనర్చినది. మొట్టమొదట మాతృసుస్వరమే! అనగా మొదట శిశువుగా నుండునపుడు శ్రవణేంద్రియము తనశక్తి కృత్యము ను వినుటను గ్రహింపజేయునది తల్లియొక్క వాత్సల్య సౌందర్యపూరితమగు కంఠస్వరమే. ఆ స్వరమునందు వాత్సల్యసౌందర్యమే లేదేని శిశువు దానిని చెవియొగ్గి వినడు. అపుడు ప్రవృత్తి లేదేని వివిక్త స్థలములం దుంచబడిన శిశువులు మూగవారైనట్లు (ఎవరితోను మాటాడకుండ విడిగా మైసూరు దొన్మెటువారిచే నుంచబడిన శిశువులు కొందరు మూగవారై పోయిరని ప్రసిద్ధము) శిశువయస్సున శ్రవణేంద్రియము తనపనిని నేర్చుకొనదేని వారికిముందు పెద్దవారైనపుడుగూడ శ్రవణేంద్రియము వినుట నిదివరలో నేర్చుకొనలేదు; గనుక ఇకముందెన్నడును వినుటయే లేక చెవిటివాడే యయిపోవుట తప్పనిసరిగా తటస్థించును. గనుక మొదట శిశువు వినుట నభ్యసించుటకు మూలము తల్లియొక్క వాత్సల్య సౌందర్యపూరితమగు సుస్వరమే. మొదలు తల్లియేగనుక వాత్సల్య సౌందర్యము లేకుండ నతికఠోర తరముగ విరసముగ బసిపిల్లవానివద్ద మాటాడినచో నా స్వరమున శిశువునకు సౌందర్యములేనందున భీతికలుగక

యతనికి వినుకడి సరిగానలవడక బాధిర్యము సంభవించును. కనుక యీ కారణమువలన శైశవమునందుగూడ లోకప్రవృత్తి సౌందర్యగ్రహణ మూలకముగను, ఆనందాస్వాద ఫలకముగనే కన్పట్టును. ఇట్లు విచారింపగా ప్రాణిమాత్రమునకు అమలినానందమే ముఖ్యముగా లక్ష్యమేయగును అని తేలుచున్నది "ఇది సర్వకాల సర్వావస్థలయందును, సర్వప్రాణికోటికినిలక్ష్యమే; కాని యేయవస్థయందుగూడ,నెవ్వరుగూడ దీనినివీడజాలరు" అని. కనుక సకలప్రాణిపరమలక్ష్యమైనయమలినానందమును ననుకూర్చు కావ్యగీతులు ప్రియసాధకములు—నఖిల ప్రాణిమాత్రమునకు ఆనందహేతువగు ప్రియమును=సౌందర్యమును సాధించునవే యని పరమార్థము. కాగా యిట్లు కవితయంతయు సౌందర్యైకావలంబనకమై ప్రవర్తిల్లును. కావుననే కరుణ ప్రధానములగు నాట్యగీతులందు ప్రేక్షకులకు ప్రవృత్తి యుపపన్నమగును. లోకమునగల శోకము మనోవ్యథా దాయకమైనను దానిని సౌందర్యముతో నాస్వాదింపజేయు కవిత్వమువలన సౌందర్యగ్రహణముకల్గి, సహృదయులాస్వాదించి, యానందము నొందుదురు. గనుక కరుణ ప్రధానములగు రామాయణాదులందు సహృదయుల ప్రవృత్తి యవిచ్ఛిన్నముగాసాగుచున్నది. అచటికరుణము మనోవ్యథా దాయకమగు శోకము స్థాయిగా బ్రవృద్ధమగును; గనుక నశ్రుపాతాదులగు ననుభావము లచట సంభవించును. అయినను బరిణమున నానందమే యగును గావుననే యట నాబాలగోపాలము ప్రవర్తించుచున్నది. కాగా ఇందువలనగూడ కవిత కాలంబనము సౌందర్యమే. అది ప్రకృతిగతమగునదే ననుటలో

సామాజికమగు సౌందర్యమే కవిత కెక్కుడాలంబనమని స్పష్టము. ఎపటనైన లౌకికమగు సౌందర్యమును కవి స్వీకరించినను, అది సామాజిక వస్తుసంపర్కమునందే యాధారపడి, భావనాపరిలబ్ధప్రాణమై యుండునుగాని వేరేలేదు. కనుక కవిత తత్త్వవ్యామోహనమును కలిగించుననుట వట్టి యజ్ఞానము. ఇట్లు తాత్త్విక సౌందర్యము నాలంబనమునర్చుకొని, తత్త్వదర్శనమునకై పాటుబడు కవితలో తత్త్వదృష్టి నాధారముగాగొనిన శాంతమునకు అవకాశ మెట్లుండదు? ఇట్లే వాస్తవికత నాధారమొనర్చుకొను నభినయమునందును శాంతమునకు ప్రవేశము నిరాటంకమే. అభినయము చేష్టావిశేషమే కదా! లోకమున నేయర్థమున నేచేష్ట జేయుదురో, ఏభావమున నేముఖ నేత్రాదికములో సహజముగా నట్లుంచుదురో అదియే అట్లు అభినయించిననేగదా అర్థభావ వ్యంజనము సంభవించును. కనుక నభినయమును స్వాభావికత మీదనే సౌందర్యము నాధారపరచుకొని ప్రవర్తించుననుట నిర్వివాదము. ఇట్లు శాంతమునకు కావ్యాభినయములందు నిర్బాధకమగు ప్రవేశము లభించుచుండగా నది రసమెట్లుకాజాలదు? ఆస్వాదప్రాణత దీనికిని గలదని నిరూపితప్రాయమే కదా! ఇక శాంతశృంగారములకు విరోధము విషయములోగూడ నించించుక నుడివెదము. శృంగారమున కంగముగా శాంతము కుదరదుకాని శాంతమున కంగముగా శృంగారము బాగా అతుకును సకలప్రాణిమాత్రసుఖదాయకమును, అందువలననే ఎల్లరకును నభిలాషవిషయమును, సర్వదా అనుభూయమానమును నగు దీనినుపాయముగా నిరూపించుచో నన్నిరసములును సుఖాస్వాదములై మనలను పురుషార్థోన్ముఖుల నొనర్చును. ఈరీతి

ననుసరించియే ధ్వన్యాలోకములో "బోధ్యులగువారికి బోధపొంత రుచియొసంగునేనే గావ్యశోభ పొసంగునేని, కాని యంగమ్ములకును శృంగారమందు దద్విరుద్ధ రసస్పర్శ తప్పగాదు" అని రసవిరోధ విచారవ్యాజమున పైనొనర్చిన పూర్వపక్షమే సమావేశమైనది. మరియు నన్నిరసములకన్న మొదట శృంగారము పేర్కొనబడుటయు, నన్నింటికిని చివర శాంతమును పేర్కొనుటయు, ముఖ్యముగా బరిశీలింపవలసియున్నది. అభినవగుప్తపాదులు లోచనములో (౧ ఉ) మొదట స్వీకరింపబడు వాచ్యవాచక భావమునకే ప్రాధాన్యమేలకాదు? అనియు శంకించి, మొదటనుపాయమే స్వీకరింపబడుచుండుట లోకసిద్ధము కావున బై హేతువు (మొదట స్వీకరింపబడుట) ప్రాధాన్యసాధకము కాకపోగా విరుద్ధముగూడ (౧౩౪ పే) అని చెప్పినట్లు శృంగారమన్నింటికి మొదట చెప్పబడుటవలన నిది యన్నిరసములకును నుపాయము. అనగా మిగిలిన రసములన్నియు సుఖావబోధములగుటకు నిది సుప్రశస్తమగు నుపాయమని ద్యోతన మొనర్పబడినది. ఇట్లే మొదలి మొదలిరసములు తర్వాతిరసముల అవబోధమునకు-ఆస్వాదమున కుపాయములగుననియు గ్రాహ్యము. శాంతమును చివర నిర్దేశ్యమొనర్చుటవలన నన్నిరసములును శాంతాస్వాదమునందుపాయములు కాగలవనియు, నందును శృంగారసము పైనుడివిన స్వసాధారణధర్మము (సకలప్రీతిమాత్యాస్వాద్యతాది)వలన సకలరసములకును, శాంతమునకును గూడ ముఖ్యముగా నాస్వాదోపాయ మగుననియు ద్యోతితమగును. వ్యామోహతత్త్వ జిజ్ఞాసరూపతత్త్వముల విరోధము వస్తుస్వరూపమునందే గాని, సౌందర్యైకాలంబనకమగు కవితామార్గమునందు రాబోదు.

అనగా భోగవైరాగ్యములు వస్తుతః విరుద్ధములైనను ఈ రెంటియందు గల సౌందర్యము నాలంబనమొనర్చుకొని కవితామార్గములో విరోధము రాజాలదు. ఉభయత్ర సౌందర్యమేకదా కవి భావించునదియు, భావింపజేయునదియు, సౌందర్యములకు విరోధము లేదుకదా! చిత్తవృత్తి స్వభావము ననుసరించి, శృంగారచిత్తవృత్తి మొదటిదిని, శాంతచిత్తవృత్తి చివరిదియు, కావున చివరిదియగు శాంతచిత్తవృత్తి శృంగారచిత్తవృత్తి కుపాయము కాజాలకపోయినది. తాత మనుమని కుపాయము కాగలడు కాని, మనుమడు తాతకుపాయము కాజాలడుకదా! అదియేమనినచో నట స్వభావమేనని సమాధానము. అసలు రసములన్నియు "చిత్తవృత్తి ప్రసర ప్రసంఖ్యానములే" యని యభినవగుప్తుడు మూడవ యుద్యోతలోచనములో శాంతవిచారణ ప్రకరణమున నిరూపించియున్నాడు. కావున నిట్లు శాంతశృంగారములకు విరోధము ప్రసక్తింపకుండునట్టి మార్గము నిరూపితమైనది. ఇది యుదాహరణముల బోధపరతుము.

"గీ॥ రమణులు నిజమ్ముగా మనోరమలె, నిక్కమే సకలసంపదలును దామించుననుట, కాని మత్తాంగనాపాంగ మునుభంగి, బోలె లోలమ్మగద జంతువులకు బ్రదుకు" ఇది వ్యాసభగవానుని రీతి. ఇక మన యాంధ్రులరీతి గనుగొందము. అందుకు మొదలు రామలింగడై పిదప రామకృష్ణుడైన మహాకవి నుడి.

సీ॥ ఉర్వీధరములెక్క యురకనే కుచకుంభ యుగమొల్లగాక తానురుకుమనిన, వాడికైదువులపై వ్రాలనే నిడుచూపు వాలొల్లగాక తా వ్రాలుమనిన, మున్నీటనుడివడి మునుగనే నతనాభి గనవొల్లగాక తా

మునుగుమనిన, బెడగారు కాలాఫ్రి దొడుకనే నూగారు తొడుపొల్లగాక తా దొతుకుమనిన; చెప్పి గురుడేమిపంచిన చేయలేనికావె? తనసొమ్ము మామక కాయ కర్మగతులు, వొత్తోయనంగ లింగంబు గట్టుజంగమన యంగనలగూర్పు జనదుగాక.—పాండురంగ మహాత్మ్యము.

మరియు, "కందర్పాస్త్రము లంచు నంచిత తటిత్కాండంబు లంచుఁ సుధా, మందస్యందంబులంచు గాంచనలతా మత్తల్లులంచున్, సుధీ బృందంబుల్ ధ్వనినిందలందెగడు నీ బింబోష్ఠలం దెల్లనా నందా భాసమెకాక భాసిత చిదానందంబు పెంపొందునే" ఇక ఫిజిక్సు, గణిత, జ్యోతిషాదులు అంగములుగా జేరునా యనినచో

ఉ॥ కన్యకు నాల్గు కన్బొమలు కన్యకు నైదు పదాంబుజాతముల్
కన్యకు నాఱురోజములు కన్యకు నేడు విలోలనేత్రముల్
కన్యకు రెండుగానగుచు కన్యకు ద్వాదశమౌ వలగ్నమున్
కన్యకు నాకు నివ్వు పదిగావలెనంచు దలంపు గల్గెడున్.

(ప్రాచీనుల చాటుధార)

దీనికి సమాధానము నుడువుట కేవేల శ్రమపడవలెను. సరియగు నుదాహరణములే మహాకవుల ప్రతిభావిశేషముల నుగ్గడించును.

ఇందు గణిత జ్యోతిషములు గూర్పబడినవి. ఫిజిక్సు కవితలో చేరదనుట యెంత తెలివితక్కువో గమనింపుడు.

శా॥ ప్రాతఃకాలము వాయసంబు పణినాపత్యోక్త శాస్త్రంబులో
దాతజ్ స్థానలు సెప్పఁ జెప్పుమను చందంబొప్ప "గా-కా" యనన్
చాతుర్యంబలరార నుత్తరము విస్పష్టంబుగా గోకిల
వ్రాతంబిచ్చు "తుహీ, తుహీ" యని గృహారామ ప్రదేశంబులన్.

ఇందు వ్యాకరణము.

ఇత్తడు దరిద్రుడానుచు నేర్పడనర్థి లలాటపట్టికన్
శతధృతి వ్రాసినట్టి లిపిజాల మనర్థముగాని యట్లుగా
వితరణఖేలనా విభవ విభ్రమనిర్జితకల్ప భూరుహుం
డతడు దరిద్రతా గుణమునందు దరిద్రునిజేయు నాతనిన్.

నిఘంటుమర్యాద నిరుక్తమని పర్యవసానము.

కావున నిది నిర్వివాదముగా కవిత్వమే కాదనుకొనువాళ్ళు లెస్స తెలివితక్కువనే ప్రకటింతురు.

చ॥ కలకల నవ్వినట్లు, తెలికన్నుల నిక్కమచూచినట్లు, లో
బలుక గడంగినట్లు, కడుభావ గభీరతలబ్బినట్లు, పెం
పొలయదనర్చి, జీవకళ యుట్టిపడన్ శివవ్రాసినట్టి యా
చెలువున కాళినిత్యమ్యము భజింపదలంకెను దానుకోటియున్.

—శ్రీశాంతి శ్రీద్యుమ్నము.

ఇందు చిత్రకళా పరమార్థము వ్యక్తపరుపబడినది.

"తొల్తుధోల్తవ మ్యోత్కత్తురగంబు మండలగతిచారియాట నిక్కంబుతోచె
నా వెనుకను పరూపాక్షాళి చెదరక చక్రాకృతినిబర్వ సరణితోచె
నంతట ననతిస్ఫుటావయవంబుగా నిగిసి యే కాంగవేష్టనతతోచె
దుపదన్విభూషణద్యుతిరాజిమాత్రంబు కొఱవి త్రిప్పినరీతి నొలసితోచె
నంతకంతకు గతివేగ మగ్గలింప రాగవాగె దృష్ట్యప్రతి పరాకుతయ్యె
యను జనులు అచ్చపడి తమఃని మఱవగ, ఒఱగునమ్మోటినెలకొత్తు
పాత్రధికతన"

క॥ అరిది విలుకానియుజ్జ్వల శరమొక్కని జంపు తప్పి జనినంజను నే
ర్పరియైన వాని నీతిస్ఫురణము పరరాజునతెసి భూమింజెఱచుఁ.

ఇందు రాజనీతియు, శస్త్రవిద్యయు కూర్పబడినవి.

క॥ పరులేయవి యొనరించిన నరవర యప్రియము తనమనంబునకగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మ పథములకెల్లన్.

సకల ధర్మశాస్త్రసారమును ఇందెంత సరసముగా కూర్పబడె నదో చూడుడు.

ఇట్లనేక శాస్త్రములు కూర్పబడినవి. ఇక వైద్యము:

గీ॥ అతను తాపజ్వరంబుమై నలమియుండ, జవలలోచన ప్రియకథా సరసిదేలె, నాయపథ్యంబునసకదా యంతకంత, కలరుబోణికి సంతాప మతిశయిల్లె.

మ॥ మసువాలారు శరమ్ములఁ దొరగు కమ్మందేనెతోఁ గూడి య
య్యరవిందాక్షికి పక్షిపుంగవగవీ హైయంగవీనంబు ని
ష్ఠుర హర్షంబునొనర్చె మున్నరుచి సౌరభ్యంబులన్ బిమ్మటన్
మఱియందోలియుచు నించె నెమ్మనమునన్ మూర్ఛాసముచ్ఛ్రాయ
ముల్. —(శృంగారనైషధము.)

మొదట నిదానభాగమును, తర్వాత నౌషధశాస్త్రమును పరామృష్టములైనవి.

శస్త్రవైద్యము క్రింది పద్యములో నెట్లుజొన్పినాడో చూడుడు:

అంగవ్రాతములో జికిత్సకుడు దుష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్షసేయుక్రియ నీయజ్ఞం గులద్రోహి దు

స్సంగుం గేశవభక్తిపాతి నధముంజంపించి పీరవ్రితో
త్తుంగ ఖ్యాతి జరించెదన్ గులము నిర్దోషంబు గావించెదన్.

(భాగవతము)

ఇక పాకము విషయములో

క॥ మాకొలది జానపదులకు, నీకవనపు రీవియబ్బునే కూపనట
ద్భేకములకు గగనధునీ, శీకరముల చెమ్మనంది సింగయతిమ్మా.

ఇచట "గగన" పదమున శబ్దార్థపాకములు సరిగాలేవని "పాక" యని దిద్దబడినది. వివరములకు నేరచించిన "యాంధ్ర కావ్యాలంకార వృత్తి" ని జూచునది.

గుణములు చాలయున్నవి. కాని విస్తరభయమున అందులో నొక గుణమును మాత్రము చూపెదము. "వికటత్వ ముదారతి" యని వామనాచార్యుడు. పదములు అర్థములను స్వరూపముతోనే బోధింప గలుగునట్లుండుట. ఇందు పలుకులు నృత్యమొనరించుచున్నట్లు తోచును.
"అటజని కాంచె భూమిసురు డంబరచుంబిశిరస్సరిజ్ఝరీపటలము హుర్ముహుర్లుఠదభంగతరంగమృదంగనిస్వ:......" -(మనుచరిత్రము)

మరియు,

"చ॥ సకలశుభమ్ము లిమ్మగుచు సన్నుతులీగతి సేయ నాసిరం
తి కిడయదెల్ప బంచినగతిం జనుదెంచె నుదంచదూర్మికా
నికరవిలోలఖేలదళినీకలగానలసత్ప్రఫుల్ల
మల్లిక సుశ్వాసలికా విస్ఫూర్తి లాలన బాలసమీరమయ్యెడన్."

—విజయవిలాసము.

బాలసమీరపురాశిను ఈ లలితమగు కూరుపే వ్యక్తపరుప గల్గినది. గుణములవిస్తర మెరుగగోరువారు నా "ఆంధ్ర కావ్యాలంకార సూత్రవృత్తి" ని గమనించునది.

ఇక పద్యములందు గమకముతోడి నడక, లయానుబద్ధ సంగీతము. "సోయగంబున వీణవాయి ఎ మాయంపుజటిలుడప్పటికి నేమిటికివచ్చె" "సంజయ! మురభంజనుని ధనంజయునిం జేరికింగొనడు కర్ణుండు" "నరకాసురప్రాణనాళోత్తరణకేళి రణకేళి వలకేళి మురువుసూపె" "లలనాజనాపాంగ వలనావసదనంగ తుల నాభికాభంగదోః ప్రసంగము" ఇత్యాది.

అయితే గుణములలో కాంతియు, సమాధియు, ముఖ్యముగా చేకొనవలసి యున్నది. దీనికి కారణము ఈ నిరూపణమే వ్యక్తపరచును. ఆచార్యదండి యిట్లు లక్షించుచున్నాడు:

"కాంతం సర్వజగత్కాంతం లౌకికార్థానతిక్రమాత్ తచ్చ వార్తాభిధానేషు వర్ణనాస్వపిదృశ్యతే" "అన్యధర్మస్తతో౽న్యత్ర లోకసీమానురోధినా, సమ్యగాధీయతే యత్ర స సమాధి స్స్మృతో యథా, కుముదాని నిమీలంతి కమలాన్యున్మిషంతి చ, ఇతి నేత్రక్రియాధ్యాసాల్లబ్ధా తద్వాచినీశ్రుతిః, యుగపన్నైక ధర్మాణాం అధ్యాసశ్చ స్మృతో యథా"

"గురుగర్భభరక్లాన్తాః స్తనంత్యో మేఘపంక్తయః, అచలాధిత్యకోత్సంగం ఇమాస్సముధిశేరతే" 'తదేతత్కావ్యసర్వస్వం సమాధిర్నామ యోగుణః, కవిసార్థ స్సమగ్రో౽పి తమేన మనుగచ్ఛతి"

ఇందులో మొదటిగుణము భారత భాగవతములు మొదలగు ప్రాచీనకవితయం దెక్కుడుగా గన్పట్టును.

"తగునిది తగదని యెదలో, వగవేక సాధులకు బేదవారల కెగ్గుల్,
మొగిజరుపు నట్టివారల, కగుననిమిత్తాగమంబు లైనభయంబుల్"

శ్రీనాథునందును నిది యెక్కుడుగా గన్పట్టును. "కాశీకా" నవీనకవిత యందును, బహుతులగువారు దీనిని చాల సొంపుగా దిద్దితీర్చిరి.

"శ్రీకాకుళస్వామి సిగపై నుహాసించు తెల్లని ఆంధ్రుల మల్లెపూలు
ఒడ్డెరాజుల జీవగడ్డ గగ్గోకుడలంగ తోరాడెమత్తాంధ్ర కుంజరములు
చీకటిమన్నె ముల్ ఛేదించి నవధాన్యముల నెత్తె ఆంధ్రుల పోపుటెడ్లు
చిలుకసరస్సులో శృంగారనౌకల నడిపినాంధ్రుల యింటిపడుచు జతలు
ఉత్కళాశా నితంబమ్ము లొత్తుహత్తె, ఆంధ్రుల యశోదుకూల నీశాం
బరములు, తమ్ముడా! మాయనత్తువే తల్లివన్న?, చెల్లెలా! చిన్న బు
త్తువే! తల్లిచిన్న!"

భారతి నవీనగ్రంథముల నిట్లున్నది.

"వంశాటమునుండి కపిపు మొక్కలను దెచ్చి పెరటితోటలోన పెంచినారు
పచ్చిజవ్వాజి గోవానుండి రప్పించి దంతంపుభరిణెల దాచినారు
కొండవీటి గులాబిగుత్తుల అత్తరు కీలుబొత్తులలో బిగించినారు
అసలైన పారసీకాశ్వాల నలవాగ్ని విజయయాత్రల స్వారి వెడలినారు
సాంగజీవిత కళ్యాణ శాఖరీద, నిలిచి యానందదేవతన్ గొలిచినారు
తమ్ముడా! మాయనిత్తువే తల్లివన్నె? చెల్లెలా! చిన్న బుత్తువే తల్లిచిన్న?

ఇక రెండవదియగు సమాధి కావ్యసర్వస్వమని ప్రశంసింపబడిన యీ గుణము నవీనకవుల కవితయందంతటను అలముకొనియున్నది.

సమాధి

ఇక రెండవగుణమగు సమాధి నవీనకవిత్వమునం దంతటను నలముకొనియున్నది. ఇది కావ్యసర్వస్వమని దండ్యాచార్యులు ప్రశంసించిరి. దానినే అధునాతన మహాకవు లెక్కువగా నాదరించి తమకావ్యములు నిర్మించిరి.

"వలచిన ప్రాణవల్లభు డెవండయినన్ బ్రతిమాలవచ్చితో
నిలుపగరానికాంక్ష నవనీత దయాగుణశాలి నొక్కనిన్
బిలిచితో యౌవనమ్మునకు బింబఫలాధర! యర్ధరాత్రి వే
కల నిదురించు పీణ నిటులం గదలించితివేల గోలవై"

ఇదియొక ధర్మమునకే అధ్యాసము. నానాధర్మాధ్యాస మీ క్రింద గనుడు.

"నాగార్జునాద్రి కంఠముల గండూషించె కలుభాష్యబంధమై తెలుగుశిక్ష, ప్రాకృతాశ్రమ వాటికా కులమ్ములనాటి తీయమామిడి యంట్లు తెనుగుకవిత, బౌద్ధ ధర్మరహస్య భావముల్ పరమతాత్త్విక దృష్టి విడదీసె తెనుగుప్రతిభ, కొండలోయలలోన కోమల లావణ్యమలరార జతిగించె తెలుగుకుంచె, గంగతలనుండి కావేరి కాళ్ళదాక, వెలిగె దిజ్మోహనమ్ముగా తెలుగుకీవి, తమ్ముడా! మాయసత్తువే తల్లి పన్నె, చెల్లెలా! చిన్నబుత్తువే తల్లి చిన్నె.

"రవికిరణ రాగపులకిత రభసమైన,
లసదుషఃకన్య లజ్జావిలాసవశత,
జాఱు రక్తాంబరము మఱపారవిప్పి,
కప్పుకొనజూచెడిని నలంకారసరణి."

దీనిలో భావ మెగుడు దిగుడుగా నున్నది

"వెన్నెలలు నిదురవోయెడు వేళలయ్యె,
ఉదయ సామ్రాజ్య విభవముల్ వదలలేక,
మంచుల గుడారములతోడ మలగిపోవు,
తారకాసంతతులు కాలధర్మనియతి.
పరిమళమ్ములు పంతమాడగ,
పరువపుంజిగి పైకిపొంగే,
సరసకాముక శయనగృహముల,
చక్కబెట్టే తిలకమా!
సిగ్గువలదని చెక్కిలంటగ,
భగ్గుభగ్గను పచ్చివలపును,
బిగ్గనిలిపే పెండ్లికూతురు,
నిగ్గు నేలే తిలకమా!

ఇది ప్రాచీనకవితలో లేదనికాదు. అటగూడనున్నది.

"కరుణాలోకములం బటాంచలకరాకర్షంబులన్ మేఖలా
కరబాహుస్తనమర్దనంబుల నఖాంకవ్యాప్తులన్ నర్మవా
క్పరిరంభంబుల మంజులాధర సుధాపానంబులన్ గాంతలం
గరగించెం రతికేళికృష్ణుడు గృపం............"

"బండి గురువిందతీవె చప్పరములెనసి
ముడిగొనినదాక్షపందిళ్ళ నడుమ
గిన్నరీనినాదానుకారి శారికాది
ఘోష ఘుమఘుమితంబైన కోనగనియె."

కాని వారుదీని నెక్కువగా నాదరించినట్లు కన్పట్టదు. అనగా ననేక ధర్మాధ్యాస రూపములకు సమాధి వారియందెక్కువగా గన్పట్టదను. ఇది నవీనులందు బాగుగా విజృంభించినది. అయితే దీనిని వాడుటలో జాల తెలివితేటలుండవలెను, ఏయే ధర్మములు వాస్తవముగా సమములుగా నుండునో, వానిని భావించి, సరిగా మార్పవలెను. లేనిచో గడు యుపహాస్యము పాలగును. మరియు నీచెప్పిన రెండుగుణములును రసభావాదులు వ్యంగ్యములగునపుడే మంధగించునుగాని; అవి లేనపుడివి నిర్జీవములై రోతగించును. ఇట్టి యుదాహరణములు నవీనకవితలో చాలాయున్నవి. వాని ప్రదర్శింపజాలను. కాని ఈ గుణమునే యెరుగకుండ నవీనులు చాలమంది వాడుచున్నారు. ఇదియే కడమవానిని వీడి వీనిని నిరూపించుటకుగల కారణము.

మరియు సంస్కృతములో „యేనధ్వస్త మనోభవేన బలిజిత్కాయః పురా స్త్రీకృతః। యశ్చోద్వృత్త భుజంగహారవలయో గంగాం చయోదీధరత్, యస్యాహుః శశిమచ్ఛిరోహర ఇతి స్తుత్యం చ నామామరాః పాయాత్స స్వయమంధకక్షయ కర స్త్వాం సర్వదోమాధవః' అను నుభయశ్లేష యుండగా దానికన్న సరసముగా తెలుగులో "సకలవిశేష శోధనకు జాలిన యో నెఱజాణ! వజ్రినాభకుల వతంసరత్నమ! ప్రభావతి! రోహితకంటకంబు తావకమగు చూపు నాపయి బ్రవర్ధితరాగత బర్వె, గాన నత్యకలుషవృత్తి నాసుకృతమంతయు నేడుసుమీ ఫలించుటల్" అని ప్రభావతీ ప్రద్యుమ్నములో సూరన వ్రాసెను. ఇట్లే "దృష్ట్వైకేశవ గోపరాగహృతయా కించిన్న దృష్టం మయా,

తేనైవ స్ఖలితాస్మి నాథ! పతితాం కిం నామ నాలంబసే, ఏకస్త్వం విషమేషు ఖిన్నమనసాం సర్వాబలానాం గతిః, గోపైవం గదితస్సలేశవ ఘోష్ఠే హరిర్వశ్చిరం" అని సంస్కృతములో నున్నది. ఇక తెనుగులో నున్నదానిని గమనింపుడు :

ఉ॥ "ఈ మెయి గ్రొమ్మెఱుంగులు, పయింబయి మించు పయోధరంబులన్,
వేమఱు గట్టివాన కడువేగమె వచ్చు" నటంచు నొంచి తే
నీమది కింపుగాదిచట నిల్వ మటంచును బల్కి బోంట్లకున్;
గోమలి యోర్తతోడి యళికుంతలకున్ మఱుపెట్టి నేర్పునన్.

ఇట్లన్ని విధములగు నలంకారశాస్త్రపు మర్యాదలను, అందను విశిధములగు వైచిత్ర్యములను గూడ మన యాంధ్రసాహిత్యము వెద జల్లినది. ఈ వైచిత్ర్య మొక్కదానిని గమనింపుడు:

గీ॥ కొదమ గుబ్బలతాకి కుంకుమపుబూత, విభుడు చెంగావి రవికంచు విడువబోవ, గోసరచూపుల దక్కించుకొనుచు నొక్క, కలికి వెన్నెల పైటగా గప్పుకొనియె.

వ్యతిరేకాలంకారధ్వని (184-వ ఉ) ఉత్ప్రేక్షాలంకారధ్వని (189-వ ఉ)

ఇక మన సాహిత్యమునగల స్వాతంత్ర్యమును గురించి మాటా డదము. సంస్కృతములో గన్పట్టని కొండుకముల యలంకారము తెలుగులో గన్పట్టును.

"అల్పుంకు మ్రింగ జేదైన హాలహలము, భంగి బొంగెదు కోపంబు మ్రింగికొనగ, నీలగళునన్ని విన్నాన్న బోలుగాక, నిపనిలచినగాకేల సెగడు పేరు"

ఇందే యలంకారమో? మరియు

ఉ॥ చిత్తజుడల్లి చూపు మొనజేసిన శేయగినిమ్మ, పైధ్వజం
కెత్తిన నిత్తనిమ్మ, పచరించెద గర్గసమాటగిట్టగా,

నత్తరళాయతేక్షణకటాక్షవిలాసరసప్రవాహముల్
కుత్తుకబంటి తామరలకున్ దలమున్కలు గండుమీలకున్.

పూర్వార్ధమున ఈ యలంకార సంకర సౌందర్య మెటజూతము.

"పాల్కులు పికస్వనంబులవ పల్కులు చిల్కల గారవించు, గ
ద్కోయి చకోరపాళి దయతో బెరచున్, జనుదోయిమచ్చికల్
చేయు సదా రథాంగ యుగళీ, నడలంచల బుజ్జగించు నీ
నేలుడ నింప గావు గణియింప నవీన వయోవిలాసముల్."

రస సమ్మిశ్రణములో శృంగారమును శాంతాంగముగా సంస్కృతమున సవరింపబడియున్నది, కాని శాంతమును శృంగారాంగముగుటలోగాని, శాంతాంగములు శృంగారాంగము లగుటలో గాని, సరసముగా గూర్చ నేర్వలేదు సాంస్కృతికులు. అందువలననే వారు "సమగ్గే కీర్త్యేతుం ప్రభవతి గతం కాలహారిణః" అనునది విరసమని "శృంగారప్రసంగే శాంతకథా వైరస్యదాయినీ" యనిరి. (ధ్వన్యాలోకం) కాని తెలుగువారు మాత్రము చాల సరసముగా కుదిర్చినారు.

ఎలకోటల్వనముల్, పయోధరము ద్రిందరంబు లాకంపికిన్
ఫలముల్, వాతెఱలంగ జాగిమ కళాబంధంబు విచ్ఛాదనం
బులు, కోపంబున బాయుటల్, తపము కైవల్యంబు, సంభోగమం
దులయిచ్ఛారతి నుండుమానవుల కెందుం గానబూచిత్రముల్.

మఱియు కరుణములో ధృతి యను వ్యభిచారమును వ్యతిరేకముఖమున బోధకముగా వర్ణింపబడినది.

ఉ॥ ఎల్లరు నెల్లబో ధనములిచ్చి మృగాక్షుల గొందురిగాని యో
పల్లవపాణి! నే బరమపావన వంశము నిచ్చికొంటి, నీ
నల్లనిరూపు నిక్కమని నమ్మి, ధ్రువంబటుగాక యిట్లు వి
దళ్లలితి కాధికాభినయధూర్తహహాట నెఱుంగ నైతియున్.

మరియు సంభోగ శృంగారపు పర్యంతస్థితి వర్ణనయుక్తము కాదని వారనుటకుపపత్తి. యిది ప్రకటముగా వర్ణించుటలో దానికుండవలసిన గూఢత తొలగి, తత్కృత చమత్కారము పోవుననియు, నేవ్యాత గలుగుననియు, అయితే మనసాహిత్యమున నాదోషములు చేరకుండ, సంభోగమును వర్ణించి ప్రశస్తిగాంచిరి. ఉదాహరణము:

"పతిపాణిపల్లవ చ్యుతనీవిబంధన వ్యగ్రబాలాహస్త వనరుహంబు
ధవకృతాధరబింబ దశనక్షతివ్యథా భుగ్నలీలావతీ భ్రూలతంబు
భరణినాయక భుజాపరిరంభ మండలీగాఢ పీడిత వధూఘన కుచంబు
పరనఖాంకురగమ్మృదువ్యాపారపులకితనీరజాక్షీనితంబోరుయుగళి
అస్తి వామ్య బాధ మస్తి కోలాహలం బస్తి ఘర్మసలిల మస్తి కంప
మస్తి భీతి యస్తి హర్షమస్తి వ్యథంబస్తి వాంఛమయ్యె నపుడురతము."

నైషధము.

అట్లే "సహసా నఖాంకచస్త నదత్త పరిరంభ మామూల పరిచుంబితాధరోష్ఠ" వంటి పద్యములు.

విప్రలంభ కరుణములందు యమకము పృథక్ప్రయత్న నిర్వర్త్యము, కనుక వలదను సాంస్కృతికులసలహాల ద్రోసిపైచి పృథక్ప్రయత్న నిర్వర్త్యత యనుదోషము సేరకుండ యమకముల సంధ్రిలు కూర్చిరి.

కరుణమున

సీ॥ జనకునెమ్మనము వజ్రి ప్రియమాయెగా మాయగావించి,
యీమాడ్కి బనుప, డల్లిక వీనులెంతయు జల్లనాయెగా నాయగాధ
ప్రియాణంబు విన్న, దాది యుష్ణఖ్యాతి దలపలేదాయెగా దాయగా
బోలు చింతయు సహింప, నాళీజన శ్రేణి కాత్మనింపాయెగా బాయరా
రాని యీబారినొంద, వకట! నాయీమ రాచకన్నికలనెల్ల, గడగి

నన్నాడుకొన నోరుగల్గె; నేమనందు నికనెందు, జొత్తు నాహా! విధాత
వ్రాత యవిలంఘ్యమనియెంచు వడిదపించు. —శుకసప్తతి

విప్రలంభ శృంగారమున,

"సహకార! మత్ప్రియ సహకారు,బున్నాగ! పున్నాగు తిలక!భూభువన
చందన! బుధహరిచందను, పుష్పితాశోక! సుహృజ్జనశోకదమను [తిలకు
వకుళ! కులైకదీపకు, విభీతక! భయోపేతార్తిహరు నలుబ్రోతిత్రోడ
కానరే! గానలలోన లోకోత్తరునని మానిమానినికి నరిగియరిగి,
యడుగునడుగు రెండబాడవోడ బొక్కిన
నిర్ఝరాంతరముల నిలుచు, బొలుచు,
గిరుల, దరుల మెడల నురుగుహాగృహముల
దొంగి తొంగిచూచు తోయజాక్షి" నన్నయ.

ఇట్లే నిరంతరానుప్రాసమును గూర్పబడినది.

భావమునందు నవీనతకు పెక్కుదాహరణము లివ్వవచ్చును.

కల్పనలో నవీనతకు కళాపూర్ణోదయ ముదాహరణము. ఇట్టికల్పన మింతవఱకెటను నేనెఱుగను. ఇట్లు ఆంధ్రసాహిత్యమునందు నాకు దోచిన తెలుగుల మెఱుగుల విన్నవించితిని. ఈ నిరూపణమువలన నాంధ్రసాహిత్యమున నీసడించువారి మనసు లొకింతయైన దీనివిషయమై సుముఖము లగునేని నా శ్రమ కృతార్థమగును.



# అగస్త్య మహాకవి —

—— శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

'అగస్త్యశబ్దమును' ఉచ్చరింపగనే "వింధ్యాద్రి గర్వభంజనుఁడు, చులికీకృతసాగరుఁడు, లోపాముద్రాసహచరుఁడు" నగు అగస్త్యమహర్షియే జ్ఞప్తికి వచ్చుచుండును గాని, డెబ్బదినాలుగు సంస్కృతమహాగ్రంథములను రచించి, మన యాంధ్రదేశము మహోత్కృష్టస్థితియందుండిన కాలమునందు 'ఓరుగంటి' (ఓరుగల్లు లేక వరంగల్లు) సామ్రాట్టగు ద్వితీయ ప్రతాపరుద్రునికడ పండితుఁడును, సర్వాంగ మంత్రియు నగు 'అగస్త్యమహాకవి' జ్ఞప్తికిరాకుండుట విచారమును, విచిత్రపరిస్థితిని గల్గించును. కాని యీ యగస్త్యమహాకవియే విద్యానాథ మహాకవి. ప్రతాపరుద్రునికడ విద్యాంగమంత్రి (విద్యాశాఖాధికారి) యగుటచే 'విద్యానాథుఁడు' అను పేరుకలవాఁడయ్యె. ఇపుడాతఁడు 'ప్రతాపరుద్రీయము' అని పిల్వఁబడు 'ప్రతాపరుద్రయశోభూషణ' మను అలంకారశాస్త్రగ్రంథము పాఠకులకు సువిదితుఁడు. విద్యానాథుఁడు తాను ప్రతాపరుద్రీయమునందే "జాతోఽస్మ్యగస్త్యః" అని చెప్పినను, అయ్యది గుప్తముగా నుండుటచే దానిని కొన్ని శతాబ్దములవఱకు నెవరును గుర్తింపరైరి. విద్యానాథుఁడు తానగస్త్యుఁడనని యిట్లు ప్రతాపరుద్రీయమునందు కావ్యప్రకరణమునఁ జెప్పికొనుచున్నాఁడు.

శ్లో॥ ఔన్నత్యం యదివర్ణ్యతే శిఖరిణః క్షుద్రం తిరస్కృతాః।
గాంభీర్యం యదికీర్త్యతే జలధయః క్షుభ్యంతి గాధీకృతాః॥

తత్త్వాం వర్ణయితుం బిభేమి యది వా జాతోఽ స్మ్యగస్త్యఃస్థితః।
త్వత్పార్శ్వే గుణరత్నరోహణగిరే శ్రీవీరరుద్రప్రభో॥

కావ్యప్రకరణము 61 శ్లో.

తా॥ గుణరత్నములకు రోహణపర్వతమైన యో ప్రతాపరుద్ర ప్రభువా! నీయొక్క యౌన్నత్యమును వర్ణించునెడల పర్వతములు నీప ముగాఁ జేయఁబడి కోపగించును. నీగాంభీర్యము కీర్తింపఁబడునెడల సముద్రములు మెరకలై క్షోభించును. అందువల్ల నిన్ను వర్ణించుటకు భీతినొందుచున్నాను. అయినను నేను 'అగస్త్యుఁడనై నీపార్శ్వమునందే యుంటినిసుమా' అనగా ప్రతాపరుద్రుని యౌన్నత్యము పర్వతములను మించినదనియు, నాతని గాంభీర్యము సముద్రములకంటె లోతైనదనియు, అగస్త్యుఁడైన తా నాతనికడనే యుంటినని యు దాత్పర్యము.

ఇది కొందఱు విద్యానాథుఁ డగస్త్యుఁడనుటకు దగిన దృఢమగు నాధారము కాదనవచ్చును. విద్యానాథుఁ డగస్త్యుఁడే కానిచో నిశ్లోక మున "జాతోఽస్మ్యగస్త్యః" అని యుత్తమపురుషక్రియ నేలచెప్పెను? అగస్త్యుఁడను నొక మహాకవి 'ప్రతాపరుద్రు' కడనుండినయెడల నా యగస్త్యునే యిటసూచించ నన్నచో, అపుడు "జాతోఽస్త్యగస్త్యః" అని ప్రథమపురుషైక వచనమునే చెప్పును. ఇట నట్లుచెప్పక 'జాతోఽ స్మ్యగస్త్యః" అనుటచే విద్యానాథుఁడే 'అగస్త్యమహాకవి' అని నా దృఢాభిప్రాయము.

పూర్వకాలమున మహాకవులు, పండితులే విద్యాశాఖా మంత్రు లుగా, ప్రభువులకడ నుండువారు. ప్రసిద్ధికెక్కిన శ్రీనాథమహాకవి 'కొండవీటి' ప్రభువగు కోమటి వేమారెడ్డికడ (క్రీ. శ. 1400-1420)

సం॥) విద్యాంగమంత్రిగా నుండినట్లు శ్రీనాథుడే యొక శాసనమున వ్రాసియున్నాడు. అట్లే యీ యగస్త్యుఁడును ప్రతాపరుద్రునికడ విద్యాశాఖాధికారి యగుటచే 'విద్యానథు' డయ్యెను.

ఈ యగస్త్యమహాకవియే 'విద్యానాథ' మహాకవియని యిరువదేండ్లనాడు నేనూహించి 'రెడ్డిరాణి పత్రిక' లో వ్రాయు కాలముననే మహాపరిశోధకులు పండితులు నగు బ్ర. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు 'ముక్త్యాల' (కృష్ణాజిల్లా) లో ప్రకటింపఁబడు 'సరస్వతీపత్రిక' లో సనిదర్శకముగా నొకవ్యాసము ను వ్రాసినట్లును, ఆంగ్లమున సంస్కృత వాఙ్మయచరిత్రము వ్రాసిన శ్రీమాన్ డాక్టర్ మాడభూషి కృష్ణమాచార్యులుగారు తమ వాఙ్మయచరిత్రలో 'అగస్త్యుఁడే, విద్యానాథుఁ' డని వ్రాసినట్లును, మా మువ్వుర యభిప్రాయము నొక్కటే యనియు, అగస్త్యుని బాలభారతము నాంధ్రీకరించిన శ్రీ కొత్తపల్లి సూర్యారావు గారి గ్రంథమునకు పీఠికను వ్రాసిన శ్రీమాన్ ఈయుంగి వీరరఘువాచార్యులు ఎం. ఏ. గారు తమపీఠికలో విశదీకరించిరి.

ప్రభాకరశాస్త్రిగారియొక్క వ్యాసముగాని, కృష్ణమాచార్యులవారి గ్రంథముగాని నాకు లభింపలేదు. కాన నాస్వంతమగు నభిప్రాయమునే వ్రాసితిని. అగస్త్యుఁడు డెబ్బదినాలుగు గ్రంథములను రచించెనని దాక్షిణాత్య కవయిత్రిమతల్లియగు "గంగాదేవి" యీ క్రింది రీతిఁ జెప్పియున్నది.

శ్లో॥ చతుస్సప్తతికావ్యోక్తివ్యక్తవైదుష్యసంపదే
అగస్త్యాయ జగత్యస్మిన్ స్పృహయేత్కో న కోవిదః॥

వీరకంపరాయ చరిత్రాపరనామక మధురావిజయం — స. 1-18.

ఈమె క్రీ. శ. 1367 సం॥ర ప్రాంతమున కాంచీపురినేలిన 'కంప రాయునకు' రాణియై యుండెను. ఈమె 'అగస్త్యమహాకవి' కి మేనల్లుడును, 'సౌగంధికాపహారణ' మను సంస్కృత నాటకమును రచించిన వాఁడును ద్వితీయ ప్రతాపరుద్రుని కాశ్రితుఁడునగు 'విశ్వనాథ మహాకవి' కి శిష్యురాలనని, తన 'మధురావిజయ' కావ్యమున నిట్లు చెప్పియున్నది :

శ్లో॥ చిరం స విజయీ భూయాత్, విశ్వనాథకవీశ్వరః
యస్యప్రసాదా త్సార్వజ్ఞ్యం సమిన్ధే మాదృశేష్వపి॥
మధురావిజయము—సర్గ 1-16.

ఈ విశ్వనాథకవి 'అగస్త్యుని' మేనల్లుఁడనని తన 'సౌగంధికాపహారణ' నాటకమున నిట్లు వ్రాసికొనియున్నాఁడు.

శ్లో॥ వాచస్తస్య కవేరుదారమధురా ఇత్యత్ర చిత్రం కిము
ప్రఖ్యాత స్సకలాసు రీతిషు గుణీష్వశ్రేయా ౽గస్త్యసుధీః।
వేధశ్చంద్రముఖీ కరాబ్జలిదళాసంజ్ఞకస్వాణద్వల్లకీ।
వాచోయుక్తి సహోక్తి దర్శితసుధాజన్మా స యన్మాతులః॥

ఈ విశ్వనాథకవి సాధారణుఁడు కాఁడు. "సాహిత్యదర్పణము" అను నలంకారశాస్త్ర గ్రంథమును రచించిన "విశ్వనాథ కవిరాజు" (క్రీ. శ( 1384) అను మహాపండితునిచే దన గ్రంథమున స్మరింపఁబడి యున్నాఁడు. ఈతఁడు ప్రతాపరుద్రు నాస్థానమున నుండినట్లీతని "సౌగంధికాపహరణ" నాటక ప్రస్తావనలో నిట్లు వ్రాయఁబడెను.

సూత్రధారః అద్యఖలు నిఖిలరాజలోక మౌళిమాణిక్య మంజరీ పుంజ కింజల్కిత చరణారవిందేన.........రాజ్ఞా 'ప్రతాపరుద్రేణ'

సంభావితైరశేషవిద్యావిశేషసారసార్వజ్ఞధౌరేయమతిభిః సభాసర్భిరాహూయ సబహుమాన మాదిష్టోస్మి.

కాన క్రీ. శ. 1294-1323 సం॥రముల వఱకు నోరుగంటి నేలిన ప్రతాపరుద్రునికడ 'విశ్వనాథ' కవియుండుట నిశ్చయము. ఆతని మేనమామయగు 'అగస్త్య' మహాకవి 'విద్యానాథుఁడై' (విద్యాశాఖా మంత్రియై) తన్నామముతోఁ బ్రతాపరుద్రునికడ నుండెననుటలో విరుద్ధమేమి కలదు? కాన సర్వవిధముల 'అగస్త్యుఁడే' విద్యానాథుఁడని నేను దృఢముగాఁ జెప్పఁగల్గితిని. విద్యానాథునికాలమున యువకుఁడుగా నుండిన యాతని మేనల్లుఁడగు విశ్వనాథకవి, ఓరుగల్లు రాజ్యమును మహమ్మదీయులాక్రమించిన పిమ్మట "కాంచీపురి" కేఁగి, యట రాజ్యమేలు కంపరాయుని యాస్థానమునఁ బండితుడై, యాతని రాణికి గురువైనట్లు కాన్పించుచున్నది. దీనినట్లుంచి యగస్త్యునిగూర్చి విచారింతము. ఈతని గ్రంథములు డెబ్బదినాల్గింటిలో నీక్రింది గ్రంథములు మాత్రము కాన్పించుచున్నవి.

* 1. ప్రతాపరుద్రీయము.

2. బాలభారతము (వ్యాఖ్యతో దీనివ్రాఁతప్రతి మద్రాస్ ఓరియంటల్ లైబ్రరీలోఁ గలదు.)

---

* జగద్విఖ్యాతిగల యీ యలంకార శాస్త్రగ్రంథము ప్రసిద్ధికెక్కిన 'మహామహోపాధ్యాయ కోలాచల మల్లినాథసూరి' పుత్రుఁడగు 'కుమారస్వామి సోమయాజి' యొక్క 'రత్నాపణ' వ్యాఖ్యతో బెక్కుసారులు ముద్రితమై యాంధ్రదేశమునఁ బ్రచారమున నున్నది.

♦ 3. నలకీర్తి కౌముది.

—♦ ఈ క్రిందిగ్రంథముల నామములు వినఁబడుచున్నవి. ♦—

1. శ్రీకృష్ణ చరితము (గద్యకావ్యము)
2. లక్ష్మీస్తోత్రము.
3. లలితా సహస్రనామము.
4. శివస్తవము.
5. శివసంహిత.

---

♦ ఇరువది సర్గలుగల యీ మహాకావ్యమునకు విజయనగర సామ్రాట్టగు శ్రీ కృష్ణదేవరాయల మంత్రి సాళువతిమ్మనామాత్యుఁడు 'మనోహర' మను వ్యాఖ్యను రచించెను. ఆ వ్యాఖ్యానగద్య యిట్లు గలదు. "ఇతి శ్రీమద్రాజరాజేశ్వరకర్ణాటేశ్వరశ్రీకృష్ణరాయ శిరఃప్రధానసకలాగమపారావారపారీణసాళ్వ తిమ్మయ దండనాథ విరచితాయాం, బాలభారతవ్యాఖ్యాయాం మనోహరాఖ్యాయాం.-సర్గ. 1

ఈ బాల భారతమును విపులమగు టీకతో ఆంధ్రసాహిత్య పరిషత్తునకు మేనేజరైన, కీ. శే. కొత్తపల్లి సూర్యారావుగారు గద్యగా వాంధ్రీకరించిరి.

(3) 'నలకీర్తి కౌముది' లోని 2, 4 సర్గలుమాత్రము నాకు పిఠాపురమునందలి యొక శిథిలగృహమున పడినగోడలక్రింద మఱికొన్ని తాళపత్ర గ్రంథములతో లభించినది. అది ఆం. సా. ప. పత్రికలో 1930 సం"పు మునఁ బ్రకటించితిని. దానివిశేషములు ముందువ్రాయఁబడును.

6. సకలాధికారము.

7. మణిపరీక్ష.

8. అగస్త్య నిఘంటువు.

నాకులభించిన 'నలకీర్తి కౌముది' లోని 2, 4 సర్గల యంత్యగద్య లో నిట్లుకలదు.

ఇతి శ్రీ నలకీర్తి కౌముద్యాఖ్యే లక్ష్మీపదలాంఛనే అగస్త్యకృతౌ మహాకావ్యే ద్వితీయస్సర్గః

ఈ మహాకవి భారవి మహాకవివలె 'లక్ష్మీ' పదమును సర్గాంత్య శ్లోకములలోఁ గూర్చుచుండును. అందుచేఁ దనకావ్యము 'లక్ష్మీపద లాంఛన' మనినాఁడు. 'మాఘుఁడు, శ్రీహర్షుఁడు' కూడ తమకావ్యము లను వేర్వేఱు లాంఛనములఁగూర్చిరి. ఆరీతినే యగస్త్యమహాకవియుఁ జేసియున్నాఁడు. అగస్త్యుని కవితామాధుర్యము అమృతలహరివం టిది. ఈతఁడు పెక్కుస్థలములలో కాళిదాస మహాకవియొక్క రఘు వంశ, కుమారసంభవ కావ్యముల ననుకరించియున్నాఁడు. చూడుఁడు:

---

అదృష్ట గ్రంథాంశములు.

(8) లలితా సహస్రనామములు—లోకమున దుర్గాదేవీ పూ జఁజేయుట కీ లలితా సహస్రనామములచే చెప్పెదరో, అవి యన్యము లో పరిశోధింపవలెను.

(7) మణిపరీక్ష—దీనినుండి మల్లినాథుఁడు కిరాతార్జునీయ వ్యాఖ్యలో నుదాహరణములఁ జూపియున్నాఁడు.

శ్లో॥ అవాకిరన్ వయోవృద్ధా స్తం లాజైః పౌరయోషితః।
వృషతైర్మందరోద్ధూతైః, క్షీరోర్మయ ఇవాచ్యుతం॥
రఘువంశ. 4 స.

శ్లో॥ పౌరాః పురంధ్ర్యోఽథ నలం సలాజై। రవాకిరన్ హార్మ్యగతాః ప్రసూనైః॥ బిందూత్కరై ర్విష్ణు మివోర్మయోఽద్రి। మంథానసం క్షోభితదుగ్ధసింధోః॥
నలకీర్తి కౌముది. 4 స.

ఇట్టివి పెక్కులుగలవు. కాళిదాసు అజమహారాజు, శివుడు పెండ్లికిఁ బోవునపుడు 'పురసుందరీమణుల' చేష్టితముల నింపుగ వర్ణించి యున్నాఁడు. ఆతనికంటెఁ బూర్వుఁడుగాదలంపఁబడు 'అశ్వఘోషుఁడు' తన బుద్ధచరితమున వర్ణన చేసినాఁడట. కాళిదాసు యనంతరము బుద్ధఘోషుఁడు తన 'పద్యచూడామణి' మహాకావ్యమునఁ గాళిదాసుననుకరించే కపిలవస్తు పురసుందరీ చేష్టితములను వర్ణించియున్నాఁడు. శివరహస్యఖండమున పార్వతీవివాహమునకుఁ దఱలిపోవు నీశ్వరుని జూడ నేతెంచు పురసుందరీ వర్ణనములు బహుళమై, అశ్లీల భూయిష్ఠములై యొప్పుచున్నవి. అట్లుగాక, మన యగస్త్యమహాకవి కాళిదాసు ననుకరించి, యింపుగ, నలుఁడు దమయంతితో స్వమందిరమున ప్రవేశించు సందర్భమును వర్ణించియున్నాఁడు. ముచ్చటగనుండు మూఁడు మూఁడు శ్లోకాలను మచ్చుకై వ్రాయుచున్నాను.

శ్లో॥ ఆలోకమార్గం సహసా వ్రజంత్యా। కయాచి దుద్వేష్ట నవాంత మాల్యః। బంధం న సంభావిత ఏవ తావత్కరేణ రుద్ధాపి చ కేశపాశం॥
రఘువంశ. 7 స.

శ్లో॥ పథి వ్రజన్త్యా త్వరయా కయాచిత్ । స్గలిత్ప్రసంపాశ్లథకేశపాశః।
అగ్రాహి తద్దర్శనజోత్క యాద్రాగ్బద్ధుం కృతానాదరయాకరేణ॥

శ్లో॥ ప్రసాధికాలంబితమగ్రపాద మాక్షిప్యకాచిద్ద్రవరాగమేవ
ఉత్సృష్టలీలాగతిరాగవాక్షా దలక్తకాంకాం పదవీం తతాన॥

రఘువంశము.

శ్లో॥ ప్రసాధికామప్రతిపాల్య కాచిత్ । పాటీరపంకాంకితపాదపద్మా।
జతుద్రవేణా రచితాంగరాగా వినిర్యయౌ సంభ్రమ లోంబుజాక్షీ॥

నలకీర్తికౌముది.

శ్లో॥ విలోచనం దక్షిణమంజనేన సంభావ్య తద్వంచితవామనేత్రా
తథైవ వాతాయనసన్నికర్షం యయౌ శలాకామపరాంవహంతీ॥

రఘువంశము.

శ్లో॥ కాచిన్మృగాక్షీ నయనంపురస్తా ద్వామేతరం సంభ్రమతోం
జనాంకం। విధాయ తద్వంచిత వామనేత్రా। జగామవాతాయ
నసన్నికర్షం॥ నలకీర్తికౌముది.

ఇట్టివి పెక్కు 'కుమారసంభవ, నైషధ' మహాకావ్యములలోని వర్ణనములకు సాటివచ్చు శ్లోకములు కాన్పించుచున్నవి.

శ్రీ హర్షమహాకవికృత నైషధకావ్యముల రస, రతి, ఔచిత్య, గుణములే కావ్యమునకు ముఖ్యములని యాలంకారశాస్త్రజ్ఞుల మతము. వానికి భిన్నముగా తర్క, వ్యాకరణ దులే కావ్యమునకు లక్షణములనునట్లు తనశాస్త్రపాండిత్యము దెలియును నైషధకావ్యమనెడి హస్తుడు చూపుటయేగాక, పోనిపోని [illegible] నాదులలో గేవలము నచ్చరింపరాని, అశ్లీలము యుక్తమైన శృంగారాది వర్ణనము

లగు జూపుటచే ప్రసిద్ధాలంకారికుండగు మన యగస్త్యమహాకవి నిర్దుష్టముగ కలిదోషనాశకమగు నలచరితమును 'నలకీర్తి కౌముది' అను నుత్తమకావ్యముగా రచించెనని తోచెడిని

ఈకావ్య మెన్ని సర్గలు కలదియో తెలియకపోవుటయు, గ్రంథము సమగ్రముగా లభింపకపోవుటయు మనయాంధ్రుల దురదృష్ట మన వలసియున్నది.

నలకీర్తి కౌముది విజయనగర సామ్రాజ్య ముచ్ఛస్థితియందున్న కాలమున విశేష ప్రచారమునందుండి, యాంధ్రులచే సుగ్రాహ్యమగు చుండినట్లీ క్రింది గాథచే స్పష్టమగుచున్నది. ఆంధ్ర ప్రబంధములలో "వసుచరిత్రకు సగ్రస్థానముకలదు. అందీ క్రిందిపద్యమును 'రామరాజభూషణుడు' (వసుచరిత్రకర్త) 'నందితిమ్మన మహాకవి' కడ మూడువేల రూప్యములకు గొనెననియు, ఆరహస్యమును 'తెనాలిరామకృష్ణకవి' బైటపెట్టెననియుగూడ జెప్పుదురు. ఆపద్యమిది:

శా॥ నానాసూన వితానవాసనల నానందించు సారంగ మే,
లా నన్నొల్లదటంచు, గంధఫలిజ కా నందపంబంది,యో
షా నాసాకృతిఁబూని, సర్వసుమన స్సౌరభ్యసంవాసియై,
పూనెం బ్రేక్షణమాలికామధుకరీపుంజంబు లిర్వంకలన్.

కాని యీపద్యము భట్టుమూర్తి తిమ్మకవికడఁగొనక, నలకీర్తి కౌముదిలోని క్రిందిశ్లోకమునకు గొంత శబ్దజాలము దగిల్చి మార్చినె యున్నాడు. కాన పైకథ యసత్యమని చెప్పవలసియున్నది. ఆశ్లోక మీక్రిందిది :

శ్లో॥ భృంగానవాప్తి ప్రతిపన్నఖేదా। కృత్వా వనే గంధఫలీ తపోలం।
తన్నాసికాభూదనుభూతగంధా స్వపార్శ్వనేత్రీకృతభృంగసేవ్యా॥
నల 2. స. 7 శ్లో.

ఇది దమయంతీ నాసికావర్ణనము. దీనిఁజూచియే భట్టుమూర్తి గిరికా నాసికావర్ణనముఁ జేసియున్నాడు. కాని మూడు వేలకు బైపద్యము గొనలేదనియు, మూడువేలరూప్యము లగస్త్యునికే చేర్పఁదగినవనియు జెప్పవలసియున్నది. అగస్త్యుని బాలభారతము తిమ్మయామాత్యుని 'మనోహర' వ్యాఖ్యతో విజయనగరమున (విశాఖపట్టణముజిల్లా) ముద్రింపఁబడునని యొకరును, మదాసు గవర్నమెంటువారే ప్రచురింతురని మఱియొకరును పదేండ్లకుపూర్వమే చెప్పిరిగాని యాపని యింకను జరుగలేదు. ఎప్పుడగునో! బాలభారతమునంతను ఆంధ్రమున వచనకృతమొనర్చి శ్రీకొత్తపల్లి సూర్యారావుగారు, ఆం. సా. పరిషత్తు పత్రమున, కాకినాడలో మృదుమధురశైలిని రచించియున్నారు. గ్రంథవిస్తరభీతిచే బాలభారత శ్లోకాలను వ్రాయ మానితిని.





# ఆంధ్రవచన స్వరూపము

పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు, బి. ఏ. ఆనర్సు

హిందూకళాశాల, గుంటూరు

కావ్యముయొక్క స్వరూప, జాతీయ యోజనఁ జేసినపుడనేక ప్రమాణములనుబట్టి యనేకభేదములను (types) పాశ్చాత్యులును, మన యాలంకారికులును నిర్ణయించినారు. ఆ ప్రమాణములలో ఛందస్థితి, కావ్యబహిరాకారము, కావ్యముతోఁ గర్తృసంబంధము, వస్తుతత్త్వములు ముఖ్యములు. ఇందాదిప్రమాణమగు ఛందస్థితి ననుసరించి కావ్యము త్రివిధములుగా విభజించినారు; పద్యాత్మకమనియు, గద్యాత్మకమనియు, నుభయాత్మకమనియు నివి చెలగుచున్నవి.

ఇఁకఁ బద్యమునకును *గద్యమునకు నున్న భేదము నారయుదము. ఇవి రెండును గావ్యశబ్ద వాచ్యములే ప్రాచీనాలంకారికులు నిర్వచించిన కావ్యత్వ మీరెంటను బ్రవర్తిల్లును. అయిన భేదమెచట? పద్యమావేశపూరితమై, యుదాత్త విషయాన్వితమై, భావప్రధానమై, వ్యంగ్య మర్యాదాశ్రయమై, రసపరిధానమై వఱలుచుండును. గద్యమట్లుగాక, వస్తుస్వరూప యాథార్థ్యముగలిగి, స్వభావోక్తి ప్రధాననియమముగా గలిగి, అన్వయసౌలభ్య సహితముగా నపేక్షమాత్రముననే చెప్ప

* ఇట గద్యమనఁగా వచనమని వాడుక. (Prose)

ప్రకృతానుసారియై భాసిలును. ఈ భేదమునే వివరించుచు "ఆర్నాల్డు":

"The Rhythm and measure of poetry elevated to a regularity, certainity, and force very different from the rhythm and measure, which can pervade prose, is a part of its perfection." అని వచించెను.

గద్యము పద్యముకంటె భిన్నమైనది; అది బాహ్యముగాను యంత్రివత్తుగా నుండునది. పద్యమట్లుగాక హృద్గతభావమును నియమ బద్ధముగా, లయాన్వితముగా (Rhythmical) నుంచునది. గద్యము దీనికిభిన్నమై, ఛందోనియమములులేక, విరామాదులులేక, యనేకగ తుల నడుచును. ఈ రెండింటికి భూజలధులకున్న భేదమున్నది. అనగా నొకటి ద్రవరూపముగలిగి చలనశక్తి కలిగినది. రెండవది ఘనీ భూతమై స్థిరత్వమును బొందునది. గద్యపద్య భేదము కేవలము భౌతి కవిభేదమేకాని వేఱుగాదు. అనగా, మనము పర్యాలోచించునవి మా నసికసంబంధ విషయములుగనుక, నీభేదము మానసికతత్త్వ సంబంధ మైన భేదముగానున్నది. చిత్తవృత్తిననుసరించు నొకప్రక్రియ పద్య ము; వేఱొక ప్రక్రియ గద్యము. పద్యము సృష్టిస్వరూపపరిణామము. గద్యము నిర్మాణస్వరూప పరిణామము. సృష్టియనగా ప్రతిభాసమ న్వితమైనది. భావావేశములో బదములు పుట్టుచుండును. పదములకు నిర్దేశింపబడిన యర్థములుగాక, ఛాయాభేదములతో నవి నూత్న పద ములగుచుండును. భావమునకును, పదమునకును మధ్య నెట్టివిరామమును నుండదు. భావమే పదమగును; పదమే భావమును సూచించును. ఇట్టి యవినాభావ సంబంధమీ పద్యరచనలో భావపదములకు వర్తించును.

వచనరచనలో బదములన్నియు యథాతథములుగా నిలిచియుండును. వానికున్న యర్థములోనే యవి వర్తిలును. నిర్మాణకార్యమునకు గడంగినపు డుపకరణములన్నియు సిద్ధముగానున్నట్లు, పదములన్నియు యంత్రవత్తుగా సకాలమునకవి తమస్థలముల నాక్రమించుచుండును. వచన సృష్టికార్యమొక పరిపాటిక ననుగమించునది. దానికొక క్రమమున్నట్లు (logic) స్పష్టము

పద్యమందు భావోద్రేకమున కనుగుణముగా బదములు భాసిలునుగాని యొకనియమముగా నుండవు. కావున వచనములో నిట్టిభావావేశమున కనుగుణముగా వచ్చుపదములు దొరలినచోట నావచనము వచనముగాక, కవిత్వమే యగును. కార్లైలు వచించిన—

'Poetry is musical thought'

అను వచనానుసారిగా రసభావమును పొందు శబ్దార్థస్వరూపమును బ్రదర్శించునట్టిదైన నది కావ్యమే యగును. విశ్వనాథకవిరాజు—

"వాక్యం రసాత్మకం కావ్యమ్"

అనిన వచనముగూడఁ దుల్యమైనది. వచనరచనలో శబ్దస్వరూపము నెఱిఁగి, దానిశక్తి 'force) లేక వ్యాప్తి నెఱిఁగి, యథాస్థానములో, సముచితమైన సందర్భములోఁ బాదగవలెను. వచనరచనకు శబ్దార్థ స్వరూపజ్ఞాన మావశ్యకము. రచయితకు శబాధికారము లేనిదే వచసరచన రాణింపదు.

పద్యమెట్లు భావప్రధానము గలదియో, గద్యమట్లర్థప్రధానముగలది.

పద్యము నయితము గద్యమురొక్క లక్షణముకలిగి యుండవచ్చును. అట్లే గద్యపద్యలక్షణముల (ఒక గణబద్ధతయందుగాక) గ్రి

హింపనగును. ఇట్టి ప్రక్రియా విశేషద్వయములో నాద్యంబగు పద్యము లనేకములు గలవు. అట్టిపద్యములు నామమాత్రకములేకాని వేఱుగావు.

ఉదా॥ ధర్మనిధియైన మీతండ్రి దశరథావ,
నీశుఁడోకనాడు నిజపురోహితునిఁజూడఁ
దలఁచి రథమెక్కి సూతకృత్యంబు నేను
బూనగ వశిష్టముని వసంబునకుఁబోయి. (ఉ. రా.)

ఇట్టివి యనేకములు గాననగును.

కవితావస్తువు లేక రసభావము లేకయే రచింపఁబడిన ఛందానువర్తియైన రచన కవిత్వమనిపించుకొనక, ఆత్మలేనిశరీరమువలె నుండును. కాబట్టి కవితయనునది భావమందున్నదిగాని, రచనలోలేదని చెప్పవచ్చును. పద్యమందలి గణనియమము శబ్దాలంకారమువంటిది. గద్యమందట్టిలోపమును బోనాడుటకై దానిని శబ్దాలంకార సహితముగను, సమాసగుంఫితముగను రచించినట్లు కన్పించుచున్నది. వృత్తఘటితములు, పద్యనిర్మితములే కావ్యములుగాఁ బరిగణించినచో స్మృతులు, వైద్యగ్రంథములుగూడ మహాకావ్యములు కావలెను. కావుననే "గద్యం నికషం కవీనాం వదంతి" అని ప్రాచీనులు నిశ్చయించిరి. గణనియమములేని లోపమును బోనాడుటకై రచించినదే—'ఓజస్సమాస భూయస్త్వమేతద్గద్యస్య జీవితమ్' అనువాక్యము. ఈ లక్షణము ననుసరించిన గద్యకావ్యములు సంస్కృతమున నున్నవి. పద్యరచనలో నున్నది—ఆ కవితాభావమున కొకతోడవు నమర్చుటయే.

"Verse is apparelled only being but on ornament"
—Sir Phillip Sidney.

కావ్యసృష్టికి ననుభూతిప్రధానము. కవి తానుజూచిన వస్తువులోని సౌందర్యాదికముల ననుభవించి, తిరిగివ్యక్తీకరించును. ఈవాక్కే "రసభావము" తనంతతాల్చెడి శబ్దార్థస్వరూపము. ప్రాక్తనమానవుఁడు ప్రకృతిసౌందర్యమునకు ముగ్ధుఁడై గంతులువేసి, పదము పాడెనని గ్రహింపగల్గుదుము. వాల్మీకిశోకము శ్లోకరూపమునే ధరించినది; కాని గద్యరూపముగాదు. కావున నానందానుభూతిఁ బొందినపుడు లయాన్వితమైన గీతియే వెలువడును. ఇందలి సూక్ష్మధర్మమేమన, గీతి హృదయజన్యము. గద్యము బుద్ధి (Reason) జన్యము. హృదయద్రవీకరణము కళవలన గల్గును. బుద్ధినైశిత్యము, శాస్త్రీమువలనఁ బొడమును. పై ప్రక్రమమునుబట్టి, బుద్ధికంటె పూర్వము హృదయవికసనము సహజముగాన, గీతియే ముందు పొడసూపునది.

It is a sort of common place of literary history that verse is always older than prose, and in the case of most literatures—especially modern ones—it is almost demonstrably—Saintsbury.

సారస్వతము వివిధశాఖా విరాజితము. ప్రతిశాఖయుఁ బరిపూర్ణత నొందినగాని సారస్వతమునొక్క సమగ్రస్వరూపము ద్యోతకము కాదు. అభివృద్ధియనునది యేకదేశమైనను, క్రమాగతముగ లేకపోయిన రుచింపదు. అందుచే నవిభాగమైనను స్వయంపూర్ణమై, క్రమాభివృద్ధిని పొందెడి, సమగ్రసారస్వతమునకు దోహదభూతమైవఱలెను. గద్యపద్యములను ప్రక్రియాస్వరూపములో గద్యమునకు చాలదినములవఱకాదరణము కలుగలేదు. అందుచే వచనరచన యక్కుడుగా, నేవిషయమున

ఉపస్కారము కాలేకపోవును. వచనము విషయబోధనానువర్తి. ఇం దలంకారములకు ప్రాధాన్యముండజాలదు. ఉద్దిష్టవిషయ సొబగును హృదయమునకు నాటిగాఁ జొచ్చుటకు వచనరచయిత ప్రయత్నించును. ఈ రచనములో వాచ్యార్థమే ప్రధానము. లక్ష్య, వ్యంగ్యార్థము లప్రధానములు; అనుచితములును. లక్ష్య వ్యంగ్యార్థములు వచ్చిననాఁడది గద్యములోనున్న కవిత్వ మనిపించుకొనునదేకాని, కేవలవచనమగుటకు వీలులేదు. అట్లే విషయస్వరూపబోధకై సదృశవస్తువుల నెన్నినపు డట్టివి యలంకారము లనిపించుకొన్నను, అలంకారశాస్త్రవాచ్య ముండర దని మాత్రము చెప్పవలెను. శబ్దచిత్రములు, అర్థచిత్రములు శైలీభేదములలో వచనమందు కన్పించినను, కేవల వచనస్వరూప మది కాదని ప్రాజ్ఞులు తెలిసికొందురు. అనుస్యూతముగావచ్చు భావములను యథాతథముగా గ్రహించి కాపాడునది వచనము.

వచనము సారస్వతమున ముఖ్యమైన శాఖ. భావమును నిగూఢము గావించి, తికమకలఁ బెట్టుటకును, చెప్పదలఁచిన భావము నా పదజాలములో నాఛందోవిరామములో జెప్పలేకుండుటకును పద్యమున్నది. వచనరచనలో స్వేచ్ఛగలదు; రచయిత తనభావమును విస్తరించి బోధింపనగును. విషయప్రధానమైన రచన వచనమే.

వచన మొక్కడుగా శాస్త్రరచనములం దుపయోగపడును. మానవ జీవితమును సరిగా తెలియవలెననినగాని, తెలుపవలెననినగాని వచనమే చక్కని వాహిని. ఈ భావములకే పూఁతపూసి కార్యకర్త పద్యము లద్వారా వానిని 'కళ' యను రసాయనముగా తయారుచేయు

ను. శాస్త్రీకళలకున్న విభేదమే గద్యపద్యముల కున్నట్లు గ్రహింప నగును.

'When life is the criterion and not art, the prose of a nation is far more important than its poetry.' —Evans.

చరిత్రలందు గాని, తత్త్వవిషయిక మీమాంసలందుగాని, గద్యమే యుపాదేయముగాని పద్యము రాణింపదు. కావున వచనరచన తత్త్వవేత్తలకు, చరిత్రకారులకు నుపయోగపడునుగాని కవులకంతగా నుపయోగకారి కాదు. పద్య స్వభావలక్షణములంబోన్ని, గద్యమును కవులు తమ నవలలయందు, వ్యాసములందు, నాటకములందు వినియోగించుకొన నగును. అచ్చటచ్చట ననేక కావ్యభేదములలో నుపయోగింపబడుచు వచ్చిన వచనమును పర్యాలోచించుట క్లిష్టమే.

In literature prose embraces all forms of oratory and of representative discourse and the prose drama. —New Standerd Dictionary.

ఇందు ప్రతిపాదితమైన సంప్రదాయ మాంధ్రవాఙ్మయములో నతి ప్రాచీనమైనదిగా గ్రహింపగలుదుము.

ఆంధ్ర సారస్వతము నవలోకించుటకు పూర్వము ముఖ్యముగా రెండుభాగములుగా కాలమును భాగించుట యవసరము. ఆంధ్రమునకు సంస్కృతభాషవలన వచ్చిన ప్రాబల్యము; ఆంధ్రమున కాంగ్ల భాషా ప్రాబల్యము. ఇట్టి విభాగమువలన నేవిషయమునైన చక్కగా సమున్మీలింప వీలగును.

పదునెనిమిదవ శతాబ్ది తుదివఱకు సంస్కృతభాషా ప్రాబల్యమాంధ్రమున నింతింతని చెప్పరాదు. సంస్కృతానుసరణము, అనుకర

ణము, అనువాదములే తప్ప ప్రత్యేక ప్రతిభను చాటు సమగ్రప్రక్రియ యొకటైనను ఆంధ్రమున నవతరింపలేదు. ఒకటియత్నము జరిగినదనిన 'ప్రబంధము' పట్లనేమోనని జరిగియుండును. అంతియే. అచటను మాతృకలు సంస్కృతములోనివే. ఇట్లు సంస్కృతములోని ఛందశ్శాస్త్రము, వ్యాకరణము, కావ్యములు, వైదికవాఙ్మయము,—ఇవి యననేల— ఆంధ్రములోనికి యథాతథములుగా నవతరించినవి. కావ్యభేదము లన్నియు (నాటకము తప్ప) సంస్కృతమునుండి తెలుగులోనికి దిగుమతియైనవి. కావున సంస్కృత సంప్రదాయములు (భాషాశాస్త్రముల) తెలియని మానవునికిఁ దెలుఁగు సారస్వతపు దరిఁజేరుట కధికారము లేకుండినది. రానురాను, ఆ పరిభాష, సంప్రదాయములు కేవలమాంధ్రభాషకుఁ జెందినవను భ్రాంతికూడ గలుగుచున్నది. ఇవ్విధముగా నాంధ్రభాషపై సంస్కృతభాషయొక్క ప్రభావము వదలినది.

ఇప్పటికి రెండుశతాబ్దములనుండి మనభాషపై నాంగ్లభాషాఛాయలు, సంప్రదాయములు పడుట మొదలిడినవి. సంస్కృతము మనభాషపై నెట్టియధికారమును మున్ను పూనెనో యట్టియధికారమునే యాంగ్లభాష వహించినది. క్రమక్రమముగా నాంగ్లసారస్వతములోని గ్రంథము లవతరించుటకన్న, ఆభాషలోని విధానమును, ఆ సారస్వతములోని వెలుగు జిలుగుల నెక్కుడుగా నాంధ్రమున కవతరింపజేయఁబడినవి. ఇట్లవతరింపఁబడిన ప్రక్రియలలో నవల, ప్రథమగణ్యము. తరువాత ఉపన్యాసము, కథానిక, విమర్శన, జీవితచరిత్ర, మున్నగునవి తెలుఁగుభాషలో నవతరిల్లినవి. వచనస్వరూప మొకవిధ

ముగాఁ బోడిచేసికొనినదనిన నది పందొమ్మిదవ శతాబ్దియందే యని చెప్పవచ్చును.

ఇవ్విధముగా సంస్కృతాంగ్ల సారస్వతముల ప్రభావము నవగతము జేసికొని, తెలుఁగురచనలలోని వచనస్వరూపము నారయుట సమంజసము.

అంతకుపూర్వము కావ్యములు గానరాకుండుటచే నజ్ఞాతయుగమునాఁటి గద్య సంప్రదాయము దెలియవలెనన్న మనకు శాసనములే యాధారభూతములు. నన్నయకుఁబూర్వము వరలుచున్న తెలుఁగు శాసనములఁ బరిశీలించినచో నవియన్నియు సంస్కృత శాసనముల వలెనే రచింపఁబడినట్లు కానవగును. ఈ శాసనములలోఁ గ్వాచిత్కముగాఁ దెలుఁగు వాడబడియున్నది.[1] దానమొసఁగఁబడిన భూమియొక్క యెల్లలను జేర్కొనుసమయమునఁ దెలుఁగుపదము లుపయోగింపఁబడినవి. మిగిలిన భాగమంతయు సంస్కృతపద భూయిష్ఠము, దీర్ఘసమాస సంభరితము, శబ్దాలంకార పూరితమునై సంస్కృతశాసనముల కెవ్విధమునను దీసిపోవక వర్తిలుచున్నది; సంస్కృత వర్ణక్రమును పాడముచున్నది.[2]

ఉదా: .........[వి] జయాది [త్యపాదప] [ద్మ] భగ్నమా రాయమాన శ్రీమత్కచెయరాజు గుణగణాభరణుణ్డు [ద]న కాని

1. వానిలో ఎక్కడ ఏ తెలుఁగుపదమయినను కనబడుట సంభవించినయెడల మనకు పెన్నిధి దొరకినట్లే. —మల్లంపల్లి. ఆం. ఉగాది.

2. కుంభూరగాళిచే; చెలుకుచుడ్డశ్చ.

ఈశ్వ [శ్వ] రున [కుం] గాత్రిఁకేయుండుబోలె చాళుక్యకుల [లా]
ఇనా (శా) రదు (ణ్డు) పణ్డరంగులు అర్లుమ పెగ్గఁడలుంగర [న]
మ్మన పణ్డరంగును ఈధర్మ్మఁని [వ్వఁ] [హ] నోద్యోగమ్మున [కు]
బృహస్పతి సమానులయ్న పెగ్గఁడకా [కడెయ] గారి [కొడు] కు
[బె] జెయరాజు నమ [త్తుఁ] ణ్డని ఆత్మానమ్మతంబు నంబన్చిన వ్రి

సా [దం] బని సమస్త రా [జ్యభ] ర నిరూపిత మహామంత్రా
ధిపతి [మ] [హే] శ్వర పక్షపాతి దేవబ్రాహ్మణగురు [భ] క్తి పరు
ణ్డును (శ) క్తి (త్రయ) సంపన్నుండు మయ బెజెయరాజు బెజయేశ్వ
రంబుగల న (శ) నిర్వ్వఁ (హ) నంబుసేసి దిన (శ) గుడ్లుం బ్రాకా
రంబు మటంబును నిమియించి.

(రెండవపత్రిక)

.........[బున్వా].........వ్రిచ్చినవ (వారు).........
దఁబు [సల్పి] నవ (వా) రుది......[ం] బుగద్యంబుల నలన (శ్వా)
స్వ (శ్వ) తఁబు......[యను] ఇ (ఈ) భూమిలోన.

(ధర్మవరము శాసనము)

(మూఁడవ విజయాదిత్యునినాటి శాసనము)

తెలుఁగు కవితావతరణ మెట్లు సంస్కృతానువర్తియై వరలినదో, అట్లే తెలుఁగు శాసనములపట్లను సంస్కృత ఛాయపడుట తప్పలేదు. కావున శాసనములందు లభించు తెలుఁగు గద్యభాగములు నామమాత్రికములే కాని, స్వచ్ఛందమైన తెనుగువచనముయొక్క స్వరూపమును బ్రదర్శించునవి కావని సిద్ధాంతీకరింపవచ్చును.*

* "రెండో మూఁడో పద్యములుగల శాసనములంతక్క నన్నయకుఁ బూర్వకాలపు తెలుఁగుభాష స్వరూపమును దెలియఁజేయు నాధారములు గానరాకున్నవి"

—డా. చిలుకూరి.

ఇఁక నాంధ్ర సారస్వతములో నాదికవియగు నన్నయరచనను జూచినచో నందు సంస్కృత పదబాహుళ్యము, సమాససంఘటనములు గాన్పించును. అతనిభారతము చంపూకావ్యముగా బయలుదేరినది. ఇచట చంపూకావ్యమున గద్యపద్యములకు సమానస్థాన మీయఁబడినది. కనుక పద్యముతోఁ గూడి యెడమగా నడిచిన యీగద్యమంతయుఁ గవితాపదార్థ భూయిష్ఠమే; కాని నీరసముగా నేరదు. కావున తెనుఁగు వచనము మొదటినుండియే పద్యముతో సరిగా సాగివచ్చుచునే యున్నదని తెలియుచున్నది.

నన్నయనాఁటినుండియే 'గద్యము' ను పదమునకొక విలక్షణార్థము మనకున్నట్లు తెలియనగును. గద్యము వచనమునకుఁ బర్యాయపదముగా నుపయుక్తమగుచున్నది. కాని 'గద్య' మను ప్రత్యేక ప్రక్రియ మనకొకటి నిర్దిష్టాకారముతో నున్నట్లు గమనింపగల్గుదుము. కావ్యములలోఁ బ్రతి యాశ్వాసాంతమున 'గద్య' పొడగట్టును. దీనిప్రయోజనము లేవియనగా, నా కావ్యరచయితయొక్క వంశ గురునామాదికములను, కావ్యమందా యాశ్వాసములోఁ బ్రతిపాదితమైన విషయములను తెలుపుటయే. అనఁగా నేఁటికావ్యములలో 'విషయసూచిక' యనుక్రమణిక క్రిందవచ్చు వస్తువు. గ్రంథోపరిభాగమున నచ్చిడఁబడునట్టి కావ్యకర్తనామాదికములీగద్యము ప్రాచీనకాలములోఁ జివరఁ దెల్పెడిదన్నమాట. కావున నీనియందు కవితాభావ ముండుటకు వీలులేదు. విషయబోధనయే ప్రధానోద్దేశ్యము. అందువలన నీగద్యమందు కవిత్వముండకపోగా, కేవల వచనముయొక్క స్వరూపము కించిద్వ్యక్తమగును. కాని, యీ గద్యములు కేవల వచనములు కానేరవు. గద్యభా

గము సమాసభూయిష్ఠమై, యనుప్రాసాలంకార యుక్తమై, పద్యము లోనుండు శ్రుతికి (Rythm) దీటైన లయకలిగి విరాజిల్లుచుండును. ఈ శబ్దాలంకార, సమాస, శ్రుతి లయలు గద్యపరిణామములో బొంది నవి నూతనావకాశములు. కావున నివియన్నియు బ్రతిగద్యలోను కాన రావు. కొన్నికొన్ని యన్నిట మిన్నలై చెన్నొందుచుండును.

గద్యము విషయసూచికగా వర్తించునట్లీ క్రింది నన్నయగద్య చూడుడు:—

ఇది సకల సుకవిజన వినుత నన్నయభట్ట ప్రణీతంబయిన శ్రీమహా భారతంబునందు సభాపర్వంబున ధర్మరాజునకు సభాప్రాప్తియుఁ గింకర దర్శనంబును, నారదువలన లోకపాలుర సభాశ్రవణంబును, రాజ సూయ మహాధ్వరారంభంబును, జరాసంధవధయు, గిరివ్రజనిరుద్ధుల యిన రాజులం గృష్ణుండు విడిపించుటయు, రాజసూయంబునన్నది ప్రథ మాశ్వాసము. (సభా.)

ఇట్టిగద్యలు ముఖ్యములుగాఁ బురాణములందుండుట సహజము. మార్కండేయపురాణము, సమీరకుమారవిజయము, భాగవతము, మున్నగు కథాకథనపద్ధతి (Narrative) గల గ్రంథములిందుల కుదా హరణములగును.

ఇఁక వంశనామాదికములు వచించుటలో శబ్దాలంకారములు గలవి కొన్నిగద్యలు చూడుడు:—

"శ్రీమదుభయ కవిమిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విధేయ తిక్కన నామధేయ ప్రణీతంబయిన......"

"శ్రీ కమలనాథ పౌత్ర మారయామాత్య పుత్ర సుకవిజన విధేయ శ్రీనాథ నామధేయ ప్రణీతంబైన......"

"సకలగుణసనాథ సోమనాథ ప్రణీతంబైన..."

"శ్రీమదఖల కవిమిత్ర పెదయన్నయామాత్య పుత్ర శారదా దయావిధేయ జక్కన నామధేయ..."

ఇట్లే చాలమంది కవులు తమగద్యలను రచించిరి.

కవులు తమ ఆశ్వాసాంతగద్యములలో ఇష్టదేవతాసూచనమును జేయుచుందురు. ఇందులకుఁగొన్ని:—

"శ్రీమత్కాళహస్తీశ్వర చరణకమల సేవాపరాయణ సింగమ రమానారాయణ జక్కయనారాయణ తనూభవపరాఙ్ముఖధూర్జటి..."

"శ్రీమత్పరమపదనాథ నిరవధిక కృపాపరిపాకపరిచిత సరసకవితాసనాథ రామకృష్ణకవినాథ..."

ఇట్లే రామరాజభూషణుఁడు, కూచిమంచితిమ్మకవి మున్నగు కవులనేకులు తమ యుపాస్యదేవతలగూర్చి గద్యమందుల్లేఖించిరి. ఈ గద్యభాగములవలన, కవి జీవితమునుగూర్చి యిసుమంత చరిత్ర తెలియుట యుపయోగము. ఈ గద్యరచయిత కొన్నియెడల కావ్యకర్తయే కావచ్చును. కొన్నిపట్ల నా కావ్యముయొక్క ప్రతుల వ్రాసికొనినవారే వ్రాసియుండవచ్చు. ఈ రెండవయంశమును స్థిరీకరించుటకాయా వ్రాతప్రతుల యాశ్వాసాంతగద్యలలో విలేఖకుల నామాదికములుఁగూడ గన్పట్టుచున్నవి. ఇట్టి 'గద్యము' అను ప్రక్రియ ప్రతి గ్రంథమందును పొడగట్టి మన సారస్వతములోఁ బ్రత్యేకస్థానమును గడించినది. ఈ గద్యస్వరూపము కేవల వచనము నకును, కేవలపద్యము

నకును మధ్యస్థితి నాశ్రయించుచున్నది. వీనిలోఁ గొన్ని గద్యలను చూడుదుము. ఆచదువు పద్ధతియే భిన్నము. తెలుఁగుసారస్వతపు తొలిదినములకే 'నమస్కారగద్య', 'రుద్రగద్య' మొదలైనవి యున్నవి. వీనిలో లయ (Rythm) ఉన్నదనియే తలంపవలెను.*

మన సారస్వతములో "దండకము" లనునవి కన్పించుచున్నవి. ఏవిధముగా కవితాభావములేని పద్యము వచనముగా ముందు కాంచితిమో, యట్లే 'దండకములు' వచనముగా భాసించినను, లయ (Rythm) కలదిగనుక పద్యతుల్యమగుచున్నది. ఈ దండకములు నమస్కార గద్యలకు తుల్యములు.

నన్నయతరువాత పాల్కురికి సోమనాథుని కాలమునకే గద్య ప్రబంధములు విరివిగానుండి సంస్కృతపద బాహుళ్యమువలన జనసామాన్యమునకు రుచింపకపోయినట్లు పండితారాధ్య చరిత్రలో—

'ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ పూరితి సంస్కృతి భూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబుగాని జానుతెనుంగు విశేషము ప్రసన్నతకు.'

మఱియు, బసవపురాణములో—

'ఉరుతరగద్య పద్యోక్తులకంటె సరసమై పరగిన జానుతెనుంగు
చర్చింపగా సర్వ సామాన్యముగుట.'

ఈనెడి యుదాహరణములనుండి తెలియవచ్చును. ఇటఁజెప్పిన గద్యగ్రంథము లేమాయెనో మృగ్యముగానున్నవి. లేక, 'గద్యపద్యో

* కావ్యములనిపించుకొనిన వచనములు గద్యములు. కావ్యేతరవచనములు వచనములే!" —పి. ల. కాంతం.

క్తి' అనియు, 'గద్యపద్య ప్రబంధపూరిత సంస్కృత భూయిష్ఠరచన' అనియుఁ జేకొన్నపుడు గద్యపద్యములచే చెన్నొందుచంపు అని యే మా యుద్దేశము!

స్థూలముగాఁ దెలుఁగు సారస్వతమును జూచినచో రెండుగా విభాగింపబడినట్లు తెలిపితిమి. సంస్కృతపరిభావము భాసించినవాటి నుండి వరలిన సాహిత్యమును రెండుశీర్షికలక్రింద విభాగింపవచ్చును; మొదటిది పురాణరచన (The Narrative); రెండవది ప్రబంధరచన (The Descriptive). ఈ రెండు ప్రక్రియలలో నానాకేళథ, రచనాశక్తిచే, నవకాళానుగుణముగ ద్వైవిధ్యమును బొందగల్గును. ఇందులకు పురాణస్థగాథలను బ్రబంధవస్తువుగా స్వీకరించి, నిర్వహింపబడిన ప్రబంధములగాంచిన తెలియును.

ఇఁక పురాణవచనము, ప్రబంధవచనములను పరిశీలింపవలయును. అవుడు వచన మాంధ్రమున నభివృద్ధిపొందెనో, లేదో తెలియవచ్చును.

పురాణములోను, ప్రబంధములోను గన్పించు వచనము భిన్న స్వరూపమును బొందినది. పురాణవచనము పద్యములమధ్య నెడనెడ గన్పట్టును. ఈ వచనము కేవలము రెండుపద్యముల నడుమగాని, రెండు సన్నివేశములకు సంబంధవాక్యముగాగాని వినియోగపడును. ఒక్కొక్కయెడ నిరువుర సంభాషణము పద్యములలోఁ జిత్రించిన, నాయాపాత్రలను సూచించుటకై వచన ముపయుక్తమైనది. ఇట్టివిధానములో వచనము పురాణములోను, ప్రబంధములందును విరివిగా గన్పించుచున్నది. పురాణవచనము పురాణపద్యమువలెనే సుబోధకము (ఆఖ్యా

నాత్మకము) అల్పపద్యవాక్యమయము. అయ్యది నిరాడంబరముగను, నాతిదీర్ఘముగను, విషయప్రధానముగను, కథాగమన వేగముతోడను నడచుచుండును. కాని, ప్రబంధములలో వచనమునకొక ప్రత్యేకతయున్నది. ప్రబంధవచనము దీర్ఘముగను, అలంకారికముగను, వర్ణనాత్మకముగను, సమాసగుంఫిత ఫణితితోడను, పద్యమునందువలె శబ్దాలంకారములతోడను విజృంభించియుండును. కాని భాగవతము మాత్రమిటు నరితూగదు; పురాణవచనమువలె భాసిలక, ప్రబంధరీతి ననుసరించినది. ప్రబంధవచనములో కథావేగమునకై త్వరపడుటలేదు. మీదుమిక్కిలి కథాస్రవంతి యీ వచనమను పర్వతమునొద్ద ఒక్కుమ్మడియాగి, తదుపరి యీవచనపర్వతము నధిగమించి చనుచుండును. కథలోని సన్నివేశముల నెక్కుడుగా వర్ణించుటచే ప్రబంధకవిత్వలక్ష్యము. కనుక, కథాకథనవేగమున కాతని పద్యరచనగాని, వచనరచనగాని పూనుకొనదు. సన్నివేశ 'incident) పరిస్తారమే కవియొక్క యుద్దేశ్యము. ఇట్టి ప్రబంధవచనములలో నెక్కుడు స్వభావోక్తి యొప్పును.

ఇంక ప్రత్యేకముగా వచనస్వరూపము నవలోకింతము. కవిత్రయమువారు వచననెట్లు నిర్వహించిరో చూతము: నన్నయభట్టుగాని, తిక్కన యెఱ్ఱనార్యులుగాని వచనమును కథాకథనపద్ధతికి ననుగుణమైన గౌణమైనవాహిక (medium) గా స్వీకరించినట్లు ద్యోతిలను. ఇంక వారి రచనలోమాత్రము భేదము వర్తించుచున్నది. ఇది వారివారి యాత్మీయత (Personality) ను పురస్కరించుకొని వచ్చిన శైలీవైవిధ్య విన్యాసవిలసనమే. భారతరచనలో నన్నయ యేవిధమైన

వ్యాఖ్యానాత్మకశైలిని ప్రదర్శించెనో, తిక్కన యెట్టి నాటకీయశైలిని నడిపించెనో, ఎఱ్ఱన యేవిధమైన వర్ణనాత్మకశైలిని పుణికిపుచ్చెనో యట్టి శైలీవైవిధ్య మాకవుల వచనరచనలందును తగుమాత్రముగ గన్పించుచునేయున్నది. అనఁగా నన్నయ వచనమునకు కథాకథనశక్తి యున్నట్లు, తిక్కనయజ్వ వచనమునకు సంభాషణాశక్తి యున్నట్లు, ఎఱ్ఱనామాత్యుఁడు వచనమునకు వర్ణనాశక్తి యున్నట్లు మొట్టమొదట సూచిన ద్రష్టలు ఈవిధముగా వచనము త్రిముఖముగా తిరుగగలదని తీర్చిదిద్దినవారా కవిత్రయమువారే కాని ముఖ్యముగా వచనమునకు వారి రచనలలో ప్రాముఖ్యత లేదనుటకు వీలులేదు వచనగ్రంథములు లానాటికే యున్నట్లు శైవకవుల ప్రశస్తములలో హస్తింపబడియున్నది అతర్వాత వచ్చిన తిక్కనామాత్యుఁడు ఉత్తరరామాయణమును రచించుతలఁపు పట్టినపుడు వచనరహితముగా రచన సాగింపవలెనను దీక్షవహించుటనుబట్టి యానాటి వచనస్వరూపము ద్యోతిలగలదు నాటి దీర్ఘవచనములను సాగించుట ఎఱ్ఱనామాత్యుఁడు తీసినదారియే. ప్రబంధోచిత వర్ణనలను నృసింహపురాణ హరివంశములందు విలోకించినవాఁ డాతఁడే వచనములో భావకల్పనాశక్తి యున్నట్లు నన్నయ వచనములలో తెలియును, సంభాషణాచాతురి వచనరచనలో నున్నట్లు తిక్కన పరిశీలించి భావప్రాస్తమునకుగాని, భావవ్యాఖ్యానమునకుగాని వచనము నుపయుక్తమగునని శంభుదాసుఁడు కనిపెట్టె ఇవ్విధముగా కవిత్రయ వచనరచన మూఁడు చిన్నెలుపొంది చెలువారుచున్నది

కవిత్రయమువారి ననుగమించిన కవులలో ననేకులు వారిమార్గముల ననుసరించినవారే అట్టి యనుసరణము వచనమందును గన్పించు

చున్నది. కాకపోయిన, వచనమునకున్న మూడుశక్తులను (పైఁ జేర్చి నినశక్తులు) పరిశీలించి, ముఖ్యోశిఘాయలను సంక్రమింపఁ జేసికొన్నవా రనేకులున్నారు.

మరల కవిత్వములోగాని వచనములోగాని ప్రత్యేకతవిశిష్టతలు వచ్చినఁనిన శ్రీనాథుని హస్తములం దేయని రొుప్పవలయు.

శ్రీనాథుని కవితలో నొకమార్పు వచ్చినట్లు సూచించితిని. కవిత్రియముచే దిద్దిపెట్టబడిన పురాణ లేక ఇతిహాసవైఖరి కొంగకాలము వర్థిలి, శ్రీనాథునినాఁటికి కావ్యఫణితిలోనికి పరివర్తనము పొందినది. ఈ వైఖరీభేదములోఁబాటు రచనాపద్ధతిలోను భేదమువచ్చినది. స్వతంత్రాలంకారములచే నా కావ్యయోష నలంకరించుట శ్రీనాథునితో మొదలుపెట్టబడె మూలమును యథాతథముగా ననుసరించుటలీతని రచనలో స్వల్పము. శ్రీనాథుఁ డెటనున్నను తనవ్యక్తిత్వమును జూపెట్టును. నైషధకావ్యమందలి పద్ధతి యిందులకుదాహరణము. కొన్ని శ్లోకముల ననువదించుటలో వచనముగా నవతరింపఁజేసినాఁడు. దానిలో నాతనియశక్తతగాక, యామూలశ్లోకములలోనివాచ్యత (Baldness) యే కారణ మనవలసియున్నది.

ఉదా: కిమస్యరోమ్ణాం కపటేన కోటిభిః విధి ర్న రేఖాభి రజీగణద్గుణాః
నరోమకూపౌఘమిషా జగత్కృతా కృతాశ్చకిం దూషణశూన్యబిందవః॥

మొదలైన శ్లోకములను వచనమందుంచె జూడుడు:

"......రోమకోటి కిపటంబున హాటకగర్భుండు పాటించి, లిఖించిన సుగుణగణనా రేఖ లవయవంబులం బొలుపారె...'' శృం. నై.

ఇవ్విధముగా శ్రీనాథుఁడు వచనముయొక్క ప్రయోజనమును గ్రహించెను. కథాకథనమున కెక్కుడుగా వచనమే యుపయుక్తమని తెలిపినాఁడు. అందుచేతనే శ్రీహర్షుని శ్లోకములను వచనమందు దింపినాడు. ఇదిగాక శ్రీనాథుఁడు కావ్యఫణితిని ననుసరించినవాఁడు కనుక, అది వచనమందును దొరలినది. దీర్ఘసమాసములతో వచనము నలంకరించినాఁడు. వర్ణనలను మఱింత బరువు గావించెను. అనుప్రాస లంకారముల జొన్పి, శ్రవణపేయమునకు పాటుపడినాడు: ఈక్రిందివచన ముదాహరణమగును.

"వెండియు నవఖండమండలంబగు మహీమండలంబునకు మకరకుండలాలంకారంబునుంబోలె భీమేశ్వరమండలంబు పొరువునఁ ద్రిలింగోత్కలతెలంగబులనంది వింధ్యాచలపాదంబునఁ గేదార కుంభకోణార్కస్థానంబుల కుపమానంబనఁజాలి యేలేటి మేటికాలువలవలన నదీమాతృకంబులగు పంటవలంతులు సలిలధౌతకలధౌతశలాకాశకలసంకోచకరణంబులై యంకురించినవియు......"

శ్రీనాథుఁడు కాశీఖండంబున 'సదాచారనిరూపణము', 'స్త్రీలక్షణనిరూపణము', 'రోగనిరూపణము' లను జేయునపు డెక్కుడుగా వచనముపయోగించి వచన ప్రాశస్త్యము ను నిరూపించెను. అట్టి నీతిబోధలకు, శాస్త్రవిషయములకును వచనమే యుపాదేయమని గ్రహించినట్లు స్పష్టముగదా! ఈతని జటిల వచనరచనఁ జూడుఁడు:

"ఆ రాజరాజు రాజీవభవహరిపురందరాదిబృందారకమకుటసంఘానితవికచమందారకుసుమకూలా మకరందబిందుధారాధౌతచరణారవిందు మందరాచలమంథానమథ్యమానదుగ్ధజలధిగర్భావిర్భూతకాలకూ

టక్రపీటభవపిండగండూషకళంకితకంఠమాలోపకంఠసతుంఠోక్త్రభువనర క్షాదాక్షిణ్యదాక్షాయణీకుచకలశపాళికేళి" కా. ఖం. చ.

అనఁగా శ్రీనాథునిచేతిలో వచనమొక నూత్నమర్యాదాశ్రయి యైనదని సిద్ధాంతము. పోతన శ్రీనాథుని సమాకాలీనుఁడైనను, 'భాగవతము' కావ్యముకాదు; గనుక ఇతిహాసవైఖరినే తనరచనలో ప్రతిపాదించి ప్రయోగించినాడు. కాని పోతనకవిత్వములో గడించుకొనిన ప్రత్యేకత, గద్యమందును పొందినాడని చెప్పవలయును. అంత్యానియమముతో రచించుపద్ధతి యీతనిసొమ్ము. వర్ణనలందు దీర్ఘసమాసయుక్తముగను, కథాకథనమందు లలిత పదములతోఁడను రచనను సల్పగల సవ్యసాచి పోతన.*

ఇఁక శ్రీనాథుని తరువాతివారు గతానుగతికంబుగ నాతని రచననే యనుకరించిరనవలెను. పినవీరన శాకుంతలకథను స్వీకరించినపుడు శ్రీనాథుని భాషాంతరీకరణపద్ధతినే యనుసరించెను. జక్కన, అనంతామాత్యులు తమరచనలలో కథాకథనపద్ధతికి ననువైన రచనసల్పి, వచనములను తదనుగుణముగా నిర్వహించిరి. జక్కన తన "విక్రమార్కచరిత్రము" లో ప్రథమాశ్వాసమున పురవర్ణనమును వచనంబులో నిలిపినాడు. దీనిబట్టి వర్ణనాత్మకమైనశైలి వచనములో నెంతవఱకు నెగ్గునో నిరూపితమగును. జక్కన వచనములు సమాసనంభరితములు, శబ్దాలంకార విలసనములును. శ్రీనాథుని వచనరచనము ననుగమించినా రాతని తర్వాతికవులు.

* "......జలధర నినదశంఖ శార్ఙ్గ సుదర్శన గదాదండ ఖడ్గాక్షయ బాణ తూణీర విభ్రాజితుండు......" 8 స్కం. (భాగవతము).

కవిత్రయమువారి తరువాత మరల శ్రీనాథుఁడే తెలుఁగుసాహిత్యమునకొకతీర్పు దిద్దినాఁడు. అది పెద్దనకాలమువఱకు సాగినది. పిమ్మట పెద్దన పెద్దవాఁడైనాఁడు. కృష్ణరాయల దర్బారు సాహిత్యరంగస్థలమైనది ఎఱ్ఱాప్రెగ్గడచే శంఖుస్థాపన చేయఁబడి, శ్రీనాథునిచే ప్రబంధసౌధమునకు పరికరములను సమకూర్పఁబడి, పెద్దనచే సౌధనిర్మాణము గావింపఁబడినది. తరువాత వసుచరిత్రకారుఁడు సౌధాంతర్భాగములకన్న సౌధోపరిభాగముల నలంకరించినాఁడు. తరువాతికవులందఱు ఆ సౌధములలోనే వర్తించిరిగాని, మించి యేమియు జేయలేదనవలెను. ఇట్లు పదునెనిమిదవ శతాబ్దము వఱకు సాగినది. ప్రబంధములలోని వచనము, పైన నుడివినట్లుగా, ప్రబంధ పద్యసరణినే నడచినది. అట్లనుగుణముగ లేనిచో సమత (Balance) యుండనేరదు. పెద్దనపెట్టిన యొరవడిని కథాకథనమందును, కథాసన్నివేశకల్పనమందును, అంగాంగిరసనిర్వహణములందును, విషయవిభజనమందును, తరువాతికవులు చాలవఱకనుసరించిరి; ఇట్టిరచన గతానుగతికమై కవిసమయము (Comention) వలె పరిణమించినది. ఈ ప్రబంధములలో ద్వితీయాశ్వాసమున (వించుమించు) తప్పక యొకదీర్ఘవచనము పొసగియున్నది. దీనివైశిష్ట్యమే మనః- శబ్దాలంకారము తప్పకయుండుట; యమకము, అనుప్రాసలు పరలుచుండుట; ఇవి సమాసములోనుండి వర్ణనాసందర్భములో రచింపఁబడుట: ఉదాహరణములుగా జూడుడు:—

కోలాహల పర్వతవర్ణనమును జేయుచు వసుచరిత్రకారుఁడు:-

"మఱియు నిక్కోలాచల సంతానంబు, సంతానకకుసుమ వాసనా సమాగత సారంగసంగీత భంగీతరంగంబు లుపాంగంబులుగాఁ బాడు

వేల్పుగాణేల పాణీరితమాణిక్య వీణామధురరావామృతంబులఁ గరఁగి... పెచ్చు పెరుగునచ్చపుఁ బచ్చలచాయలు మెచ్చులుసేయఁ బచ్చికల మచ్చికల పిచ్చలవిడిఁగుఱ్ఱిచ్చుకొని మెసవనుంకించు సంకపురాజంకఁ జంకించి...' మనుచరిత్రలో వేటను వర్ణించు సమయంబున పెద్దన పెద్దవచన రచనమున కుద్యుక్తుఁడాయె. ఈ వచనము అనుప్రాసాలంకారములలో నున్నది. ముక్కుతిమ్మన పొందికగా తన ముద్దుపలుకులతో గద్యమును దిద్ది పెద్దనామలకుద్ది యనిపించె:

'.......అంధకారబలీంద్రనిర్బంధసంధురంధరసమయమధుమథన చరణాంగుష్ఠనిష్ఠ్యూతగగనసరిదంబుపూరంబులకును బింబంబులై ......' అనురచన ముదాహరణము చాలును.

పింగళిసూరన ఆఖ్యానశైలిలో రచనను సల్పినాఁడు. ఆతనికళా పూర్ణోదయమిందుల కుదాహరణమగును. ఇందలి వచనములలో ముఖ్యముగా నెన్నదగినది కథలోనికల్పనల యావిష్కరణ సమయమందు విరచించిన వచనము. సరస్వతీ చతుర్ముఖుల విలాసమును విప్పిచెప్పినపుడు వచనమే యుపాదేయమని తలంచినాఁడు సూరన. ఇట్టి క్లిష్టవిషయము పద్యమందుకన్న వచనమందు విపులముగా వివరింపనగును గదా!

ఇఁక ధూర్జటినిగూర్చియుఁ జెప్పవలసియున్నది:

ధూర్జటి చాలస్వతంత్రుఁడు. కృష్ణరాయల కాలములోనున్నను, అతని కంకితము చేయక శ్రీకాళహస్తీశ్వరునికే కృతిసమర్పించిన ప్రత్యేకత గలవాఁడు. ఈతఁడు తనకవిత్వమందును స్వాతంత్ర్యము వహించెను. ఇతఁడు తన వచనరచనలో యుద్ధమును వర్ణించుతఱి, వేటకు వెడలునట్టి

సందర్భములందును, సహజప్రతిభతో స్వభావోక్తి ప్రధానముగా రచించె.

రామకృష్ణుడు తన పాండురంగమాహాత్మ్యములో వచనరచన సన్నివేశములను వర్ణనోచితపద్ధతుల కండ్లకుగట్టినట్లు చేసెను. నిగమశర్మ యక్క వచ్చిన సందర్భమున నాయింట జరిగిన విశేషములను చక్కగా వచనంబున పొందుపఱచినాడు. "పాండురంగవిభుని పదగుంఫనము" ప్రతిపుటమున గన్పించును. ఈ పైసందర్భమున నూత్న వచనములో రామకృష్ణుడు నిగమశర్మ శరీరముయొక్క కర్కశత్వమును కుకవిపదబంధమునకుబోల్చి తనయాధిక్యమును బ్రకటించె. పాత్రచిత్రణమందు వచనమెంత దోహదభూతమో యుదాహరించినాడనవలెను.

ఆంధ్రకవికులభోజుడైన శ్రీకృష్ణరాయలు రచించిన ఆముక్తమాల్యదలో ననేకవచనములు గన్పించును. కృష్ణరాయలు వర్ణనలందుత్తమోత్తమ రచయితయని ప్రాజ్ఞులతలంపు. ఆముక్తమాల్యదలో నీవిషయమున కుదాహరణములు మిక్కుటము. మతసంప్రదాయ సిద్ధాంతములను రాయలు చక్కగా నెఱిగియుండెను. వానిని తనగ్రంథమందంతటను వెదజల్లినాడు. ఆముక్తమాల్యదలోని వచనరచనజూచినచో తత్త్వవిషయికములైన బోధనమంతటిని వచనమే చక్కగా నిర్వహించుననదని తేలును. ఇవ్విధముగా ప్రబంధములలో వర్ణనలకు, తత్త్వవిషయములాదిగాగల శాస్త్రవిషయములకు వచనమే యుపాదేయముగాని పద్యము కాదని ఋజువయినది.

ఇక దక్షిణాంధ్ర వాఙ్మయములో వచనస్థాన స్వరూపములను గమనింతము. వచనములో, క్రొంగ్రొత్తగా కావ్యసృష్టి యీ నాయ

కరాజ యుగమునందే జరిగినది. పద్యకావ్యముకన్న వచనకావ్యమెక్కువగా సులభగ్రాహ్యమని కవులెఱింగిరి. అనేక ప్రక్రియాభేదములీయుగమం దుద్భవించినవి. యక్షగానమీనాటిదే. గీతిక (Lyric) ప్రాధాన్యము వచ్చిన దీదినములందే. ఆనాటికవులు గతానుగతికముగా గాక, ప్రత్యేకమార్గమును, ద్రొక్కి తమప్రతిభను అసమానముగా అందజేయవలెనని సంకల్పించిరి. తదనుగుణముగా సార్వభౌముల సాహితీపిపాస చేతుల గలసినది. కృష్ణరాయలవలె రఘునాథరాయలు సాహితీద్రష్ట; స్రష్టకూడ. నాయకరాజయుగమున వెలువడిన గ్రంథములలో ప్రబంధములున్నను అవి పిల్లవసుచరిత్రలవలె గతానుగతికములుగాక ప్రత్యేకస్థానమును బొందగల్గినవై వెలుగుచున్నవి. వచనములంత క్లిష్టములుగాక సుబోధ వచనరచనకు మార్గదర్శకములై వ్యావహారిక ప్రయోగములతో సాగుచున్నవి.

This prose is interesting contrast with the classical prose, and is full of colloquial idiom (cf. Taylor's Oriental Historical Manuscripts)

—S. Kuruganti.

వచనరచనకు గడంగినవారిలో 'రాయవాచక' కర్త యు,[1] ఎలకూచి బాలసరస్వతిని పేర్కొనకతప్పదు. బాలసరస్వతి "వ్యాఖ్యాన" మను ప్రక్రియను తెలుగులో నవతరింపజేసినాడు. కళువె వీరరాజు,

---

1. రాయవాచకము మఘరసేనాపతిచే రచింపబడినది. ఇందలిభాష వ్యవహారసిద్ధమైనది. "రథోత్సవమునకు విజయంచేయవలెను; అని విన్నపం చేయంగ దగ్గ వున్న ధర్మనాయకులు అతీతున్నే రాయలవారు విచ్చేసివున్నారు."

సముఖము వేంకటకృష్ణనాయకుఁడు, ముఖ్యముగా వచనగ్రంథముల రచించిరి. కంకంటి పాపరాజు ప్రబంధసరణిలో రామాయణ కావ్యవిరచనము సల్పినను, తనకాలమునాఁటి వచనశైలి యాతనిగ్రంథములోఁ బ్రతిఫలింపక పోలేదు.

ఈయుగమందు వెలసిన రచయితల రచనమందలి వచనమును సూచించెదను: కంకంటి పాపరాజు వ్రాసిన యుత్తరరామాయణములో వచనము స్వభావోక్తి ప్రధానముగను, పాత్రచిత్రణమున కనుగుణముగను, పౌఢముగనున్నది. ఉదాహరణముగా, జానకీశోకఘట్టమున జానకి లక్ష్మణునిచే రామాజ్ఞ నెఱిఁగి, యవశయై చేడ్పడియున్న తఱి నాపెయవస్థను వచనములో నెట్లుచిత్రించెనో కాననగును.[2]

ఇట్లే రంభను రావణుఁడు మానభంగ మొనర్చినపిమ్మట రంభ యొక్కదుర్దశ వర్ణించినాఁడు వచనమందు:—

'బెబ్బులివాతికిం జిక్కియు జిక్కకమగిడిన హరిణికరణి రావణు ముఖగహ్వరంబునంబడి బయలుదేఱిన చంద్రికకళచందంబున......... చెదరిన ముంగురులతోఁ బెదరిన బెళుకుచూపులతోఁ బ్రిదిలిన నీవిబంధంబుతోఁ వదలిన కేశపాశంబుతోఁ బగిలిన బింబాధరంబుతోఁ నొగిలిన

2. "......పడి చేష్టడి బడిబడింబోడతూ బడలిక నొడలెఱుంగక రెంటఁగడియలుండి కొండొకతెలిసి, వెండియుఁ గలసి, యవశయై దీనదశంబొరసి, కృశాంగి మరలఁ గన్నుదొరలివిచ్చి, విచ్చలవిడి వెడలెడి యశ్రుధారాప్రవాహంబులు చెక్కుటద్దములపై జాలువాఱ, .... ..పురపురఁబొక్కుచుఁ దాల్మిమాలి, వుక్కుచు లేచికూర్చుండి .. వెక్కి వెక్కి యేడ్చుచు .....తలయూచుచు, దల యూచుచు పడిచి, యుక్కుపై వ్రేలం గీలుకొలుపుచు...హాహాకారంబు సలుపుచు......"

చక్కటద్దంబులతో...... వాడిన విరిసరులతో పీసిన భూషణంబులతో ...... ఆకారంబు దాల్చివచ్చిన శోకరసాధి దేవతవలె' నున్నదని వర్ణించె. ఇట వర్ణితమ్ములైన యవస్థలను సూచించుటకు సంతరింపబడిన క్రియా పదంబులు రెండురెండుగా ననుప్రాసాలంకార సహితముగానుండి నడకలో బిగువును జాటుచున్నవి.

సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడు తెనుగు వచనస్వరూపము తిన్నగా తెలుపుటకై సారంగధర చరిత్ర, జైమినీభారతములను వచనకావ్యముల రచించెను. ఈతని వచనరచన సులలితపద నవ క్లిష్టాన్వయములులేక, "కులుకు కోకిలనణంచు గళరవంబు, పలుకుల సారు" గలిగి తెనుగు తీయదనమును, తేటదనమును తీర్చిదిద్దినట్లుండును. సంభాషణావిధానమును జిత్రించుటలోనైత మీవచనము నిరాడంబరముగా సరసముగా నుండును.

"జననీ! తక్కినవారికింబలె యింత యుపచారంబేమిటికి? నేను నీ కుమారుండనుగానే" యనుటయు నా పుష్పబోడి, బొమ్మంచు కెమ్మోవిచిగురునం జిరునగవు మొలకలు గులుక, కప్పురంపువీడియంపు తావి ఘుమ్ము మన, తేనియచినుకులొలుక నిట్లనపలికె; 'ఓ జగన్మోహనాంగ! నాకుమారుండవగుదువు; నిక్కంబుగ లికితివి. నీదు సుగుణత్వంబును, నీ చక్కదనంబు నీయొయ్యారంబు నిచ్చెలులు నిచ్చలు పలుక విని వీనులకు విందులయ్యె. ఇప్పుడుకనుంగొనుటచే కన్నులకుం బండువయ్యె..."

కళువె వీరరాజు రచించిన వచనభాగతము, మఱి కర్తలెవరో తెలియని వచనములు, 'భారతచిత్రకథలు', 'భేతాళపంచవింశతి',

మొదలైనవి యనేకములున్నవి. విజయరంగ చొక్కనాథుఁడు 'మాఘమాహాత్మ్యము', 'శ్రీరంగమాహాత్మ్యము' లను వచనకావ్యములరచించెను. రామాయణ భాగవతములును వచనములోని కవతరింపఁబడినవి. శ్యామరాయకవి వచనరామాయణమును, పుష్పగిరి తిమ్మన వచనభాగవతమును గూర్చిరి.

ఈ విధముగా వచనరచన విరివిగా పదునేను పదునెనిమిది శతాబ్దులలో జరిగినది. వ్యావహారికభాషా ప్రాధాన్యము చాలగ్రంథములలో నున్నట్లు తెలియగలము. నాఁటి యక్షగానములలోని వచనము గూడ వ్యావహారికమే. వచనగ్రంథములకు ముఖ్యముగా సుబోధకత్వమే ప్రోద్బలమిచ్చినది. ప్రజలకందుబాటుగా సాహిత్యము నుంచుటకుగాను దక్షిణాంధ్రవాఙ్మయము పుట్టినట్లు ద్యోతిలును. భారతభాగవత రామాయణములను వచనమునందుంచుట, యక్షగానముద్వారా ప్రజాభిరుచిని చూఱగొనుటలు తార్కాణములుగదా!

పూర్వోక్తప్రకారముగా నాంధ్రభాషమీఁద నాంగ్లభాషాప్రాబల్యము పందొమ్మిదవశతాబ్ది మధ్యకాలమునకు బాగుగావచ్చినది. ఆంగ్లవచనరచన యాంధ్రులనేకుల ముగ్ధులనుజేసినది. అట్టివాఙ్మయ మాంధ్రభాషలో నిర్మింప కుతూహలము సాహితీసేవకులకు జనించినది. ఇట్టిస్థితిలో చిన్నయసూరి సర్వాతిశాయియైన గుణముకలిగించి వచన రచనచేసినాఁడు. ఆంగ్లపాఠశాలలలోఁ దెలుఁగుచదువు విద్యార్థులకు ప్రయుక్తములగు సులభవచనములను రాయదుర్గము వేంకటనరసయ్య ప్రారంభించెను. చిన్నయసూరిదృష్టియు నట్టిదే. కాని సూరియీప్సి

తము పెద్దది! ఆలంకారికమైన వన్నెచిన్నెల నాపాదించి, శైలీసంపద ఘటించి, విరచించిన "నీతిచంద్రిక" పిన్నలకేగాక పెద్దలకు నాదరణీయమైన గ్రంథమాయెను. వచనరచనములో మకుటాయమానమైనది 'నీతిచంద్రిక.' ఆంగ్ల వచనరచన ననుసరించి, వాక్యవిరామాదులను పాటించిన ప్రథమాంధ్ర వచనరచయిత చిన్నయసూరి. సంస్కృతాంధ్రములను సొగసుగా పొందింపగలశక్తిమంతుఁడు సూరి. భావముగాని, భాషగాని, తొట్రుపడకయే గంభీరముగ నడిపింపగల ప్రతిభాశాలి. నన్నయభట్టు పద్యరచనమందెట్టి దిట్టయో, వచన రచనమందు సూరి యంతటిదిట్టరి.

చిన్నయసూరి ప్రారంభించిన గ్రంథమును బూర్తి చేయుతలంపుతో వీరేశలింగముపంతులు, కొక్కొండ వెంకటరత్నముపంతులు ప్రయత్నించిరి. వెంకటరత్నముపంతులు రచన బిసుసపాకమునఁబడినది. వీరేశలింగముపంతులు చిన్నయసూరివలెనే వ్రాయుటకై యత్నించి చాలవఱకు మరపింపగల్గెను; కాని యది వీరేశలింగముపంతులు సహజశైలి కాదని, యాతని యితరవచనమును జూచినచో బోధపడగలగు. వచనమును సర్వోపభోగ్యమైన వస్తువుగాఁజేసి కేవల, మాధునికమగు వచనమునకు మార్గదర్శియయ్యెను. కావున వచనమునకు మూలపురుషుఁడు వీరేశలింగముపంతులే యనవలెను. ఆంగ్లప్రభావము పూర్తిగాఁ బ్రతిఫలించినదాతని రచనయందంతటను; ఆంధ్రమున 'కథానిక'నుతప్ప మిగిలిన వచనమార్గముల ననుసరించినవాఁడు పంతులే. నవల, విమర్శనము, చరిత్రప్రహసనము, వ్యాసము, ఉపన్యాసము, మొదలైన

వచన ప్రక్రియాభేదముల నన్నిటి నవతరింపఁజేసిన గురువు శ్రీ వీరేశ లింగముపంతులు. వీరిగ్రంథములన్నియు గావ్యములుగాక, విజ్ఞానోప లబ్ధి శక్తి కాకరువచ్చునవిగా నున్నవి. స్వీయచరిత్ర, వీరేశలింగముపం తులు వారితోడనే యాంధ్రమున నవతరించినది. పూర్వమున్న యాలం కారిక, శాబ్దికవిమర్శనము గాని, గ్రంథములపై నాధునికవిమర్శ నలు సల్పిన యాదిగురువు పంతులుగారే! నవలావాఙ్మయమునకు శ్రీకారముపెట్టిన మహానుభావులుకూడ వారే! విమర్శనమందు పంతు లుగారితోపాటు గురజాడ రామమూర్తి పంతులుకూడ పెన్నదగినవాడు. కాని వీరేశలింగముపంతులుకున్న నిష్పాక్షికాభిప్రాయము, పరిశీలనా దృష్టి రామమూర్తిగారికున్నట్లు తోచదు.

ఇట్లీవిధముగా నూతనమార్గమున వచనము వీరేశలింగముపంతు లవారి మూలముచేతి వాణిజ్యకటకమున నాధునికయుగమున వర్తిలినది. ఆధునిక యుగమునందలి వచనస్వరూపము నెఱుఁగుటకు ముఖ్యముగా విషయ విభజన మవసరమని తోచును. వచనములోవచ్చిన వివిధశాఖలక్రింద వివిధసేవకుల కృషి, తత్స్వరూపముల నెన్నుట యుచితము గదా!

వచనము బహువిషయముల కాలవాలమైనది. నవల, ఉపన్యా సము, విమర్శనము, చరిత్ర, శాస్త్రము, వ్యాసము—ఇవి వచనము యొక్క ముఖములు. వీనినాదరించి రచనసల్పినవారి నెఱుంగుదము.

ఆనాఁడు వీరేశలింగము పెట్టినభిక్ష నేటికిని నవలవిషయమున పానఁగుచునేయున్నది. కాని, రచనములో, స్వరూపములో, కథాస న్నివేశకల్పనములలో మార్పు లగుపించుచున్నవి. 'నవల' అను పదము మాత్రము మల్లేయున్నది.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు జీవించియున్న నవలారచయితలలో ప్రథమగణ్యులు.* వీరి వచనము మృదువైనది. వీరేశలింగముగారిరచనలోని సారళ్యముతోపాటు వీరి రచనకు సౌకుమార్యమబ్బినది. హాస్యముకూడ కడుమేలైనదే. రామచంద్రవిజయము, గణపతి, సౌందర్యతిలక, శాపము, సుధాశరచ్చంద్రములు, వీరి గొప్ప నవలారచనలు, చారిత్రకనవలలో చిలకమర్తివారద్వితీయులేమో యనునట్లు 'హేమలత', 'రాజస్థానకథావళి' వెలుగుచుండును.

నవలారచయితలసంఖ్య బాగుగా నాంధ్రమున బెరిగిపోయినది. ఇట్లు తండోపతండములుగా వచ్చుచున్న వీరిలో మంచిచెడ్డలేరుట కర్తవ్యముగాదు. ఈ రచయితలందరు వచనరచనమునకు తోడ్పడిరనియే చెప్పవలయును. కొందఱు భాష చాల జటిలముగా నుపయోగించిరి. కొందఱు ద్రాక్షాపాకములో సొంపుగా రచించిరి. వేంకటపార్వతీశకవులు పేరెన్నికగన్న నవలారచయితలు. వీరి 'ప్రమదావనము' చక్కని ఆంధ్రనవల. వేంకట పార్వతీశకవులు నవలకొక విశిష్టమైన వచనరచన నాపాదించి, పండితపామరహృద్యముగా రచనసాగించిరి. జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి వచనరచన చాల క్లిష్టమై వచన ప్రయోజనమునకు సుదూరమై వర్తిల్లును.

నవలరచనలో వచనము చాల కాలమువఱకు, అనగా, గిడుగు రామమూర్తిపంతులు వ్యవహారిక భాషావాదము నుద్ఘాటింపక పూర్వము, గ్రాంథికములోనే భాసిల్లినది. గ్రాంథికవచనమును వశ్యము

* "కవులచరిత్రకు నిక సాయమానమగు గద్యప్రబంధరచనమున వన్నెకెక్కిన యల్పసంఖ్యాకులగు నాంధ్రకవులలో గణనీయులు.... ...."

—ఆంధ్రవిశ్వవిద్యాలయపట్టప్రదానోత్సవము

జేసికొనిన వారయుడు. కృతకభాషగాక, వ్యాకరణసాధ్యములౌ పదము లను, కారకములను ప్రయోగించినట్టి గ్రాంథిక, [illegible] మానకు సమీపముగానుండు భాష ప్రయోగించిన [illegible]దిచాల హృద్యముగానుండును. వ్యావహారికము పేర వ్రాయబడుచున్న [illegible] గ్రంథములలో గాని, భాషించు ఉపన్యాసములలోగాని ఉన్న భాష సామాన్యజను లెంతవఱకు సుబోధకముగా నున్నదో ప్రాజ్ఞులు, దర్శిష్టులు తెలుపగ లరు. మాండలిక భేదములతో మూర్తీభవించి [illegible] దుర్బోధ [illegible] మగు చున్నట్లును తెలిసిన విషయమే గదా! క [illegible] తుల్యించి, సమాన భూయిష్ఠరచన [illegible] జమ్ములమడక మాధవరాయశర్మ రచనము [illegible] ఇట్లుగాక, సామాన్యమానవుని కష్టముగు [illegible] గ్రాంథికము నారాధించినవారు వీరేశలింగము, విశ్వనాథ వేంకటేశ్వర్లను ఇయ్యది వారి రచనలలో గాననగును ఈరచనలలో [illegible] సామాన్యులకును సుబోధకముగా రచించుటకు వ్యావహారిక [illegible] యక్కఱలేదనియు, గ్రాంథిక వచనలోగూడ పండిత పామర హృద్యముగా రచ[illegible] వీలు న్నదనియు తెలియగలదు. ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులువారి 'మాలపల్లి' లోని వచనము సుబోధమే దీనినే తేట తెనుగందుము. మాండలికములను గూర్చి Ernest Horwity—

"Books written in a dialect are slow to travel beyond the pale of the province where it is spoken, but, a classical tongue like sanskrit spreads quickly over a wide geogrophical area"

అని వచించినాడు.

అయితే, యీ కూడలిక శబ్దములకు గిత్తిత్లించు లక్షణకర్త వచ్చినగాని దీనివలన ... ము ...శమింపదు

ఇక ఉపన్యాసమునందు, పనుగంటి లక్ష్మీనరసింహము పంతులను పేర్కొనవలెను. వారి 'సాక్షి' సంపుటములలో గానవచ్చు వచనస్వరూపము మనస్సు సాధారణము ... ధారాశుద్ధి, విషయనిర్ణయము, ఉపన్యాససంగతి, వచనరచన లక్షితమైనవి ... అందఱకును సుబోధముగానున్న రచనయని ఆంధ్ర 'ఎడిసన్' అనిపించుకొనిన సమర్థుడు.

విమర్శనములో వచనరచనమే యుపాదేయమైనది. కాని కొందఱు — వజ్ఝల సూర్యనారాయణశాస్త్రి, మధునాపంతుల రామలింగస్వామి వంటివారు — విమర్శకపద్యములలో రచించిరి. వచనరచన సల్పిన విమర్శకులను పాత్రిక విమర్శకులనియు, సాహితీ విమర్శకులనియు విభజింపవలెను. సాహితీ విమర్శకులలో ‘వ్రా ష్ల రామకృష్ణయ్య, కట్టమంచి రామలింగారెడ్డి, కాశీభట్ల ...కులు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, పురాణం సూరిశాస్త్రి, శే వె రాఘవయ్యంగారు మున్నగువారెందఱో యున్నారు. వీరందఱిలో ము...ని కృష్ణరావుగారగ్రగణ్యులు. వారి "సమీక్ష" యిందుకు నిదర్శనము. నిర్దుష్టమైన, యుదాత్తమైన వచనరచన స్వరూపమును వస్తువునకనుగుణముగా రచించి చూపిన, మేధావి కృష్ణరావుగారు టీక్వాస్ మొదలగు రచయితలతో నించుమించు చేతులు కలిపినాడనవలెను.

మన పురాణగ్రంథములను వచనములలోనికి దింపి, సర్వోపభోగ్యములుగా గావించిన నోరి గుర్లింగశాస్త్రి, నగపూడి కుప్పుస్వామయ్య,

పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి మున్నగువారు స్మరణీయులు. అనేక పండితులు గ్రంథపీఠికా రూపమున విమర్శనల సల్పుచు వచ్చిరి. ఈ వచనరచన క్లిష్టముగాదు, అయినచో బ్రయోజనము చెడునుగదా! మేడేపల్లి వెంకటరమణాచార్యులు, దేవరాజసుధి, జయంతి రామయ్య పంతులు, వేటూరి ప్రభాకరశాస్త్ర్యాదు లనేక పీఠికలు రచించి వచనోపాసకులైరి.

చారిత్రికులలో కొమర్రాజు, మల్లంపల్లి, మారేమండ, భావరాజు, కురుగంటి, మల్లాది, పింగళి, దువ్వూరి, భోగరాజు, ఏటుకూరి, వఙ్గూరి, దిగవల్లి, మానికొండ, కవిత్వవేది, వంగూరి, చిలుకూరి, రాయసము, కోరాడ, గంటి మున్నగువారున్నారు. వీరిలో కొందఱు సాహిత్యచరిత్రకు, కొందఱు భాషాచరిత్రకు, కొందఱు రాజకీయచరిత్రకు గడంగి, సేవ చేయువారున్నారు. కొమర్రాజు లక్ష్మణరావుగారు స్మరణీయులు. పరిశోధనాపద్ధతికి దారిదీసిరి. శాస్త్రరచయితలలో సి. ఆర్. రెడ్డి, ఆత్మకూరి గోవిందాచార్యులు, గుళ్ళపల్లి నారాయణమూర్తి, కాశీపట్నం కొండయ్య వఝులవారు, అప్పన్నశాస్త్రి మున్నగువారల్ప సంఖ్యాకులున్నారు.

వ్యాఖ్యాత లనేకులు వచనము నారాధించుచున్నారు.

వ్యాసరచనమునకు వచ్చినచో సిగ్గుగాని చెప్పకతప్పదు. పత్రికాముఖముగా వెలువడు వ్యాసములు వ్యాసములు కావని మనవి. వ్యాస మనఁగా కేవల విషయప్రాధాన్యము కలది కాదు. ఏచిన్న విషయమునైనను రచయిత భావాధిక్యముచే కేంద్రీకరించి, విస్తరించి, అంగాంగిభావ నిర్వహణముచేసి, యుదాత్తమైన శైలీసంపదతో విరచనచేసి

కావ్యత్వ మాపాదింపవలెను. పద్యమువలె వ్యాసమునకుగూడ రసమే ప్రధానము. ఈ కారణముననే ఆంగ్లసాహిత్యమున వ్యాసకర్తల రచనలను విమర్శకులు కావ్యముక్రింద జేర్చిరి. ఇట్టి వ్యాసమను ప్రక్రియ లేని లోపమును మన యాంధ్రసాహితీ సేవకులు తీర్పవలసి యున్నది.

మనకు "కథానిక" నూతనముగానే వచ్చినదని పలువుర యాశయము; కాని పూర్వమిది వర్తిలినటుల మథించినవారు తెలియగలరు. మన యాంధ్రగృహములలో ముసలివారు చెప్పుపద్ధతి, వచనమాధుర్యము లప్రతిమానములు. ఆ సంప్రదాయమును విస్మరింపరాదు. 'కథానిక' నేటి సారస్వతమున ముఖ్యస్థాన మాక్రమించి వచనరచయితలనేకుల పేరేంచు చున్నది. చింతాదీక్షితులు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, భమిడిపాటి కామేశ్వరరావు మున్నగువారు ప్రసిద్ధులలో కొందఱు. కథాకథన పద్ధతికి వచనమెంతవఱకుపాదేయమో వీరు నిరూపించి రనవలెను. ఇటీవల వచననాటికలు బయలుదేరి వచనరచనకు దోహదఘాతము లగుచున్నవి.

పత్రికలు వచనముపాసించు నిలయములు. 'Journalism' ఇతర ప్రాంతములలో గొప్పవిషయము. అది ప్రత్యేకశాస్త్రము. అట్టిది తెలుగులో బాగుగా ప్రవేశింపలేదని తెలియవలెను.

నేడాంధ్రమున శాస్త్రవాఙ్మయము వచనములోఁ దారసిలవలెనని యత్నములు జరుగుచుండుట ముదావహము. అన్నిట వ్యావహారికరచన యుపాదేయ మగుచున్నది. దీనివిషయమై ముందే తెల్పితిని.

ఆంధ్రవచన వాఙ్మయము నొకమారు సింహావలోకనము చేసినచో నైదువిధములైన విభజనము పొసగట్టును:

1. పద్యములో వేఱుపఱుపరాని పురాణవచనము.
2. ప్రబంధమం దాలంకారిక శైలీవిన్యాసముతో వర్ధిలినవచనము.
3. ప్రజానీకమున కందుబాటులో నుండునట్లు రచింపబడిన వ్యావహారిక వచనము.
4. చిన్నయసూరి, కొక్కొండ వెంకటరత్నం పంతులవారి జటిల గ్రాంథిక వచనరచనము.
5. వీరేశలింగము, విశ్వనాథుల సుబోధము, సులలితమగు వచన రచనము.

ఇవ్విధముగా నాంధ్రవచన స్వరూపము గోచరించుచున్నది.

కావ్యములువ్రాసి కవి యనిపించుకొనుట కెట్టి యాదరమున్నదో, వచనరచన చేసియు నట్టి యాదరణమునే పొందనగునని సాహితీపరులకు నాశయవి. ఆంధ్రుల విజ్ఞానము, సంస్కృతి, శాస్త్రములు సులభబోధకములుగా వచనరూపమున వెలువడుటకు పండితులు, ప్రతిభావంతులు, పరిషత్తు, విశ్వవిద్యాలయము వారు పాటుబడి యాంధ్ర వచనాభివృద్ధికి తోడ్పడుదురు గాక! యని ప్రార్థించుచున్నాను.*



* గొబ్బూరి వెంకటానంద రాఘవరావు గద్య వాఙ్మయచరిత్ర యని చాలకాలముక్రిందట వ్రాసెను. అందు పదునెనిమిదవ యుగమునకే కేంద్రీకరించబడినట్లు, గద్య వాఙ్మయ చరిత్రకారు, అది యాకాలమందు వర్ధిలిన వచనమందలి వ్యాకరణ విశేషముల పరిణామ స్వరూపములు పరిశీలించదగును.

# ప్రథమోత్సవ వృత్తాంతము.

హైదరాబాదాంధ్ర సాహిత్యపరిషత్ప్రథమోత్సవము, మ. ఘ. వ. శ్రీ నిజాంప్రభువరేణ్యుల యనుమతిమీద హైదరాబాదు పురమందిరమున కాశీ హిందూ విశ్వవిద్యాలయోపాధ్యక్షులును, సుప్రసిద్ధాంధ్రులునగు డాక్టరు సర్ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి యధ్యక్షతను మిక్కిలి జయప్రదముగా ప్రారంభింపబడెను. మ. ఘ. వ. నిజాంప్రభుత్వ విద్యాశాఖా మంత్రులగు నవాబ్ సర్ మెహిదీ యార్జంగ్ బహద్దరువారు సభను దయతో ప్రారంభించిరి. ఉత్సవ కార్యక్రమమీ క్రిందివిధముగ నుండెను.

<u>14—12—43. (ఆంగ్లమున కార్యక్రమము.)</u>

1. సభాప్రారంభము: ప్రారంభకులు నవాబ్ సర్ మెహిదీ యార్జంగు బహద్దర్‌గారు.
2. అధ్యక్షవరణము: గులామ్ అహ్మద్‌ఖాన్‌గారు, రిటైర్డుసుబేదార్.
3. అధ్యక్షులవారి ప్రారంభోపన్యాసము: డాక్టరు సర్. యస్. రాధాకృష్ణన్‌గారు.
4. స్వాగతము: ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు.
5. ఉపన్యాసము: "ధర్మశాస్త్రమున కాంఘ్రులసేవ." శ్రీ వల్లూరి సూర్యనారాయణరావుగారు, అడ్వొకేటు.
6. కార్యదర్శినివేదిక: మొహమ్మద్ ఖాసింఖాన్‌గారు.

సందేశములు :
7. అధ్యక్షులవారి ప్రసంగము.
8. వందనములు.

15—12—43. (తెనుగు)

అధ్యక్షులు : శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు
ఉపన్యాసములు : 1. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు
"రెడ్డిరాజుల ఆంధ్రవాఙ్మయసేవ"
2. తూములూరి శివరామకృష్ణశాస్త్రిగారు : "మాతృక"

14—12—43. ఉదయం (తెనుగు)

అధ్యక్షులు : అభినవవాగనుశాసన శ్రీ మల్లాది సూర్యనారాయణ
శాస్త్రిగారు.
ఉపన్యాసకులు : 1 శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు
"ఆంధ్రసాహిత్యము, అలంకారశాస్త్రము"
2. పండిత పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు : 'అగస్త్యకవి'

సాయంకాలము (ఆంగ్లము)

అధ్యక్షులు : జి. యజ్దానీగారు, ఎమ్. ఏ; ఓ. బి. ఇ.
మాజీ శాసన పరిశోధనశాఖాధ్యక్షులు.
ఉపన్యాసకులు :
1. డాక్టరు రాఘవన్ గారు, ఎమ్. ఏ; పి హెచ్. డి.
(మదాసు విశ్వవిద్యాలయము) "శృంగారమంజరి"
2. డాక్టరు మారేమండ రామారావుగారు, ఎమ్.ఏ; పి. హెచ్.డి.
"భారతదేశచరిత్ర సంస్కృతులలో ఆంధ్రులస్థానము"

3. శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగారు, ఎం ఏ, బి. ఎల్
"శాలివాహనకాలము భారతదేశమునకు, ప్రత్యేకముగ నాంధ్రదేశమునకు తెచ్చిన వికాసము"

4 డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు, ఎం ఏ,పి హెచ్ డి.
"ఒక కాకతీయ రాజప్రతినిధి ఆస్థానము"

## 17—12—48 (తెలుగు)

అధ్యక్షులు భావరాజు వెంకటకృష్ణారావుగారు, ఎం ఏ, బి. ఎల్
ఉపన్యాసకులు 1 పండిత మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు
"ఆంధ్రభాషా పరిణామము"

2 శ్రీ పిల్లలమర్రి వెంకటహనుమంతరావుగారు, బి. ఏ. (ఆనర్సు)
"ఆంధ్రగద్యవాఙ్మయపరిణామము"

పైన వివరింపబడిన ఉపన్యాసములలో ఆంధ్రమున నిచ్చినవానిలో కొన్ని యిందు ప్రకటింపబడినవి. ఆంగ్లమున నిచ్చినవానిలో కొన్ని త్వరలో రాబోవు ఆంగ్ల త్రైమాసిక పత్రికలో ప్రచురింతుము. ప్రారంభసభగాక మిగిలిన సభలన్నియు దివ్యజ్ఞానసమాజ మందిరమున జరిగినవి. పురమునందలి యాంధ్రులుత్యుత్సాహముతో పాల్గొనిరి ప్రారంభసభకు పూర్వము ప్రతినిధులతో ఛాయాపటము తీయబడెను. అధ్యక్షులీ పరిషత్తు సకుపచ్చిన తరవసరము న నికనొప్పటను ఉపన్యాసము లీయుటపోవుటచేత ఆసభకు వేలకొలదిప్రజలు వచ్చిరి సభాప్రారంభకులు రాష్ట్రమున కాంధ్రులుచేసినసేవ నుగ్గడించి, ప్రభుత్వము వారినుండి పరిషత్తునకు సందేశము నందించి, 2000 రూపాయిలు

దానమునొసగి పరిషత్తునెడల తమకుగల, ప్రభుత్వమువారికిని ఉన్న ప్రేమను వెల్లడించి, పరిషత్తుయొక్క కృతజ్ఞతను చూరగొనిరి. అధ్యక్షులు తమ సహజ గంభీరోపన్యాసమున ప్రస్తుత ప్రపంచాధ్యాత్మిక స్థితికి వగచి యందలిలోపముల నెట్లు సవరించుకొనవలెనో సెలవిచ్చిరి. కార్యక్రమము ముగిసినవెనుక శ్రీ వద్దూరి సూర్యనారాయణరావుగారి వందన సమర్పణముతో సభ ముగిసెను.

మరునాటిసభ కధ్యక్షతవహించిన శ్రీ ప. యజ్ఞాసీగారు ఆంధ్రులసంస్కృతిని, గుణశీలములను తెల్పి, తమ కాంధ్రులయెడగల యభిమానమును వెల్లడించిరి. ప్రథమసభకు కొన్నివేల ప్రజలువచ్చి ఉపన్యాసములనువిని సంతసించిరి. తరువాత సభలకును పురమునందలి ఆంధ్రులు వందలాదిగావచ్చి తమఉత్సాహమును వెల్లడించిరి. కార్యక్రమానంతరము శ్రీ వద్దూరి సూర్యనారాయణగారు పరిషత్తువారిపక్షమున ఉత్సవము జయప్రదముగా జరుగుటలో సహాయపడినవారందరకును, వందనములనర్పించిరి. మ. ఘ. వ. శ్రీ నిజాంప్రభువరేణ్యులకు రాజభక్తిపురస్సరములగు సవినయవందనశతమును ప్రత్యేకముగా నర్పించిరి. మ. ఘ. వ. శ్రీ నిజాంప్రభుత్వమునకును, ప్రారంభకులగు నవాబ్ సర్ మెహిదీ యార్జంగ్ బహద్దరువారికిని, అగ్రాసనాధిపతులగు సర్ సర్వేపల్లి వారికిని, ఇతరసభల కధ్యక్షతవహించిన మహనీయులకును, ఉపన్యాసకులకును, ఉత్సవమున పాల్గొన్న పురజనులకును పరిషత్తువారు ధన్యవాదముల నర్పించిరి.

ప్రారంభకులయొక్కయు, ఆహ్వానమొసగిన పరిషదధ్యక్షులగు శ్రీ ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారియొక్కయు, అధ్యక్షుల

వారియొక్క ఉపన్యాసముల నుండి కొన్ని భాగములు క్రింద అనువదింప బడుచున్నవి. ఉత్సవము జయప్రదముగా జరుగవలెనని కోరుచు పంపిన కొన్ని సందేశములను క్రింద పొందుపరచుచున్నాము.

సందేశములు :

1. శ్రీ శ్రీ శ్రీ సాహిత్యసామ్రాట్ మహారాజా విక్రమదేవవర్మ బహద్దూరు, జయపురం మహారాజావారు:- "పరిషదుత్సవమునకు రాలేనందులకు చింతిల్లుచున్నాను. సభ జయప్రదముగా జరుగుగాక!"

2. శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు, నెల్లూరు:- "సభ జయప్రదముగా జరుగుగాక అని కోరుచున్నాను."

3. శ్రీ శ్రీ శ్రీ పిఠాపురం యువరాజావారు:—

"మీ ఉత్సవసందర్భమున, నా అభినందనముల నంపుచు, మీ పరిషత్తు విజయవంతమగుగాక యని కోరుచున్నాను. మీ పరిషత్తుద్వారమున మీరు ఆంధ్రభాషయొక్క మహోన్నత సంప్రదాయమును వృద్ధిపొందింతురుగాక! మానవలోకమే విశ్వవిజ్ఞానమునకై నిర్విరామముగా సాగుచున్నదో, ఆంధ్రభాషను అట్టి విజ్ఞానవిస్తారమునకు తోడ్పడు మహాంశముగా నొనర్తురుగాక!"

4. శ్రీ సర్ ముత్తా వెంకటసుబ్బారావుగారు:—

"మీ ఉత్సవ విజయమునకు నా మనఃపూర్వకమైన కోరికలు."

5. శ్రీమతి సరోజినీదేవిగారు:—

"సర్ సర్వేపల్లివంటి ప్రఖ్యాతాంధ్రపుత్రుని యాశీర్వాదముల నొందగల్గుట పరిషత్తువారి యదృష్టమని తప్పక చెప్పనగును.

హిందూదేశమునందును, ఖండాంతరములందును, బహుప్రజానీకమున కానందమును విజ్ఞానమును ఒసగిన ఆ మధురకంఠము నుండి వెలువడు, మహత్తర విజ్ఞానవాక్కులందలి సుధువును గ్రోలు అపూర్వావకాశమును పొందజాలనందులకు మిక్కిలి చింతిల్లుచున్నాను."

6. డాక్టరు వంగల శివరాం, పి. హెచ్ డి గారు:—

"మీ ఆహ్వానమునకు వందనములు . . ఇప్పుడే ఆహ్వానము చేరినది. కావున రాజాలనందులకు చింతిల్లుచున్నాను. మీ ఉత్సవము జయప్రదముగా జరుగవలెనని ఆశించుచున్నాను. మీ నాయకత్వమున పరిషత్తు అభివృద్ధియగుననుటకు సందేహములేదు మద్రాసు రాజధానికిబయట నిజాం రాష్ట్రములోనే బహుసంఖ్యాకులగు ఆంధ్రులున్నారు. కాబట్టి మీ సంస్థవంటి పరిషత్తు యొక్క కృషిచే ఆంధ్రసాహిత్యము, విజ్ఞానము, కళలు అభివృద్ధికావలసి యున్నవి. మరల ఉత్సవ విజయము కోరుచున్నాను"

7. డాక్టరు కె. ఆర్. సుబ్రహ్మణ్యం, పి. హెచ్. డి గారు:—

"మీ ఆహ్వానమునకు కృతజ్ఞుడను ఇంటిలో యిబ్బందులచే రాజాలనందులకు చింతిల్లుచున్నాను. మీ యాతిథ్యమును స్వీకరింప జాలనందులకు విచారము. కాని యెప్పుడో చెప్పజాలను గాని, వచ్చి తను పరిచయభాగ్యమును బడయుదును . ...శ్రీ రామకృష్ణ పండితులకు నా నమస్కృతులు."

8. శ్రీ తలిసెట్టి రామారావుగారు, బి. ఏ. బి. ఎల్; అసిస్టెంట్ దివాన్, జయపురసంస్థానము:— మహారాజావారితోపాటు నేనును రాజాలనందులకు చింతిల్లుచున్నాను త్వరలోవచ్చి మీ యందరిని చూడగలనని ఆశించుచున్నాను"

9. శ్రీ తెలికచర్ల వెంకటరత్నంగారు, ఎం. ఏ., కార్యదర్శి, నవ్య సాహిత్యపరిషత్తు:— "ఉత్సవ విజయమునకు మనఃపూర్వ కాశాసనములు. ఇట్టి శుభతరుణమున కార్యక్రమము నారంభించు మీ పరిషత్తు చిరస్థాయియై దినదినాభివృద్ధి పొందుగాక! ఆంధ్రభాషా సాహిత్యములకు తొంటియున్నతిని పొందజేయుటకు మీకృషి సాయపడుగాక!"

10. శ్రీ గడియారం వెంకటశేషశాస్త్రిగారు, శివభారత గ్రంథకర్తలు:— "వ్యవధిలేమిచే అవసరకార్యములతో విద్వద్గోష్ఠిలోఁ బాల్గొనఁజాలమికిఁ జింతిల్లుచు, తమ యాదరమునకుఁ గృతజ్ఞతఁ దెల్పుచున్నాను. మీ మహోద్యమము నైజామాంధ్రమునకేగాక విశాలాంధ్రమునకుఁగూడ ఆదర్శకము ప్రోత్సాహకము కాఁగలదని ఆశించుచున్నాను తను ఈ సమావేశము జయోపేతముగా నిర్వహింపబడుగాక యని కోరుచున్నాను."

11. శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు, సంస్కృత కళాశాల, నెల్లూరు:— "సాహిత్యము మధురదర్శనము. ఈ తత్వమును ఎపుడో తెలుగుహృదయమే గ్రహించినది. దాని దార్శనికత ఎటువంటిదో వివరంగా నిరూపించి గ్రంథము వ్రాయించడము అవసరము. ఈ పరిషత్తు ఈ భారము వహించాలి. నేడు నిజాంప్రభుపాలిత మవుతూవున్న ప్రదేశంలోనే పూర్వము తీయని సాహిత్యదర్శన బీజములు నాటబడినవి. ఇపుడు నిజాంప్రభువు పర్యవేక్షణముననే సాహిత్యదర్శనము వెలువడుగావుత! శ్రీ నిజాంప్రభువు ప్రతిభ సాహిత్యదర్శనమును ప్రకాశింపజేసి సుప్రసిద్ధమగుగావుత! ఈ కార్యము సాహిత్యపరిషత్తునకు శుభసూచకమౌగావుత."

12 శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు, బరంపురం —

"తాము ఎంతో యాదరముతో వ్రాసిన జాబు అందినది తాము జరుపదలచిన విద్వత్సమావేశము జయావహమై తక్కిన సారస్వతపరిషత్తులకు వాగ్దేవ్యారాధనమున మార్గదర్శకముగుగాక"

శ్రీ ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారి స్వాగతవాక్యములు

'స్వదేశ రాజ్యములలో ప్రధానమగు రాజ్యముయొక్క రాజధానికి మిమ్మాహ్వానించుచున్నాను మా పరిషత్సభమున తమకచ్చు ఈ యాహ్వానము ఎంతసమర్థమైనదో అంత హృదయపూర్వకమైనది మాపిలుపు నంగీకరించి వచ్చినందులకు మా కృతజ్ఞులము

ఈ నగరరాజమును పరదేశయాత్రికులు ఆశ్చర్యముతో 'భాగ్యనగర' మనియు, Wonder of the Orient అనియు పిలచిరి ఈ మహాదేశము బహుజాతి మతములకు కూడలియగుట భగవత్సంకల్పము. కావున అది సర్వజాతి జీవితమునకు, సర్వవిజ్ఞాన సమ్మేళనమునకు తావలమైనది పురాణకాలమున ఆర్యులు, ద్రావిడులును, చారిత్రిక కాలమున హిందూ ముసల్మానులును నిచ్చట మిత్రులుగా నివసించుటకు కలిసిరి బౌద్ధ, జైన, హిందూ, శైవ మతములు మొలచుటను, తరువాత ఇస్లాంమతమును ఇచ్చటిజనులకు మతసంప్రదాయము తెలిసెను. దక్షిణాపథమునందలి యరణ్యమునందే శ్రీరాముడు 'తన వనవాసకాలమున పర్ణశాలను నిర్మించుకొని నివసించుచు, తదుపరి, శిలలనైనను కరిగించు, నీటినైనను శోషించు తన సీతావియోగ దుఃఖము ననుభవించెను బౌద్ధచిత్రములకు ఇచ్చటి అజంతావర్ణశ్రేణి ఆలంబనము మొయ్యను ఇచ్చటనే చెరువులక్రింది వ్యవసాయమునకు గొప్పవసతులను

శిల్పించుచు, భాషా సాహిత్య పోషణము గావించుచు బహు దుర్గదేవా లయ నిర్మాణకౌశలమును చూపించుచు కాకతీయుల ఆంధ్రసామ్రాజ్యము పెరిగి నశించెను. ఈ మైదానమున తెనుగు, కన్నడము, మహారాష్ట్రము, సంస్కృతము, ఉర్దూ, ఫారసీ, అరబ్బీ భాషలు ప్రజల మతసాహిత్య వాహనములై, తమ శాశ్వత సంప్రదాయములను ప్రజలకిచ్చెను. కొండాపురమున లభించిన సామగ్రినిబట్టి తెలంగాణ మత్యంత ప్రాచీన నాగరికతా సంస్కృతుల కాలవాలమని కన్పట్టుచున్నది. బహుశః నీసామగ్రి విస్మృతాంధ్ర చరిత్రాధ్యాయమునకు మార్గమును చూపవచ్చును.

ముసల్మానులు ఈప్రాంతమున గొప్పసామ్రాజ్య ప్రతినిధులుగను, గొప్ప నాగరికతా నాయకులుగను వచ్చిరి. మనస్తాపము, అసూయ, అనుమానము, స్వార్థము మొదలైనవి ప్రతి యుద్ధానంతర పరిణామములుగా నుండును కాని ముసల్మానులు యిచ్చట చిరస్థావరమేర్పరచుకొనినతరువాత, దేశమును ప్రేమించుచు, దేశపుత్రులై, తమప్రభుత్వమందు యిచ్చటిప్రజల నమ్మకమును చూరగొనిరనుటలో నెట్టి అభ్యంతరములేదు. దేశీయులకు గొప్ప ప్రభుత్వపదవులనిచ్చి నమ్మి వారిని కృతజ్ఞుల గావించుకొనిరి. స్థానికపాలనమును, సాంఘిక జీవనమును వారు ముట్టలేదు. వారు ప్రజలభాషలను చదివి, తత్కవుల నాదరించి, యాస్థానములందుంచుకొనిరి ”

తరువాత ఇచ్చటి ముసల్మానులు పోషించినకవులను, వారిలో కొందరురచించిన గ్రంథములను పేర్కొని, యిట్టిరచనలవలన భాషల కెట్టిలాభము కలిగెనో తెలిపిరి.

"చిరకీర్తనీయులగు ప్రథమ ఆసఫ్జా స్వతంత్రులగుట గొప్ప విషయము. మూడు భిన్న భాషలుమాటలాడు మూడు భిన్న జాతులు ఏకఛ్ఛత్రముక్రిందికి తేబడుటయు, ప్రభువు వారిమధ్య నివసించుటయు తటస్థించెను. ఈవిషయము ఉభయులలో చాల పరివర్తనము కల్గించి రాజెక్కడనో ఢిల్లీలో దూరముననున్నాడనియు నచ్చటనున్నది తమకు క్షేమకల్గించు నధికారవర్గమే యను నభిప్రాయము ప్రజలలోనశించెను. ఈవిషయము రాజప్రజల పరస్పర సిద్ధాంతమునకు పునాదియయ్యెను."

"ప్రస్తుత ప్రభువరేణ్యుల రాజ్యకాలము దక్షిణాపథ చరిత్రము నందత్యుచ్చకాలము. ఈకాలమున మహాకార్యములు జరుగుటయే గాక, భావ్యభ్యుదయము బీజావాపము కావింపబడినది. ప్రభువరేణ్యు లొక యద్భుతవ్యక్తి! వారియందు, రాజవైభవమును, రాజకార్యవేత్త యొక్క బుద్ధిసూక్ష్మతయును, ఋషిశ్రేష్ఠుని నియతజీవితమును, కవికుమారుని రసహృదయమును సమ్మిళితములై యున్నవి. దీర్ఘాయురస్తు!"

తరువాత శ్రీవారి రాజ్యకాలమునజరిగిన మహాకార్యముల నుగ్గడించుచు, ఉస్మానియా విశ్వవిద్యాలయమునగూర్చి చెప్పుచు నిట్లనిరి:- "ఈ విద్యాలయము దేశభాషలలో నొకటియగు ఉర్దూను ఉన్నత విద్యావిధానమునకు బోధనభాషగానొనర్చి దేశభాషలు జీవవంతములని నిరూపించి యీ దేశముయొక్క యాత్మగౌరవమును కాపాడెను. భాష యొకదేశముయొక్క ప్రాణవాయువు. దానికవిభాస్యంకేతము లిపి. యూరపుఖండములో భాషలనేకములును లిపియొక్కటే యయిన మనకు భాష ఒక్కటేఅయి లిపులనేకములుగా నున్నవి......ఇట్టి నూతనోజ్జీవనములో నిండియున్నకాలమున మాపరిషత్తు ప్రారంభమైనది.

"విద్యాచక్రవర్తి బిరుదాంకితులగు ప్రభువరేణ్యులప్రేరణ, సీసంస్కృతి నిర్మాణమున యథాశక్తి పనిచేయుటకు మాపరిషత్తు తలపడినది. ఈ సంస్కృతికి భాష, మతము, జాతి, యను అంతరాయములు కాజాలవు. సాహిత్యశరీరముతో, విజ్ఞానమూలమున నానందసంధానమే దాని పరమాశయము. ఇట్టి పవిత్రోద్దేశముతో నిది స్థాపింపబడినది. ...... సాహిత్యపిపాసువుల నందరను మేమొనర్పు కృషిమూలమున మమ్ములను బరీక్షించి, మాకు వలసిన సహాయమును చేయుచు, మాకు తోడ్పడవలెనని ప్రార్థించుచున్నాము."

"మహాశయులారా! ఈ యుత్సవమునకు మరల మీకు హృదయపూర్వకముగ స్వాగతము నిచ్చుచున్నాను. ఆధునిక హైదరాబాదు రాజ్యనిర్మాతలును, సాహిత్యపిపాసువుల కందరకును తమ సాహిత్య సంస్కృత్యభిమానముతో మార్గదర్శకులును అగు మ. ఘ. వ. శ్రీ నిజాం ప్రభువరేణ్యునకు మా మనఃపూర్వకమైన కృతజ్ఞతను సవినయముగా సర్పించుచున్నాము"

కార్యదర్శి నివేదిక:—

హైదరాబాదాంధ్ర సాహిత్యపరిషత్తు 1941 మధ్యభాగమున అనగా రెండున్నరసంవత్సరములక్రిందట సమావేశమైన భాషాసాహిత్యాభిప్రియములుగల కొలదిమంది పండితరచయితలచే స్థాపింపబడినది. ఈ క్రిందివి దాని ఉద్దేశములు:—

(1) హిందూ ముసలాను జాతులకు సాంస్కృతిక, వైజ్ఞానిక, ఆధ్యాత్మికమైన సద్భావమును నెలకొల్పునట్టి ఉదాత్తగ్రంథములనువ్రకటించుట.

(2) మ. ఘ. వ. శ్రీ నిజాం రాష్ట్రములో దొరికెడి అప్రకటిత గ్రంథములను పోగుచేసి జాగ్రత్తపరచి వీలువెంట ప్రకటించుట.

(3) ఆంధ్రభాషా సాహిత్యములో పరిశోధనలు సలుపుట.

(4) ఆంధ్రులయొక్క సాహిత్యచరిత్ర సంస్కృతులకు సంబంధించిన గ్రంథములు ఇంగ్లీషు, హిందూస్థాని భాషలలో ప్రచురించుట.

(5) ఆంధ్రభాషా సాహిత్యాభివృద్ధికి యథాశక్తిగా తోడ్పడుట.

హిందూ ముసల్మానులు వేనవేల సంవత్సరములనుండి కలిసియున్నను, ఒండొరుల సాహిత్యసంస్కృతులను తెలిసికొనుటకు యత్నింపకపోవుట మిక్కిలి విచారకరము. ఇచ్చట చాలకాలము ఫారసీభాష రాజభాషగా నుండెను. తరువాత ఉర్దూ దానిస్థాన మాక్రమించినది. హిందూపౌరులు యీ రెండుభాషలను చదివినను వీనియందలి బహుళసాహిత్యమును అనువదించు ప్రయత్నము పూర్వముగాని, ఇప్పుడుగాని, చేయబడియుండలేదు. యూరోపు భాషలలోనికి పరివర్తింపబడిన అనేక ఉద్గ్రంథములు మన దేశభాషలలోనికి పరివర్తింపబడి యుండలేదు. నేను పారసీక వాఙ్మయచరిత్రనుండి కొన్ని అధ్యాయములను పదిసంవత్సరములక్రిందట భారతిలో ప్రచురించినపుడు తమకిది నూతనవిషయమనియు, ముసల్మానులకింత గొప్పసాహిత్యము కలదని తమకెన్నడును తెలియదనియు చాలమంది నాకు ఉత్తరములను వ్రాసిరి. ఇస్లామ్ సాహిత్యమునుగూర్చి మనప్రక్క నివసించుచున్న సోదరులలో ఇంతయజ్ఞానము ప్రబలియున్నది. ముసల్మానులుకూడ ఇతర సాహిత్యములనుగూర్చి ఇట్టిస్థితిలోనే ఉన్నారు. దీనికి ఫలిత

ముగ ఆధ్యాత్మికముగ, వైజ్ఞానికముగ, ఈ రెండు జాతులవారును దూరదూరమున ఉన్నారు. వీరిలో సద్భావమేర్పడకున్న జాతీయైక్యత విజ్ఞాన సహకారము అసంభవములు. దక్షిణదేశమున నివసించుచున్న మూడుకోట్ల ఆంధ్రులకు మాతృభాషఅయిన తెలుగుభాషలో పైన చెప్పబడిన సద్భావమును కల్గించెడి గ్రంథప్రచురణ మూలముగా విజ్ఞానసహకారమును యథాశక్తి సమకూర్చుటకై ఈపరిషత్తు స్థాపింపబడినది. ఈ ఉద్దేశముతోనే మా ప్రచురణములలో పవిత్ర ఖురాన్ గ్రంథ పరివర్తనమును మెహమ్మదు ప్రవక్తయొక్క జీవితచరిత్రమున, వారి పవిత్రవాక్యములను, పారసీక వాఙ్మయచరిత్రను, ఉర్దూవాఙ్మయ చరిత్రను ప్రకటింప నిశ్చయించినాము. మరియు ముసల్మాను ప్రభువుల పాలన వ్రాయబడినట్టియు, ముసల్మాను పండితులచే వ్రాయబడినట్టియు, తెలుగు గ్రంథములనుకూడ ప్రచురింప దలచినాము.

మొదట ఉల్లేఖించిన ఆశయములలో మొదటిది మాకు మిక్కిలి ముఖ్యమైనది. తదాశయపూర్తికై మాపరిషత్తు ఎక్కువగా పాటుపడును. నేటి మన అధ్యక్షులు నానాజాతిసమితి స్థాపించిన వైజ్ఞానిక సహకారసభలో సభ్యులుగా చాలకాలము ఉండియున్నారు. కావున ఆవిషయమై మనకు తెలుపుటకు వారికంటె సమర్థులెవ్వరుందురు."

తిరువాత పరిషత్ప్రచురణములనుగూర్చి ప్రత్యేకముగా ముచ్చటించిరి. (వీనిపట్టిక వెనుక యియ్యబడినది)"

"మా పరిషత్తు అపూర్వనీయములగు వాగ్దానములను చేయలేదు; పత్రికలలో ప్రచారమునకు పూనుకొనలేదు; ఉపన్యాసవేదికలపై గర్జించలేదు; చందాలకొరకై తిరుగలేదు! ప్రాతినిధ్యము వహిం

చలేదు; భవిష్యత్తు కాలము గూడ పైపనులను చేయుట మా ఉద్దేశ కాదు. మేము చేయుచున్న పనిని రహస్యముగా ఉంచలేదు. మేము ప్రచురించు ప్రతిగ్రంథము తుదను మా ఉద్దేశములను, ప్రచురిత గ్రంథ పట్టికను, ప్రచురింపనున్న గ్రంథములను, ఉల్లేఖించుచునే ఉన్నాము. ఈ ప్రచారము మాకు చాలును.

సభ్యత్వవిషయమున సుప్రసిద్ధులగు రచయితలకు, పండితులకు పరిషదాశయములను సంపూర్ణముగా అంగీకరించువారికి మాత్రమే అవకాశము కలదు. పరిషదాశయములకు సహకారము చేయు పండితుల కందరకును నిందు తావు కలదు. సుప్రసిద్ధాంధ్రులను కొందరిని మా పరిషత్తులో గౌరవసభ్యులుగా ఉండుటకు వేడితిమి. వారందులకంగీకరించిరి. నేటి ఉత్సవాధ్యక్షులగు డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ మహాశయులు మా పరిషత్తు సభ్యులని సగర్వముగా చెప్పుకొనుచున్నాము. (ఇతర గౌరవసభ్యుల పేర్లు వెనుక ప్రకటింపబడినవి)

ఈ రెండున్నర సంవత్సరములలో మాకు సహాయముచేసిన పండితులకందరకు మా వందనములు. ప్రత్యేకముగా డాక్టర్ యస్. వేంకటరమణయ్యగారికిని, డాక్టర్ రాఘవన్ గారికిని వందనములర్పించుచున్నాము. శ్రీ వేంకటరమణయ్యగారు మేము ప్రకటింపబోవు తపతీసంవరణ కావ్యమునకు చారిత్రికోపోద్ఘాతము వ్రాయ నంగీకరించిరి. శ్రీ రాఘవన్ గారు హైదరాబాదు రాష్ట్రమున పదునేడవ శతాబ్దమున నివసించిన, అక్బరుషా మహామహునిచే రచింపబడిన, శృంగారమంజరి యను పేరుగల ఒక లక్షణగ్రంథమును ప్రచురణకనువగు ప్రతిని తయారుచేసి మాకిచ్చెదమనిరి. మాకు తోడ్పడిన మహాశయుల కందరకు వందనములు.

మా విమర్శకులకొక విన్నపము మేము చేసినట్టియు, చేయను న్నట్టియు సేవను గమనింపుడు ఆంధ్రభాషా సాహిత్యసేవ చేయుటయు, హిందూ మసల్మానుల వైజ్ఞానిక సహకారమును మా ముఖ్యాశయములు మాయందు మీకు ప్రేమయున్న యెడల మీరుచేయదలచిన సహకారమును బుద్ధిపూర్వకముగాచేయుడు లేని వో మాపైకిరాకుడు."

నవాబ్ సర్ వెంకాది యార్‌జంగ్ బహాదరువారి ప్రారంభోపన్యాసము

"మీ పరిషత్తుయొక్క ప్రథమసమావేశమును ప్రారంభించుచు ఆర్ద్రమైన ఉత్సాహసందేశమును, పరిషత్తుచేయు మహాకార్యము జయప్రదముగా జరుగవలయునను కోరికను, వెలిబుచ్చుచున్నాను. ఇట్లుచేయుటలో నాపక్షముననేగాక నేను ప్రాతినిధ్యమునువహించు ప్రభుత్వపక్షమున గూడ మాటలాడుచున్నాను. మీరు అధ్యక్షుని ఎన్నుకొనుటలో ఘనకార్యమొనరించితిరి. ఆయన ప్రఖ్యాతహైందవుడు. ఆయన కీర్తి ఖండాంతరములందుకూడ వ్యాపించియున్నది. అందులకై మిమ్ముల నభినందించుచున్నాను.

తెలుగుజాతికి గొప్ప ప్రాచీనసంస్కృతి కలదు. అది ఇక్కడపుట్టిన గొప్ప సాహిత్యము మూలమునను, ఇప్పటివరకు రక్షింపబడుచు దేశమంతటను వ్యాప్తమైయున్న మహోన్నతములైన ప్రాచీన వస్తుమూలముననను, ఈ దేశమునందంతటను అచ్చుగుద్దినట్లున్నది. దక్షిణాపథముయొక్క సంయుక్తనాగరికతలో ఈవిధముగా మీరు పాల్గొనియున్నారు. వ్యవసాయము, పరిశ్రమలు, వర్తకము, విద్య దవృత్తులు, మొదలగు అన్నిటియందును మీ తెలుగుజాతియొక్క ప్రతినిధులుకలరు. ఈరాజ్యమున మనమనుభవించు స్వాతంత్ర్యమున అన్ని

జాతులతోపాటు మీరుకూడ పాల్గొనుచున్నారు. కరుణామయులగు మన ప్రభువరేణ్యులు తమ ప్రజలయెడల చూపు శ్రద్ధయందును, కల్గించు సౌఖ్యమునందును, మీకుకూడ పాలుకలదు.

రాష్ట్రమునందున్న పరిషత్తులలో మీపరిషత్తు మిక్కిలి ఉపయోగముగా ఉన్నదనుటలో నాకెట్టి అనుమానమునులేదు. పరిశోధనమును, గ్రంథప్రచురణమును, విరివిగా చేయవలెనని మీపరిషత్తు ఆశించుచున్నది. ఆంధ్రభాషా సాహిత్యమందు మీరుచేయు పరిశోధనలును, జాతీయసంస్కృతి విషయములలోను చేయు కృషియు మిక్కిలి విలువ కలిగినవిగా ఉండునని నాకు నమ్మకము. మీరు ప్రచురింపబోవు గ్రంథములలో ఒక ముస్లింగురువుచే రచింపబడిన తెలుగుగ్రంథ మున్నదనియు దాని సంస్కృతానువాదము ఇటీవలనే దొరకినదనియు తెలిసికొనుట నాకు ముదావహము. నేను ఉస్మానియా విశ్వవిద్యాలయోపాధ్యక్షుడనుగావున, మా విశ్వవిద్యాలయముకూడ ఆంధ్రమున పరిశోధనను ప్రోత్సహించుచున్నదనియు, తద్భాషాపఠనమును పెంపొందించుటకు సహకారము చేయుచున్నదనియు చెప్పుటకు సంతసించుచున్నాను. ఆంధ్రమున గొప్పపండితులై, తెలుగుభాష మాటలాడు స్థలములనెల్ల మన్ననలను పొందుచున్న మీపరిష దధ్యక్షులైన ఆచార్య సుబ్బారావుగారు మా విశ్వవిద్యాలయమున తెలుగుశాఖకు అధ్యక్షుడుగానుండుట మా అదృష్టము.

మీ ఆశయములయెడల నాకున్న సానుభూతికి చిహ్నముగా నా అధీనములోనున్న నిధినుండి రెండువేలరూపాయలను విరాళముగా ఇచ్చుచున్నాను.

మరల మీ పరిషత్తు విజయవంతముగా సాగి భావ్యభివృద్ధిని పొంది, ముందుంచుకొనిన మహాశయములను బడయుగాక అని ఆశించుచున్నాను."

శ్రీ జి. యజ్దాని, ఓ. బి. ఇ. గారి ఉపన్యాస సారాంశము:—

"ఈసభకు నన్నధ్యక్షునిగా కోరినందులకు మీ పరిషత్కార్య వర్గమునకు వందనము లర్పించుచున్నాను. నాకు తెనుగుభాషరాదని ఒప్పుకొనవలయును. కాని ముప్పది సంవత్సరములుగా ఆంధ్రదేశమునకు సంబంధించిన కళాసంస్కృతులను తెలుసుకొనుటలో విద్యార్థిగా నున్నానని మీకు నచ్చజెప్పుచున్నాను. నేనుచేయు పరిశోధనలలో ఆంధ్రదేశీయులయొక్క ఒకగొప్ప విశిష్టగుణము నాకునచ్చినది. ఆంధ్రులు మొదటినుండియు విశాలహృదయులై, గ్రహణశక్తి కలిగి, ఇతరజాతులయొక్క మతమునందును, సంస్కృతియందును, కళలందును, ఉన్న మహత్తరగుణములను గ్రహించుటలో సమర్థులైయుండిరి. ఒకకాలమందు ఆంధ్రరాజులు తమమీదికివచ్చు మౌర్యచక్రవర్తుల దండయాత్రలను తమస్థితికి భంగముకాకుండ నిలుపగలుగుటయేగాక, ఒకతరుణమున సుంగరాజులనోడించి వారిదేశములో చాలభాగ మాక్రమించుకొనిరి. మతవిషయమున బౌద్ధమును, బ్రాహ్మణమతమును సులభముగా అంగీకరించిరి. శిలాశిల్ప భవననిర్మాణాది లలితకళా విషయములయందు కొన్ని ఫారసీక పద్ధతులను అవలంబించిరి. ఇవి నేను పైన చెప్పిన అభిప్రాయమున కుదాహరణములు. కాని వారి రాజ్యాంగము వలె వారి కళాజ్ఞానముకూడా స్వతంత్రమై ఇతరులది గ్రహించుటచే

వ్యక్తిత్వము కోల్పోవలేదు. నిశ్చయముగా క్రీస్తు పూర్వపు సహస్రాబ్దములలోను, క్రీస్తుతరువాతి ప్రథమశతాబ్దములందును, వారి చిత్రకళ, ప్రతిమాకల్పనము, భవననిర్మాణము, ఉత్తరదేశమునందలి వాటికంటె ప్రతిభయందును, నిర్మాణ కౌశలమునందును, ఉన్నతములై, స్వతంత్రములై ఉన్నవి. అట్లనుటకు కారణమేమన, అజంతా మొదలగుస్థలములందు క్రీస్తుపూర్వము రెండవశతాబ్దమునందలి శాసనములును, వానియందున్న శిల్పచాతుర్యమును చూచిన తత్పరిణామమునకు కొన్నిశతాబ్దములు పట్టియుండునని చెప్పనగును.

అట్టి విశాలదృష్టియు, సౌందర్యపిపాసయు, సత్యాన్వేషణమును, ముసల్మానుల దక్షిణదేశాగమనమునకు పూర్వము నాలుగువందల సంవత్సరములు పరిపాలించిన కాకతీయులకాలమునందలి సంస్కృతి వ్యాపారములందు చూడగలము. కాకతీయులు గొప్ప కళాసాహిత్యపోషకులైరి. కాని వారి పరిపాలనమున ఆంధ్రసాహిత్యము సంస్కృతముతో నిండిపోయెను. అనగా, సంస్కృత సాహిత్య ప్రక్రియలు, సూత్రములు, ఆశయములు పూర్తిగా అవలంబింపబడెను. కాకతీయులుకూడ గొప్ప భవననిర్మాతలు. తన్నిర్మాణమునందు ఉత్తర దక్షిణదేశ నిర్మాణపద్ధతులు సమ్మిశ్రమునొందెను. వారు దేశములోని ముఖ్యవృత్తియగు వ్యవసాయమును అభివృద్ధిపరచుటకై గొప్ప తటాకములను నిర్మించిరి. రామప్ప, పాకాల, లక్నావరము, పాన్‌గల్, మొదలగు తటాకములిట్టివే. తన్నిర్మాణము వారి ఇంజనీరింగు జ్ఞానమును తెలుపుచున్నది. ఆంధ్రదేశము పురాతనకాలమునుండి నేతపరిశ్రమకు స్థానమైయున్నది. గ్రీకు భూగోళశాస్త్రవేత్తలు, తూర్పుతీరమున 'మైసాల' అను ఓడ

## అధ్యక్ష భాషణము

"మీ పరిషత్తుయొక్క ప్రథమోత్సవమునకు వచ్చుట నాకెంతో సంతోషకరమే. హిందూదేశము జాత్యైక్యతగాని, మతైక్యతగాని కలదికాదు. కాని ఆధ్యాత్మికైక్యత కలదియని చెప్పనగును. అన్నిజాతులను అన్నిమతములను ఈ ఐక్యతా సంపాదనముకొరకు ఉన్నతమైనట్టియు శాశ్వతమైనట్టియు ఏదైనంతు విజ్ఞానమును వారు ఈ దేశమున కల్పించిరి కావున విజ్ఞానము ముఖ్యాశయముగా గల ఈ పరిషదుత్సవమున ఎట్టి జాతిభేదముగాని మతభేదముగాని లేక హిందు ముసల్మానులును, తదితరులును కూడ పాల్గొనుట సమంజసము. ఏలయన, విజ్ఞానము సార్వజనీనమై మానవబుద్ధికంతటి ఉన్నతినొసగు విషయము. ముసల్మానుగు "నవాబ్ సర్ మెహిదియార్జంగ్ గారు సభను ప్రారంభించిరి హిందువుడనగు నేను అధ్యక్షుడనగా నున్నాను. హిందువుడగు ఆచార్య సుబ్బారావుగారు పరిషదధ్యక్షుడు. ముసల్మానగు ఖాసింఖాన్‌గారు కార్యదర్శి ఈ సన్నివేశమే విజ్ఞాని విషయముల ఐక్యతకలదని సూచించుచున్నది. విజ్ఞానవిషయము వచ్చినప్పుడు ఆల్బర్టు మెలువటెను విజ్ఞానమనగా నాగరికతయొక్క అంతరాత్మయనియు నాగరికత యనగా విజ్ఞానముయొక్క బాహ్యరూపమనియు చెప్పుదురు. నాగరకతారూపమైన బాహ్యచేష్టలకు విజ్ఞానము విలువకట్టును. ఇట్టిసందర్భములో ఆత్మక్షీణించి విపరిణమించినయడ నాగరకతకూడ క్షైణ్యమును పొందును.

* * *

ఒక మహాశయుని బ్రిటిష నాగరకత లక్షణము లేవియని యడగగా కొన్ని సంకేతముల నిచ్చినరు. మొదటిది 'టీటాపై' రెండవది క్రికెట బ్యాటు' మూడవది 'బైబిలు గ్రంథము' నాల్గవది 'జయింటు స్టాకకంపెనీ' లు (ఉమ్మడి పెట్టుబడిసంఘములు) ఎట్టి నాగరికతయు దంతెవిశిష్టతకలదు. అన్యోన్యభావము, న్యాయము ఓటమి సంతో

షములో గ్రహించుట మొదలగు గుణములకు క్రికెటుగ్యాంగు ఉపలక్షణము. ఇందు ఆటకు వెనుకనున్న భావమేగాని ఆటలో ఓటమి ప్రధానముకాదు. నీవును నీ పొరుగువానిని ఏ అభిప్రాయమునకు వచ్చుటకు వీలులేని సందర్భములో అనునయ మార్గమున అభిప్రాయసామ్యమును పొందుట ఓర్పుతో వెనుకనున్న భావము. అనగా బలప్రదర్శనము కంటె అనునయమార్గము మంచిదని అర్థము. ఇప్పటిజీవితముయొక్క జీవితకు నిలువవలెనన్న నాగరికత వెనుక మనము నమ్మెడు కొన్ని మూలసూత్రము లున్నగాని వీలులేదు బైబిలుగ్రంథము వెనుకనున్న భావమిది. కాని ఆగ్రంథము నాధారము చేసికొని ప్రబలిన నాగరకత ప్రకృతిశాస్త్రముల అభివృద్ధిఫలముగా గలదియగుటచే నిరస్తమగుచున్నది. కావున గొప్పదారు కొద్దిదాగ అను మతవిశ్వాసము అవసరమగుచున్నది. ఉమ్మడిపెట్టుబడికంపెని ఆధునిక నాగరకతలో ముఖ్యాంశము. ఇందలిభావము ప్రస్తుతపు యంత్రశాలలు, కంపెనీలు, మొదలగు ఉద్యమములకు కేంద్రము. ఈ భావముగల ఈస్టుఇండియా కంపెనీయే బ్రిటిషురాజ్యమును మనదేశమున స్థాపించినది. కావున ప్రపంచమందంతటను బ్రిటిషు నాగరకతకు శాసనములు (బల్లపెట్టె లేక ప్రజాప్రభుత్వము) అన్యోన్యభావము (క్రికెటుబ్యాటు) మతము (బైబిలుగ్రంథము) ఉమ్మడిపెట్టుబడి (జాయింటుస్టాక్ కంపెని) అనునవి మూలసూత్రములు. ఇప్పటి నాగరకతయొక్క నిజమైనస్థితి యిది. ఇట్టి నాగరికత క్రమముగా భిన్నమై ఇపుడు అధికారముకొరకై పోట్లా[illegible] దిగినది. ఇది తప్పనిసరి. ఇందువలన మానవులకు ఆశ మిక్కుటమై ప్రపంచమునకు కష్టపుదినములు వచ్చినవి. ఆధునిక నాగరకత ఇట్టి తుచ్ఛావస్థయందున్నప్పుడు అది దగ్ధమగుచున్నప్పుడు మనము ఏమనుకొనవలెను? ఈ నాగరకత ఒక శాపకారణముగ వచ్చినదనియు అది తప్పనిసరిఅనియు తెలిసి మనదృష్టిని విశాలముచేసికొని అసలు నాగరకతయొక్క మూలసూత్రములను ఆకారమును మార్చుకొనవలసి

యున్నది. ఇప్పుడు మానవసంఘమునందున్న నిసర్గ వైవిధ్యము ఆధ్యాత్మిక శూన్యత ఇట్టి విధ్వంసమునకు, సంఘవిప్లవమునకు మూలకారణములు. అట్టి లోపభూయిష్టమైన అసమగ్రమైన నాగరకతకు తలయొగ్గుచున్నాము.

* * *

హిందువులు, ముసల్మానులు, పారశీలు, క్రైస్తవులు కలసి యున్నాశక్తిగ కష్టించి నిర్మించిన మన ఉన్నతసంస్కృతి వేరొకటిదానికంటె భిన్నమైనది. ఇన్నిజాతుల కష్టఫలమే అది యగుట దానియొక్క విశిష్టత. ఈ దేశమున అనాదిగా రాజకీయవేత్తలు, శ్రీమంతులు, పారిశ్రామికులు, కోటీశ్వరులు, గౌరవింపబడలేదు. ఇందలి కోట్ల ప్రజల యొక్క దృష్టిని వీరాకర్షించలేదు ఎవరు మహాత్ములో ఎవరు ఆత్మవేత్తలో ఎవరు స్థితప్రజ్ఞులో అట్టివారే గౌరవింపబడుచుండిరి. ఇప్పటికిని అట్టి పూర్ణపురుషులే మోక్షమార్గదర్శకులే గౌరవింపబడుచున్నారు.

* * *

మానవుడు ఆత్మనే కోలుపోయిన, దానికి ప్రతిఫలముగా దేనిని పొందగలడు? ఆత్మనే కోలుపోయి సకల లోకమంతయు వాడు జయించినను అదినిష్ఫలమే. అనాదినుండి ఇప్పటివరకును ఇదియే మనదేశ సంప్రదాయము దీనినుండి క్రమముగా పతితుడగుచున్నందులకు ఆ మూలసూత్రమును అనుసరించకపోవుటయే కారణము. ఇంతకాలమును దానిని నిరాదరించినాడు. తుదకు ఒకప్పుడయినను మరచినదానిని స్మృతికి తెచ్చుకొనవలసి యున్నది. ఆధునిక మానవుడు కర్తవ్యము నుండి తొలగుటకు ముఖ్యకారణ మొకటికలదు. అతడు ఇప్పటికిని బుద్ధిబలమునే ముఖ్యమనియెంచి అహంప్రత్యయమును జయింపలేక ఆత్మయొక్క ఉన్నతిని గుర్తింపకపోవుటయే. మనశ్శరీరములకు అహంప్రత్యయము మూలము. దానికి (జీవునికి) అస్తిత్వమిచ్చునది ఆత్మ. ఈ దేశమునకు ఆత్మస్వాతంత్ర్యమే ఇవ్వవలయునన్న మనదీమార్గము

ననుసరింపవలయును. మనసంస్కృతి ఇప్పుడు హీనస్థితియందుండుటకు మానవుడు (స్వార్థపరుడగుట) వ్యక్తిత్వ ప్రధానుడగుటయే మూలకారణమని మిత్రుడు సుబ్బారావు తెలిపినాడు. విద్యవలన వచ్చిన జ్ఞానమును ఆత్మస్వాతంత్ర్యమును పరస్పర భిన్నములు. మనము ఇంద్రియ (బుద్ధి) వ్యాపారములనుండి అతీంద్రియ (ఆధ్యాత్మిక) కత్యకు పోనంత వరకు మనసంస్కృతి ఇట్టి హీనస్థితియందే యుండును. సంస్కృతికి సార్వజనీనత కల్పించవలెను. అది లేకపోవుటచే ఆధునిక మానవుడు పతితుడైనాడు.

* * *

స్త్రీ పురుషులలో రసానుభవమునకు మూలభూతమగు మానవ ప్రణయముయొక్క సంకీర్తనము ఉత్తమ సాహిత్యమునకు నికషము. స్త్రీ పురుషునితో సమానత్వము కోరుగాక. ఇప్పుడు సమానత్వము లేదని వాదనగాక. మన సంప్రదాయమును మనము విడువరాదు. పురుషుడుకూడ తన ఉన్నతిని ప్రదర్శించవలసిన అవశ్యకత కలదు. హైందవస్త్రీ ప్రపంచములోకెల్ల శ్రేష్ఠురాలు. సృష్టికర్త సృష్టిక్రమమును అభ్యసించుకాలమున పురుషుని సృజించెననియు పరిణత ప్రజ్ఞుడైనతరువాత స్త్రీని సృజించెననియు చెప్పుదురు. పురుషుని అభ్యున్నతికి స్త్రీయే కారణము. కావున అట్టి స్త్రీ ప్రణయమును చూరగొను యోగ్యత పురుషుడు సంపాదింపవలయును. మానవుల పరస్పర సంబంధమున ఆధిభౌతికదృష్టి ముఖ్యమై ఆత్మ నశించుటచే మనదేశము హీనస్థితియందున్నది. మానవునియందు ఆధ్యాత్మికత్వ ఆధిభౌతికత్వములను రెండును కలవు. ఆధిభౌతికాంశమును పెంచి ఆధ్యాత్మికాంశమును అశ్రద్ధ చేయుచున్నాము. రెండంశలను సమానదృష్టితో చూచుటమన కర్తవ్యము.”



# విజ్ఞానకోశ సంపాదకీయవర్గ ప్రథమ సమావేశ తీర్మానములు.

తెలుగు విజ్ఞానకోశ సంపాదకీయవర్గ ప్రథమ సమావేశము ది 20–3–45 తేదీన గుంటూరులో సర్ కట్టమంచి రామలింగారెడ్డిగారి అధ్యక్షతక్రింద జరిగెను. శ్రీ విస్సా అప్పారావు, డాక్టరు ఆచంట లక్ష్మీపతి, శ్రీ వేమూరి విశ్వనాథశర్మ, డాక్టరు సి. మహాదేవన్, శ్రీ తెలికిచెర్ల వెంకటరత్నం, శ్రీ కురుగంటి సీతారామయ్య, శ్రీ మొహమ్మద్ ఖాసింఖాన్ గార్లు సభకు వచ్చిరి. శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య, శ్రీ రాయప్రోలు సుబ్బారావుగార్లు అనివార్య కారణములచే రాజాలనందుకు తమ విచారమును తెలుపుచు, ఉత్తరములు వ్రాసిరి.

శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి ప్రతిపాదనపై శ్రీ విస్సా అప్పారావుగారు ఉపాధ్యక్షునిగ ఎన్నుకోబడిరి.

పారిభాషిక పదములనుగూర్చి శ్రీ విస్సా అప్పారావుగారు సభలో చేసిన సూచనలపై చర్చజరిగెను. సుప్రసిద్ధమైన పదములు విజాతీయములైనను, వానిని అనువదింప నక్కరలేదని శ్రీ విస్సా అప్పారావుగారు చేసిన సూచన ఆమోదింపబడెను. అకారాది క్షకారాంతమువరకు ఒక సంపూర్ణవిషయపట్టికను కార్యదర్శి తయారుచేయవలెనని తీర్మానింపబడెను. డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు వైద్యసంబంధమైనట్టియు, శ్రీ విస్సా అప్పారావుగారు సైన్సుకు సంబంధించినట్టియు విషయపట్టికలను వ్రాయుటకు వాగ్దానమిచ్చిరి. ఈపని వారిపరమొనర్చుచు తీర్మానింపబడెను.

విజ్ఞానకోశము అ కారాదిగానే ప్రకటింపవలెనని శ్రీ ఆచంట లక్ష్మీపతిగారు ప్రతిపాదించిరి. తీర్మానము ఏకగ్రీవముగా ఆమోదింపబడెను.

విజ్ఞానకోశము 16 సంపుటములలో ప్రకటింప బడవలెననియు ఒక్కొక్క సంపుటము తొమ్మిదేసివందల పుటలు కలిగినదై ఉండవలెననియు, 1/4 డెమ్మీసైజున ఉండవలెననియు తీర్మానింపబడెను.

వివిధ విషయములపై వ్రాయుటకు దేశమందలి విద్వత్ ప్రముఖులను కోరవలెనని తీర్మానింపబడెను. సభ్యులు పలువురు పేర్లను సూచించిరి. వాటితో ఉత్తర ప్రత్యుత్తరములు సలుపవలసినదిగా కార్యదర్శికి అధికార మివ్వబడెను.

ఏ విషయమునకు సంబంధించిన వ్యాసములు ఆ విషయమునకు సంబంధించిన సంపాదకునకు కార్యదర్శి పంపవలెననియు, ఆ వ్యాసములు వారికడనుండి తిరిగి వచ్చినతరువాత వాటిని ఆయా సంపుటములలో గ్రథిత మొనర్పవలెననియు తీర్మానింపబడెను.

# హైదరాబాదాంధ్ర సాహిత్య పరిషత్తు

కొన్ని ప్రచురణములు

ఆదర్శప్రభుత : (మ. ఘ. వ. శ్రీ నిజాం ప్రభువు పంచవింశతి వత్సర పరిపాలనా చరిత్రము) శ్రీ కురుగంటి సీతారామయ్య ఎం. ఏ.

ఖుర ఆ౯ షరీఫ (ఆంధ్రానువాదము):

పదిభాగములుగల ప్రథమసంపుటము 615 పుటలలో

అనువాదకర్త : శ్రీ మొహమ్మద్ ఖాసింఖాన్ ఎం. ఏ.

Handbook of Telugu Literature (ఇంగ్లీషులో)

శ్రీ కురుగంటి సీతారామయ్య ఎం. ఏ.

కథానికా రచన : (ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారి పీఠికతో)

శ్రీ మొహమ్మద్ ఖాసింఖాన్ ఎం. ఏ.

నవ్యాంధ్ర సాహిత్యవీధులు (ప్రతులు లేవు) ద్వితీయముద్రణ ముద్రణలో ఉన్నది.

శ్రీ కురుగంటి సీతారామయ్య ఎం. ఏ.

ప్రాప్తిస్థానము

హైదరాబాదాంధ్ర సాహిత్య పరిషత్తు, నాంపల్లి, హైదరాబాద (దక్కన్)

లేక

నవ్యసాహిత్య పరిషత్తు, గుంటూరు.

---

సిద్ధమవుచున్నవి:

శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారి

శ్రీ మదాంధ్రధ్వన్యాలోకము

శ్రీ మొహమ్మద్ ఖాసింఖాన్ గారి

పారసీక వాఙ్మయచరిత్ర — యూరప్‌లో నవ్యసాహిత్యము

ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారి

Leaders and Landmarks in Telugu Literature